

# కొలువెక్కనోచని బొమ్మ

ఆనందకలశం



ముఖచిత్రం: పుష్ప విజయం

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య

---

వచ్చేసంచికలో
అవసరాల రామకృష్ణారావుగారి
'అది ప్రశ్న-ఇది జవాబు'
నవల రెండవ భాగం చదవండి.



సెప్టెంబరు సంచికలో కథలు చాలా బాగున్నాయి. "చార్వాకం" చదువుతుంటే బానిసల విముక్తికి నాందీ ప్రస్తావన ఆరోజుల్లోనే జరిగిందనిపిస్తుంది. ఆకథ ఉన్నతస్థాయిలో ఉత్తేజపూరితంగా నడిచింది.

డి. యస్. రామారావు,
ఖమ్మం

"సెప్టెంబరు యువ" ముఖచిత్రం ఎంతో బాగుంది. ముఖ్యంగా 'పాంచికడీదేవ్ విషబాణం' పాఠకులందరినీ ఆకర్షిస్తుంది. కొమ్మూరిగారి సీరియల్ చాలా బాగుంటున్నది. రూపాయి విలువ చేసే మా 'యువ' అంతకంటె ఎన్నోరెట్లు విలువయిన నవలలు, సీరియల్స్, కథలు అందిస్తున్నందులకు మాకెంతో ఆనందంగా వుంది.

జయదేవ్, శంకర్, సత్యంగారల కార్టునులు పాఠకులందరికీ కావలసినంత ఆనందాన్ని అందిస్తూ, సంచికకు ఎంతో వన్నె చేకూర్చుతున్నాయి."

సి. ఎస్. ఎన్. మూర్తి,
కొయ్యలగూడెం

సెప్టెంబరు 'యువ'లో 'చార్వాకం' కథానికలాంటి రచనలు యువజనులను నూతన ఆలోచనలకు తీసుకెడుతా యనడంలో ఏలాంటి సందేహంలేదు. మల్లంపల్లి కృష్ణారావుగారి 'చార్వాకం' రచనను మీ పత్రిక ప్రకటించి తన నిర్భయత్వాన్ని రుజువు చేసుకున్నది. ఇలాంటి రచనలే యీనాటి యువజగతికి శిరోధార్యాలు. పీడింపబడే జాతియొక్క 'ఉద్ధరణకు వ్రాయబడే రచనలు 'యువ' భవిష్యత్తులో స్వీకరిస్తుందనటానికి 'చార్వాకం' ఒక దృష్టాంతరం మాత్రమే!

టి. రాంరెడ్డి, డోర్నకల్

సెప్టెంబరు నెల 'యువ'లో ప్రచురింపబడ్డ "మమతా - మానవతా" అనే కథానిక చాలా బాగుంది. రచయిత 'శ్రీ మాసూనా' సృష్టించిన "శ్యామల" పాత్ర నాకుతెలిసిన ఒక 'అభాగ్యురాలి' జీవితం గుర్తుతెచ్చింది. శారద, శ్యామల పాత్రలు సహజంగానూ, వాస్తవానికి దగ్గరగా సృష్టింపబడ్డాయి. "ఇదే నా న్యాయం" సీరియల్ చాలా బాగావుంది. శ్రీ వడ్డాది పాపయ్యగారి చిత్రాలు మొత్తం "యువ"కే క్రొత్త అందాన్నిస్తున్నై.

ప్రతినెలా "యువ" అత్యాకర్షణీయంగా, సర్వాంగసుందరంగా వెలువరిస్తున్న మీకు, మంచిమంచి కథానికలు, సంక్షిప్తనవలలు, సీరియల్సు అందజేస్తున్న రచయిత్రులకు నా ధన్యవాదాలు.

పి. వి. నర్సింహరాజు, నాగార్జునసాగర్


LIFEBUOY
for health

యువ

సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 16 అక్టోబరు, 1967 సంచిక 4

# యుగపురుషుడు

ప్రతి జాతికీ, ఆ జాతిని అభ్యుదయమార్గంలో నడపడానికి, కాలమే కొందరు మహాపురుషులను నిర్దేశిస్తుంది. రాజకీయ రంగంలోగాని, సాంఘిక రంగంలో గాని, సారస్వత రంగంలోగాని ఎవరో ఒక మహాపురుషుడు తన జాతిని అభ్యుదయ మార్గంలో ముందుకు తీసుకునిపోతాడు. అలాంటి మహాపురుషులు తమ వ్యక్తిగత జీవితంలో ఎన్ని సుఖాలను చంపుకుంటారో, ఎన్ని ఆనందాలను త్యాగం చేస్తారో ప్రజలకు తెలియదు. ఆ మహాపురుషులు చేసిన సేవలను, ఉపకారాలను అనుభవించడంమాత్రమే ప్రజలకు తెలుసు. తాము చూపిన మార్గంలో నడిచి, తమ కృషి ఫలితంగా అభ్యుదయాన్ని అందుకున్న తమ జాతి ప్రజల జీవనపరిణామాన్ని చూసి ఆనందించడమే, ఆ మహాపురుషుల కృషికి ఫలితము. అంతకన్నా వారు ఆశించినదేమీ వుండదు. కాని, తమ కృషివల్ల తమ జాతిప్రజల జీవితంలో నూతనపరిణామాన్ని తెచ్చిపెట్టి, తమ కృషి ఫలితంగా తమ జాతిని మునుపటి కన్న ఎక్కువ సంస్కారం కలదానిగాను, ఎక్కువ విజ్ఞానం కలదానిగాను, ఎక్కువ చైతన్యం పొందినదానిగాను చేసిన మహనీయులు, తమ జాతికీ తమ దేశానికీ యుగపురుషులు అవుతారు. వారివల్లనే కదా, వారి జాతిజీవితంలో నూతన యుగం ఏర్పడుతుంది!

అలాంటి యుగపురుషులలో కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ఒకరు. ఆంధ్రజాతికి, ఆంధ్రభాషకు, ఆంధ్రదేశానికీ పంతులుగారు చేసిన సేవ అప్రతి

మానం కాగా; భారత దేశానికంతకూ వారు చేసిన సేవకూడా అపరిమితమే. ఈ మహనీయుడు గతించి ముప్పయిసంవత్సరా లయింది. అంటే యీ నాడు నలభై, నలభైఅయిదు సంవత్సరాల వయస్సుగల వ్యక్తు లెవరికీ, పంతులు గారినిగురించి ఏమీ తెలియదు. ఇలాంటి యుగపురుషుల జీవితచరిత్రలను తెలుసు కోకపోవడంలో, మన జాతికి ఒక ప్రత్యేకత వుంది. మన దేశంలోతప్ప తక్కిన దేశాలన్నింటిలోనూ ఆయా దేశాలలో ప్రభవించిన మహాపురుషులను గురించి జీవిత చరిత్రలు విరివిగా ప్రకటింపబడుతాయి. ఆ దేశపు ప్రజలు వాటిని శ్రద్ధగా చదువు తారు. ఇలాంటి మహాపురుషులు ఉద్భవించిన జాతి మనది, అని వారు గర్వపడు తారు. మనకు అలాటి సాంప్రదాయంలేదు. మన జాతినాయకుల జీవితచరిత్రలు మనం ప్రకటించుకోలేదు. ప్రకటితమైన జీవితచరిత్రలు ఎవరివైనా ఒకటరెండు వుంటే, వాటిని మనం చదవము. ఈ విధంగా మనం మరచిపోతున్న యుగపురుషు లలో కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగా రొకరు.

వారు జీవించియున్నకాలంలో, ఆంధ్రదేశంలో ఎంతోమంది పంతుళ్లు వుండి వుండవచ్చునుగాని, 'పంతులుగారు' అంటేమాత్రం ఒక్క కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారికే వర్తించింది. ఆ రోజులలో పంతులుగారిని ఎరుగనివారు లేరు. వారి కృషిఫలితాలను ఏదోవిధంగా అనుభవించనివారు లేరు.

పంతులుగారిది ఒక దివ్యజీవితము; ఒక కష్టజీవితము; ఒక సేవాపూర్ణమైన జీవితము; ఒక ఆదర్శజీవితము; ఒక ఆశయపూరితమైన జీవితము.

పంతులుగారు సామాన్య కుటుంబంలో జన్మించి, కష్టపడి పైకి వచ్చారు. పైకి వచ్చానుగదా అని, పైనుంచి తన సోదరప్రజలను క్రిందిచూపు చూడకుండా, తన ప్రజలలో కలసిమెలసి వుంటూ, వారిని నైతికంగా, సాంఘికంగా, వైజ్ఞాని కంగా తమ అంతస్తుకు తీసుకురావడానికి నిరంతరమూ కృషి చేశారు. తమ కృషి ఫలోన్ముఖమైనదనే తృప్తి, వారికి చివరిరోజులలో కలిగిందికూడాను.

బైబిలులో చెప్పిన (Three score and ten) పూర్ణాయుర్దాయం. అంటే డెబ్బయిసంవత్సరాలు నిండినతరువాతనే పంతులుగారు స్వర్గస్థులయారు. అంటే, ఆ రోజుల పరిస్థితులలో, డెబ్బయి ఏళ్ళు పూర్ణాయుర్దాయమే. ప్రజాసేవా తత్పరులై, విశ్రాంతి నెరుగని జీవితం గడిపినవారు అంతమాత్రం ఆయుర్దాయాన్ని అనుభవించడం అరుదే. కాని, యోగాభ్యాసంవల్లనూ, వాంఛారహితమైనందువల్ల ఆవేదనారహితమైన జీవితం గడిపినందువల్లనూ పంతులుగారు ఒక మహాయోగి వలె పూర్ణాయుర్దాయాన్నే అనుభవించారు. యోగాభ్యాసం, వారి దినచర్యలలో ఒకటి. భగవద్గీత చెప్పిన నిష్కామకర్మ, వారి జీవిత ధర్మము.

బ్రతికివుంటే 1967 మే 1 తేదిన పంతులుగారికి నూరేండ్లు నిండేవి. కాని, పంతులుగారు స్థాపించిన సంస్థలకూ, వారు వెలిగించిన దివ్యజ్ఞానజ్యోతికీమాత్రం ఎప్పటికీ నూరేండ్లు నిండవు.

పొరుగూరికి ప్రయాణం చెయ్యడానికి ప్రజలు సంకటపడే రోజులలో, పర రాష్ట్రంలో జీవితం అంటే దేశాంతరవాసశిక్షగా ప్రజలు భావించేరోజులలో, పంతులుగారు తమ ఇరవయ్యయిదవఏట బొంబాయికి వెళ్ళిపోయారు. రెండేళ్ళ తరువాత కొద్దికాలం కలకత్తాకు నివాసం మార్చినా, మళ్ళీ బొంబాయికి వచ్చి, పట్టుబట్టి, కష్టపడి, తమ సోదర ఆంధ్రజాతికీ, ఆంధ్రదేశానికీ బహుముఖ సేవను చెయ్యగల స్తోమతను సంపాదించుకొని పంతులుగారు మదరాసుకు వచ్చేశారు.

బొంబాయినుంచి మదరాసుకు వచ్చేలోపునే పంతులుగారు, తమ జీవిత ఆశయాలను నిర్ణయించుకోవడమూ, వాటిని సాధించే కృషిని ప్రారంభించడమూ జరిగిపోయింది. 1908 సంవత్సరంలో బొంబాయి నగరంనుంచి ప్రకటన ప్రారంభించిన ఆంధ్ర వారపత్రికను, మదరాసుకు తీసుకురావడమూ, 1914లో దినపత్రిక ప్రచురణ ప్రారంభించడమూ జరిగింది. వారపత్రికగా ఆంధ్రపత్రికను బొంబాయిలో ప్రచురణ ప్రారంభించినప్పుడు, తెలుగు కంపోజిటర్లనుకూడా బొంబాయికి తీసుకొనివెళ్ళవలసివచ్చిందంటే, ఎన్ని యిబ్బందులను ప్రతిఘటించి పత్రికా ప్రకటనను పంతులుగారు ప్రారంభించారో ఊహించవచ్చును. ఆంధ్రపత్రికను దినపత్రికగా ప్రకటించడం ప్రారంభించినా, వారపత్రిక ప్రకటన ఆగలేదు. రెండూ వెలువడుతూనే వచ్చాయి.

పత్రికా పఠనమే అలవాటులేని ప్రజలలో దినపత్రికనూ, వారపత్రికనూ ప్రచారం చెయ్యడం సులువైన పనికాదు. పైగా, డబ్బిచ్చి పత్రికలను కొనడం ఎంతమాత్రమూ కిట్టని తెలుగువారికి పత్రికాపఠనంద్వారా సాంఘిక, రాజకీయ, సారస్వత చైతన్యం కలిగించడం ఎలాగ? పంతులుగారు పత్రికలను స్థాపించడంలో, వ్యాపారదృష్టి లేనందువల్ల ఆంధ్రదేశం బాగుపడింది. అమృతాంజనంలో వచ్చినఆదాయాన్ని పత్రికాప్రచురణకు ఉపయోగించి, అడిగినప్రతివారికీ ఉచితంగా, పోస్టుఖర్చులుకూడా తామే భరించి, పత్రికల నందజేశారు పంతులుగారు. పత్రికలను అమ్మడానికి ఏజెంట్లు లేనికాలంలో, పోస్టుద్వారా పత్రికలను పంపడమంటే బోలెడంత ఖర్చుతో కూడిన వ్యవహారం. ఐనా పంతులుగారు వెనుదియ్యలేదు.

గాంధిమహాత్ముడు రాజకీయాలను నిత్యవ్రతంగా బోధించడమూ, కాంగ్రెసు మహాసభ స్వాతంత్ర్యోద్యమాన్ని సాగించడమూ ప్రారంభమయేటప్పటికి, ఆంధ్ర పత్రిక లేకుంటే, ఆంధ్రులలో రాజకీయచైతన్యం ప్రబలంగా వ్యాపించేది కాదు.

ఆంధ్రపత్రిక ద్వారాను, భారతి మాసపత్రిక ద్వారాను ఆంధ్రభాషకు పంతులుగారు చేసినసేవ అపూర్వము. భారతివంటి మాసపత్రిక మరొకటి రాలేకపోయిందంటే, అలాంటి పత్రికను స్థాపించడం ఎంతకష్టమో తెలుస్తుంది. ఈ పత్రికలే లేకపోయి నట్లయితే, ఈనాడు పెద్ద పేరుప్రతిష్ఠలను పొందిన ఎంతమంది కవులు, రచయితలు, చిత్రకారులు నివురుగప్పిన నిప్పులాగ చప్పబడిపోయివుండేవారో. వీ రందరికీ విస్తారమైన ప్రచారాన్ని కలిగించడమే కాక, ప్రకటింపబడిన ప్రతి వ్యాసానికీ, కథకూ, పద్యానికీ, బొమ్మకూ కొంతపారితోషికాన్ని ఇవ్వడమనేది, పంతులుగారు ఒక విధిగా పెట్టుకున్నారు. దీనివల్ల చాలామందికి జీవనోపాధి ఏర్పడిందికూడాను.

ఆంధ్రదేశంలో ఎన్నో లైబ్రరీలను పంతులుగారు ప్రారంభించారు. తాము ప్రారంభించిన లైబ్రరీలకే కాక, అర్థించిన ప్రతి లైబ్రరీకి ఆంధ్రపత్రికలను రెండింటినీ, భారతినీ ఉచితంగా యిచ్చి, ప్రజలలో పత్రికా పఠనాసక్తిని, సార స్వతాభిమానాన్నీ, సంఘసంస్కరణాభిలాషనూ, రాజకీయ చైతన్యాన్నీ, స్వాతంత్ర్య సంపాదనాదీక్షనూ కలిగించారు పంతులుగారు.

నా స్వానుభవం ఒకటి చెపుతున్నాను. నేను పదేళ్ళలోపువయస్సులో వుండగానే, మావూరికి ఆంధ్రపత్రిక వచ్చేది. మాతాతకు, పత్రిక చదివించుకోవడం కుతూహలం. నాచేత చదివించుకొనేవారు ఆయన. ఆవిధంగా పత్రికాపఠన అలవాటయింది నాకు. 1933 జనవరిలో నేను మదనపల్లిలోని శానటోరియంలో చేరి కొన్నాళ్ళు వున్నాను. నాలాగే కొంతమంది తెలుగువారు అక్కడ వున్నారు, పత్రికలను చదవాలని కుతూహలం ఉన్నవారు. కాని, ఆర్థిక కారణాలవల్ల పత్రికలకు చందా కట్టలేని వారు. నాకు పంతులుగారితో పరిచయం లేకపోయినా, పరిస్థితులను వివరిస్తూ వారికి ఉత్తరం వ్రాశాను. మూడోరోజునుంచీ, మదనపల్లి శానటోరియంకు. ఆంధ్ర పత్రికలు రెండూ, భారతి ఉచితంగా పంపడం ప్రాంభించారు పంతులుగారు.

విజ్ఞానాన్ని పంచిపెట్టడంతో పంతులుగారు ఎప్పుడూ విశాలభావాన్నే ప్రదర్శిం చారు. లైబ్రరీలకు పత్రికలను మాత్రమేకాదు; ఆంధ్ర గ్రంథమాలద్వారా తాము ప్రచురించిన గ్రంథా లన్నిటినీకూడా ఉచితంగా పంపేవారు. విజ్ఞానాన్ని ఎలా పంచిపెట్టారో, అలాగే తమ విత్తాన్నికూడా విరివిగా పంచిపెట్టారు, పంతులుగారి కాలంలో వారి వితరణను అందుకోని ప్రజాసంస్థలు ఎన్నోలేవు. సంస్థలకేకాదు, వ్యక్తులకుకూడా ప్రతిసందర్భంలోనూ, పంతులుగారు అమోఘమైన సహాయం చేశారు.

'వాంఛ నెరిగియు అర్థార్థి వచనదైన్య మాత్మ సహియింపజాలువా డథమదాత' అన్నమాట పంతులుగారికి తెలుసును. అందుచేతనే, పంతులుగారు తమవద్దకు

వచ్చిన అర్థులు, తమదైన్యాన్ని చెప్పుకోకుండానే వారికి తాము చేయదలచుకున్న సహాయాన్ని చేసి పంపేవారు. అలాటి మహాపురుషునికి, విశ్వదాత అనే పేరు ఎంతేనా తగివున్నదికదా!

దానంవల్ల కొంతమందికే ఉపకారం కలుగుతుంది. జ్ఞానంవల్ల దేశంలోని ప్రజలందరూ ప్రబోధితులవుతారు. విత్తాన్నీ, విజ్ఞానాన్నీ విస్తారంగా పంచిపెట్టిన మహానుభావుడు కనుకనే, దేశోద్ధారకు డయ్యాడు. జాతిపిత అయిన గాంధి మహాత్ముడే, పంతులుగారిని 'దేశోద్ధారకుడు' అన్నాడు. అలా పిలువబడడానికి అర్హుడైన వ్యక్తి, ఆంధ్రదేశంలోగాని భారతదేశంలోగాని మరొకడు ఏడీ? ఎంత ధన్యజీవులు, పంతులుగారు!

ఎన్నో కళలను పోషించడమూ, ఎంతోమంది కళాకారులను వెలుతురులోకి తేవడమూ మాత్రమేకాక, స్వయంగా కళామూర్తులైన పంతులుగారికి 'కళాప్రపూర్ణ' బిరుదును యివ్వడంలో ఆంధ్రవిశ్వకళాపరిషత్తు సముచితంగానే ప్రవర్తించింది.

'విశ్వదాత, దేశోద్ధారకుడు, కళాప్రపూర్ణుడు' – ఇన్ని విధాలుగా ప్రకాశించిన దివ్యజ్యోతి, యుగపురుషుడుకాక మరేమి!

ఈ యుగపురుషుని సంస్మరణవిషయంలో ఆంధ్రజాతి ఏమి చేసింది? ఇంకా ఏమి చెయ్యలేదు. ఈనాడు జరుగుతున్న శతజయంతి సందర్భంలో, పంతులుగారి పూర్ణవిగ్రహాన్ని తయారుచేయించి, ఆంధ్రరాజధానీనగరంలో ప్రధానకేంద్రంలో స్థాపించడం ముఖ్యం. అన్ని వివరాలతోనూ పంతులుగారి జీవితచరిత్రను ప్రకటించడంకూడా అవసరం.

పంతులుగారు ప్రారంభించిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము రెండు సంపుటిలతోనే ఆగిపోయింది. Encyclopaedia Britannica పద్ధతిలో తెలుగులో విజ్ఞాన సర్వస్వాన్ని ప్రచురించడం, ఒక వ్యక్తి శక్తికి మించిన పని; అంతేకాదు; సాధారణమైన సంస్థల శక్తికికూడా మించిన పని. ఈ విజ్ఞాన సర్వస్వాన్ని ప్రచురించడానికి ఈనాడు ఎంతో డబ్బు, ఎంతో ప్రయాస, ఎంతోమంది రచయితల కృషి అవసరం. అయినా, ఆంధ్రప్రభుత్వం, విజ్ఞాన సర్వస్వాన్ని పంతులుగారు ప్రారంభించిన పద్ధతిలో పూర్తిగా ప్రకటించినట్లయితే, పంతులుగారి ఆశయాలలో మిలిగిపోయిన ఒక్కదానినీ పూర్తిచేసిన ఘనతను సంపాదించుకోగలదు. ఈ విధంగా, ఆంధ్రభాషకు ఒక అమూల్యమైన కానుకను అర్పించగలదు.

# యువ

## ప్లవంగ దీపావళి ప్రత్యేక సంచిక

* కొందరు ప్రముఖ రచయితలు—

పాలగుమ్మి పద్మరాజు, భానుమతీ రామకృష్ణ, ముప్పాళ రంగనాయకమ్మ, కొమ్మూరి వేణుగోపాలరావు, అవసరాల రామకృష్ణారావు, పోల్కంపల్లి శాంతాదేవి, ఇచ్ఛాపురపు జగన్నాథరావు, అండే గోపాలకృష్ణమూర్తి, విజయలక్ష్మి శర్వాణి, అరుణ మొదలైన వారి రచనలతోపాటు......

* కొడవటిగంటి కుటుంబరావు గారి నవల
* ప్రముఖ చిత్రకారుల బొమ్మల కథలూ, కార్టూన్లు
* వివిధ చిత్రకారుల ముద్దులొలికే చిత్రాలు
* ఈ సంచికకై ప్రత్యేకంగా చిత్రించబడి, ఆఫ్‌సెట్‌లో ప్రింట్ అయిన ఆకర్షణీయమైన - వడ్డాది పాపయ్యగారి వర్ణచిత్రాలు
* గ్లేజు పేపరుపై, మామూలు సంచికకు రెట్టింపు సైజులో సర్వాంగ సుందరంగా వెలువడుతుంది.

**ఈ ప్రత్యేక సంచిక వెల 3 రూపాయలు**

మీ కాపీని మీ ఏజెంటు వద్ద రిజర్వు చేసుకోండి!

* 

సంపాదకుడు




"మంజూ!"

"ఊఁ."

"ఈ వెన్నెల ఎలాఉందో తెలుసా?"

"ఊఁ హుఁ, తెలియదు."

"ఫో! అసలు నీతో మాట్లాడను."

మంజుల నవ్వింది.

"ఊఁ, చెప్పు వింటాను. ఎలా ఉంది వెన్నెల?" జడ ముందు కేసుకుని కొంటెగా అతనివంక చూస్తూ అడిగింది.

ఆమె నవ్వులో అతనికోపం కరిగి పోయింది.

"ఇలా – అచ్చు నీ నవ్వులా ఉంది వెన్నెల;" తళతళ మెరిసే ఆమె కళ్ళ ల్లోకి ప్రేమగా చూస్తూ అన్నాడు రాజు.

ఫక్కుమని నవ్వింది మంజుల. వెన్నెల వెలవెలబోయింది. "ఇదిగో

రాజూ ! నీ కెన్నిసార్లు చెప్పాలి పుస్తక భాషలో నన్ను విసిగించవద్దని ? ఐనా వెన్నెల నవ్వులా ఉండట మేమిటి? అర్థంలేదు. వెన్నెల వెన్నెలే, నవ్వు నవ్వే ఈ రెంటికీ అసలు పోలి కేమిటీ అంట ?''

రాజు నిట్టూర్పువిడిచాడు "నువ్వు నా స్థానంలో ఉండి, నాలాగే నువ్వు కూడా ఒక స్త్రీని ప్రేమిస్తేతప్ప ప్రేయసి నవ్వుకీ, వెన్నెల కాంతికీ గల పోలిక నీ కర్థంకాదు మంజూ ! చూడు, ఎలా మనమిద్దరం ఒంటరిగా యీ సముద్రం ఎదురుగా కూర్చుంటే మన చుట్టూ ఆవరించిన యీ వెన్నెల శరీ రానికి ఎంతటి చల్లదనాన్నీ, ఆహ్లా దాన్ని కలిగిస్తోందో. అలాగే ప్రేమ తప్తమయిన నా హృదయానికి నీ నవ్వు కూడా హాయిగా, పన్నీటిజల్లులా ఆనం దాన్నీ కలిగిస్తోంది. అది శారీరకాను భూతి అయితే యిది మానసికాను భూతి. అంతేతేడా," అన్నాడు.

" 'ప్రేమతప్తమైన' అంటున్నావు; యీ ప్రేమ నిన్ను కాల్చేస్తోం దేమిటి?" అన్నది మంజుల. ఈసా రామె నవ్వ లేదు.

"ప్రేమ ఒక జ్యోతిలాంటిది మంజూ! అదృష్టవంతుల కది జీవితయాత్రలో మార్గదర్శకంగా ఉంటే, నీలాటి అసమ ర్థుల నది నిలువునా కాల్చిపారేస్తుంది."

అత నలా అనగానే ఆమెలో కదలిక కలిగింది.

"ప్లీజ్ – అలామాట్లాడకు రాజూ ! నువ్వు అసమర్థుడ వనుకోవడం నా కెంతో బాధకలిగిస్తోంది. నువ్వు చాలా మంచి పురుషులకంటె చాలా గొప్ప వాడివి. నీలో ఒక మనిషి కుండవల సిన మంచి గుణా లన్నీ ఉన్నాయ్. అందుకే నువ్వంటే నా కిష్టం. అలాగే నీకు తెలిసినవా ళ్ళందరిలోకీ నేనంటే యిష్టపడతావు నువ్వు. ఆ యిష్టానికి ప్రేమ, గీమ అనే వెర్రిమొర్రిపదాలు తగిలించి మలినం చెయ్యకు," అంది గంభీరంగా.

రాజు మాట్లాడలేదు.

ఆమె అతని వైపయినా చూడ కుండా సముద్రంకేసి చూస్తోంది. ఆమె పక్కనే కూర్చున్న రాజుకి ఆమె ముఖంలోని ఒకపక్కభాగంమాత్రమే కనిపిస్తోంది. సూటిగా కొనతేలిన ముక్కు, ముద్దమందారంలా నిండుగా ఉన్న పెదవులజంట, ఆ పెదవులక్రింద అర్ధచంద్రాకారంలో ఒకవంపు, పట్టు దలను సూచించే గుండ్రని గడ్డం, పచ్చని మెడను స్పృశిస్తున్న నల్లని కురులు... మహారాజ్ఞిలాటి యీ స్త్రీ తన ఒడిలో వాలిపోయే సుదినం ఏనాటి కైనా వస్తుందా అనుకున్నాడు రాజు.

అటు సముద్రంవైపు చూసే డతను. వెన్నెలకాంతను చూసి ప్రేమ పార




వశ్యంతో ఆమె నాలింగనం చేసికుంటూ నికా అన్నట్లు నురగలు కక్కుతూ పరుగు పెడ్తున్నాడు సముద్రుడు. 'అతడా వెన్నెలకాంత నందుకోవటం ఎంత అసంభవమో తను మంజులను పొందటంకూడా అంత అసంభవమే;' విరక్తిగా నవ్వుకున్నాడు రాజు.

యుగయుగాలుగా ఆ సముద్రుడు వెన్నెలను తనలో లీనం చేసికొందామని ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ఇంత కాలం గడచినా అతనికి అలసట అనేది లేనట్లుంది. రెట్టించిన ఉత్సాహంతో, ద్విగుణీకృతమైన ప్రేమపారవశ్యంతో అతడు తన ప్రయత్నాన్ని కొనసాగిస్తూనేఉన్నాడు. ఉత్తమ ప్రేమికుడి లక్ష్యమే అదేనేమో. ఆశాభంగం, ప్రేమవైఫల్యం అనే పదాలతనిని చేరలేవు.

అలా అనుకోగానే రాజు మనసులో ఆశ మెరిసింది. అతనిలోని ప్రేమవృక్షం పువ్వులు తొడగసాగింది;

"మంజూ!" స్నేహపూర్వకంగా పిలిచాడు.

"ఏమిటి రాజూ?"

"ని న్నొకటి అడగనా?"

"అడుగు; సందేహ మెందుకు?"

"నేనంటే నీ కిష్టమేనా?"

"ఆసంగ తిప్పుడే చెప్పేను."

"మరయితే నన్ను పెళ్ళి చేసికుంటాని కెందు కిష్టపడవు?"

"పెళ్ళంటే నా కసహ్యం."

"ఎందుకని?"

"పెళ్ళి స్త్రీ పురుషులను జంతువులుగా మార్చేస్తుందికనుక.''

"ఛ ! అదేమిటి ?''

"కాక మరేమిటి ? చూడు రాజూ! మనమిద్దరం స్నేహితులం. ఒకరంటే ఒకరి కెంతోయిష్టం, గౌరవం. ఇలా స్నేహితుల్లా ఉంటే ఎంత నిర్మలంగా ఉన్నాం ! కాని అదే పెళ్ళయితే అందరు భార్యాభర్తల్లా మనంకూడా.. ఛీ! అది మృగతృష్ణ కాక మరేమిటి ? అదంటే నా కసహ్యం."

"పొరబడుతున్నావ్ మంజూ ! అసలు వివాహంలోని పరమోద్దేశ మేమంటే..."

"ఇప్పుడా ఉద్దేశ్యాలన్నీ ఏకరువు పెట్టి నన్ను చంపకు రాజూ ! నువ్వేం చెప్పబోతున్నావో, యింతకాలంగా పెద్దమనుషులు, కవులు, రచయితలు ఏం చెప్తూవచ్చారో నాకు తెలుసు. ఎవ రేంచెప్పినా అసలువిషయం ఒకటే. దానికి మెరుగులు దిద్ది, అపూర్వమైన ఆనందంగా దీన్ని వర్ణించి, అనాదిగా మీరు స్త్రీలను మోసం చేస్తూనే ఉన్నారు. నే నేం పసిపిల్లను కాను. నాకు టోపీ వెయ్యాలని చూడకు," అంది మంజుల ఆవేశంగా.

క్రోధంతో అదురుతున్న ఆమె అధరం, మంకెనపువ్వుల్లా విచ్చిన ఆ కళ్లూ చూస్తూంటే రాజుకు మళ్ళీ గొంతు పెగల్లేదు.

కాసే పాగి "ఇక పోదాం పద," అంటూ లేచింది మంజుల. రాజు మౌనంగా ఆమె ననుసరించేడు.

రాజుకి మంజులతో స్నేహం ఐంది అతని చెల్లెలు శ్యామలద్వారా. శ్యామల, మంజుల క్లాస్ మేట్స్కాక క్లోజ్ ఫ్రెండ్సుకూడా అవటంవలన మంజుల తరచూ రాజూవాళ్ళ ఇంటికి వస్తూండేది. ఆమెతోటి పరిచయం వృద్ధి అయినకొద్దీ రాజుకి మంజు యెడల ఆశ్చర్యంతో కూడిన ఆకర్షణ కలగ సాగింది. అలాటి అపూర్వమైన స్త్రీ అతిసామాన్యమైన అమ్మాయి-శ్యామలతో ఎలా స్నేహం చేస్తోందా అని ఆశ్చర్యపోయేవా డతను. ఎప్పుడూ చలాకీగా అందరినీ ఆకర్షిస్తూ తిరిగే శ్యామలకూ, మహారాణిలా ఠీవిగా నిండుగా నడిచే గంభీర మూర్తి మంజులకూ స్నేహం కలవటం చిత్రమైన విషయమే.

క్రమంగా మంజుల శ్యామలతో కన్నా, భావాలలో అభిరుచులలో తనతో సారూప్యం గల రాజుకి సన్నిహితం కాసాగింది. రాజుకీ, మంజుకీ వివాహం జరిగితే యిద్దరివైపు తల్లిదండ్రులూ మనస్ఫూర్తిగా ఆనందిస్తారు. రాజుకోరికకూడా అదే, కాని మంజుల ప్రవర్తన అతని కో పెద్ద సమస్య అయికూర్చుంది.

ఆడపిల్లలందరిలా మంజుల అతని

సమక్షంలో సిగ్గుపడదు. ఎంత చనువుగా ప్రవర్తించినా, శ్యామలకీ అతనికీ తేడా కనపడేదికాదు. ఆమె నడవడిలో. అసలామెకు తనలోని స్త్రీత్వాన్ని గూర్చిన ఆలోచన ఉన్నట్లే కనపడదు. రాజు నెంతో అభిమానిస్తుంది. అతనిని చూడందే ఒక్కరోజైనా ఉండలేదు. కాని ఆ బంధం స్నేహంలాగానే ఉండిపోవాలంటుంది. అతని కదెలా సాధ్యం ?

ఆమె నాకర్షించాలని ఎన్నో రకాలుగా ప్రవర్తించేదు రాజు. ఒక్కొక్కప్పుడలా చేస్తున్నందుకు సిగ్గుపడేవాడు కూడా. కాని తప్పదు. మంజులలాటి స్త్రీ మనసు నాకట్టుకోవాలంటే ఎలాటి పనయినా చేసితీర్తాడు. కాని ఫలిత మేమీ ఆశాజనకంగాలేదు. పైగా ఒకటి, రెండుసార్లు ఆమె విముఖత్వానికి గురి అయ్యేడుకూడా.

ఎవరో చెప్పేరు ఆడడాళ్ళని స్వాధీనపరచుకోవాలంటే ముందు వారి అందాన్ని పొగడాలని. అదే పని చేసే డతను, తన ప్రయత్నానికి నాందిగా.

ఒరోజు వాళ్ళయింట్లో ఓ సాయంత్రం వాళ్ళిద్దరూ బాల్కనీలో కుర్చీ లేసుకు కూర్చున్నారు. శ్యామల నౌకరుతో టీ పంపింది వాళ్ళకు. తన స్నేహితురాలు వదిన కాబోతోందని తెలిసినప్పటినుండీ అన్నకీ ఆమెకీ ఏకాంతం లభించేటట్లు సాధ్యమైనంత వరకు ప్రయత్నిస్తోం దామె. అందుకే ఆమె పైకి రాలేదు. రాజు ఈ విషయం గ్రహించి, చెల్లెలికి మనసులోనే కృతజ్ఞత చెప్పుకున్నాడు. కాని మంజుల ఆ విషయాన్ని గమనించినట్లుకూడా లేదు.

నౌకరు పోగానే టీ కలిపి తనో కప్పు తీసుకుని, మరో కప్పు రాజు కందించింది మంజుల.

కప్పుతోపాటు అమె చేతినికూడా తన చేతుల్లోకి తీసుకుని అన్నాడు రాజు. "అబ్బ నీ వేళ్ళు లేత చిగుళ్ళలా ఎంత సున్నితంగా, అందంగా ఉన్నాయో మంజూ!" అని.

నిర్లక్ష్యంగా నవ్వింది మంజుల.

"మోటుపన్లేమీచెయ్యని ఆడవాళ్ల చేతులు సున్నితంగా ఉండడంలో ఆబ్బురమేముంది రాజూ! మీ శ్యామవలి మాత్రం లేవూ యిలా ?" కట్టె విరిచినట్లు ఆమె అలా మాట్లాడగానే రాజు ముఖం చిన్నబోయింది.

మరోసారి ఆమె తమ ఇంటికి రాగానే తను స్వయంగా పెంచి పూయించిన రెండు గులాబీపువ్వుల నామె కిచ్చేడు రాజు.

"థాంక్స్" అంటూ తీసుకుని వాటిని పక్కనే టేబులుమీద ఉన్న గాంధీజీ విగ్రహంముందు పెట్టింది.

"నువ్వు తల్లో పెట్టుకుంటావని

యిచ్చేను. ఇక్కడైతే నేనే పెట్టేవాడినిగా," అన్నాడు రాజు రోషంగా.

"ఎందు కలా కోపం తెచ్చుకుంటావు రాజూ? పూలు తల్లో పెట్టుకోవటం నా కిష్టం లేదు."

"ఎందుకు లేదు?"

"అవి పెట్టుకుంటే పక్కా అడదాన్లా కన్పడతాను."

"ఆడది ఆడదాన్లా, మగాడు మగాడిలా కన్పడితే తప్పేమిటో నా కర్థం కావటం లేదు;" అతని కోపం తారస్థాయి నందుకుంది.

"అందులో తప్పేం లేకపోవచ్చు. కాని నా కెందుకో అలాటి ఆడతనం నచ్చదు. అలా అలంకరించుకుని పురుషుడి దృష్టిలో తేలిగ్గా, ఆతని విలాస వస్తువుగా కనపడటం నా కిష్టం లేదు. నిన్ను బాధపెట్టినట్లున్నాను. క్షమించు రాజూ!" అంటూ వెళ్ళిపోయింది.

అలా ఆమె క్షమాపణ వేడుకోగానే అతని కోపం మాయమయిపోయింది. కాని అతని హృదయంలోని బాధ మాత్రం అలాగే మిగిలిపోయింది. అత నాశించింది వేరు. 'తప్పయింది రాజూ!' అంటూ ఆమె తల్లో పూలు పెట్టుకుని అతని హృదయంమీద వాలిపోతే అతను సంతోషించేవాడు. కాని యిప్పు డామె చూపిన శీతకన్ను అతని హృదయానికి కత్తి దెబ్బలా తగిలింది.

అతను పురుషుడు, స్త్రీ లతలా తనని పెనవేసుకుపోవాలని కోరుకుంటాడు. అందులో అతని తప్పేం లేదు. కాని సృష్టి ఒక చిత్రమైన క్షణంలో మంజులను విలక్షణమైన మూసలో పోసి తయారుచేసింది సృష్టి చేసిన ఆ అద్భుతమైన ప్రతిమమీది ప్రబలమైన ఆకర్షణనుండి తప్పించుకు పోలేకపోతున్నాడు రాజు.

ఒక్కొక్కప్పు డామెను మర్చిపోదామని, అసహ్యించుకుందామని ప్రయత్నించేవాడు. 'ఆమెని మించిన అందగత్తెలు తనని కోరి చేసికొంటానంటోంటే నే నెందుకింత గుడ్డిగా ఈమె వెంటపడుతున్నాను?' అని తన మీద తాను విసుక్కున్నాడు. కాని ఆతనికి తెలుసు. ఈ స్త్రీ అందానికీ, ఐశ్వర్యానికీ, మిగతా స్త్రీ సహజమైన ఆకర్షణ లన్నిటికీ అతీతురాలని. ఐనా ఆమెని అందంకోసం తను ప్రేమించటం లేదు? ఆమె వ్యక్తిత్వానికి ముగ్ధుడై ఆమె నారాధిస్తున్నాడు.

అందని స్త్రీని వదిలి మరో స్త్రీ కోసం పోవటం పురుషుడి కంత కష్టమైన పని కాదు. కాని రాజుకున్న సంస్కారం వేరు. అత నిచ్చే విలువలు మంజులలో తప్పమరేస్త్రీలోనూ కాదు, మ రే మనిషిలోనూ ఉండవని అతని ఉద్దేశ్యం. అందుకే ఆమె తన కంద



కుండా పోతున్న కొలదీ ఆమెమీద గల ఆకర్షణకూడా పెరగసాగిం దతనిలో.

ఓరోజు బీచ్ కి వెళ్లేరు. ఉన్నట్టుండి అన్నాడు రాజు: "చూడు మంజూ! ఊరికే మనం కవులను దుయ్యబట్టటం కాదు గాని. నిజంగా కొన్నికొన్ని విషయాలను పూర్తిగా అర్థం చేసు కోవాలంటే ఉపమానం చాలా అవ సరం. ఉదాహరణకి–ఆ సముద్రాన్నే తీసుకో. దానికీ నీ హృదయానికీ ఎంతో దగ్గిరపోలిక ఉంది."

"ఏమిటో ఆ పోలిక?" అలవోకగా నవ్వింది మంజుల.

కాని రాజు చెక్కుచెదర లేదు; అన్నాడు: "ఈ సముద్రంలానే నీ హృదయం కూడా ఎంతో లోతైంది.

"నాకు తెలియ కడుగుతానూ– ఇంతకీ నా హృదయం లోతును ఏ

కొలబద్దతో కొలిచేవఖ్బా!" నవ్వును పెదవులవెనుక బంధిస్తూ ఆశ్చర్యంగా అడిగింది.

"ఈ సముద్రంలో రత్నాలరాసు లున్నట్లే నీ హృదయంలో కూడా వెలకట్టలేని భావరత్నా లున్నాయ్."

"మరి గులకరాళ్ళ మాటో."

"అనవతరం కోట్లకొలది కెరటాలు ఉద్భవించి నశించినా స్థూలంగా యీ సముద్రం రూపాంతరం చెందనట్లే అల్పమైన, ఉద్రేకాలూ కోరికలూ నీ వ్యక్తిత్వాన్ని అంటకుండా చెక్కుచెద రక నిల్చేట్లు చేస్తున్నయ్."

"చాలా పెద్దమాటలు మాట్లాడు తున్నావ్ రాజూ! నా కర్థం కావటం లేదు.'' ఇసుకను గుప్పిటలోకి తీసుకుని వేళ్ళసందుగావదుల్తూ అన్నది మంజుల.

"ఇంకా ముఖ్యమైన విషయం చెప్పనే లేదు," కసిగా అన్నాడు రాజు. "ఎన్ని గొప్పగుణా లున్నా ఈ సము ద్రపునీరు మన దాహాన్ని తీర్చలేదు. అలాగే నువ్వు కూడా..." ఆ పైన ఉద్రేకంలో అతనికి మాటలు రాలేదు.

రాజు చెయ్యి గట్టిగా పట్టుకుంది మంజుల. "చిలిపిగామాట్లాడకు రాజూ! నువ్వనేది నా కర్థమయింది. స్త్రీ పుట్టింది మగవాడి దాహాన్ని తీర్చ టానికి అనే అభిప్రాయం నీ కున్న ట్లయితే ఇక మనిద్దరి స్నేహానికి ఇంత టితో స్వస్తి చెప్పేస్తాను. మరోసారి చెప్తున్నాను. అనవసరంగా నన్ను రెచ్చగొట్టకు," అంది.

రాజుకి ఆమె మాట లేం వినబడటం లేదు. తన చేతిని పట్టుకుని ఉన్న ఆమె తెల్లని మృదువైన హస్తం మీదే ఉందతని దృష్టి. ఆమె స్పర్శతో అతని శరీరమంతా వెయ్యి వోల్టుల విద్యుత్తు ప్రవహించిన ట్లయింది. మోహంతో ఊగిపోయిం దతని హృదయం. ఆమె చేతిని వెచ్చగా ఉన్న తన పెదవుల కానిస్తూ అన్నాడు మత్తుగా: "మంజూ! మన మిద్దరం ఎప్పటికీ ఇలాగే ఉండి పోతే ఎంత బాగుండును!"

అతని కంఠస్వరం విని కళ్ళెత్తి అతని వంక చూసింది మంజుల. కాంక్షతో కూడిన అతని చూపుల తాకిడికి తట్టుకోలేక ఆమె కను రెప్పలు వాలిపోయినయ్. అతనినుండి విడిపించుకుని దూరంగా కూర్చుంది.

"చెప్పు మంజూ! ఎందుకు నేనంటే నీకింత విముఖత్వం?" ఆమె వైపుకు వంగుతూ అన్నాడు

అతని నుండి వస్తున్న ఏదో వేడి గాలి ఆమె శరీరాన్ని ఉక్కిరిబిక్కిరి చేసింది.

ఒక్కసారిగా లేచి నిలబడిం దామె. "రాజూ! ఇవ్వాళ నిజంగానే నిన్నస హ్యించుకుంటున్నాను. ప్లీజ్ అలా చూడకు నా వంక! అలాటి చూపు లను నేను భరించలేను రాజూ! అబ్బ!




ఎంత భయంకరంగా ఉన్నాయో నీ కళ్లు – తోడేలు కళ్ళలా! చాలామంది మగవాళ్ళు స్త్రీల వంక అలాగే చూస్తారు. కాని నువ్వుకూడా ఇంత నీచుడవని నే నెన్నడూ అనుకోలేదు," అంటూ రెండుచేతులతోనూ ముఖం కప్పుకుని ఏడువసాగింది.

ఆమె రోదనతో అతనిలోని మోహావుకైపు ఒక్కసారిగా దిగిపోయింది.

మంజు తన ప్రేయసి, తన ఆరాధ్య దేవత – తన సమక్షంలో ఏడవటమా? సహించలేకపోయేడు రాజు.

ఆమెను పట్టుకుని క్రింద కూర్చోపెట్టి తన ఒడిలోకి తీసుకున్నాడు. "మంజూ! నా తల్లీ! ఏడవకమ్మా! నిన్నింక ఎప్పుడూ ఇలా బాధపెట్టను. మంచిదానివిగా ఏడవకు," అంటూ ఓదార్చేడు.

కాసేపటికి ఏడుపు తగ్గేక అతన్ని విడిపించుకుఅవతలగాకూర్చుందిమంజు.

కొంతతడవు ఉవ్వెత్తుగా పడుతున్న కెరటాలను చూస్తూ మౌనంగా ఉండిపోయే రిద్దరూ.

తరువాత గొంతు సవరించుకుని రాజే అన్నాడు. "మంజూ! నీ కో సంగతి చెప్పనా?"

"చెప్పు రాజూ!"

ఆమె కంఠస్వరంలోని మార్దవాన్ని చూసి ధైర్యం తెచ్చుకున్నాడు రాజు.

"అస లిదంతా నీ భ్రమేనని, 'అతి' చురుకుగా పనిచేసే నీ మెదడు చేసిన కల్పన అనీ నా ఉద్దేశ్యం."

"భ్రమేంటి? కల్పన ఏమిటి? నా కేం అర్థంకావడంలేదు రాజూ!"

"నువ్విలా పురుషస్పర్శను ద్వేషించటం, వివాహాన్నిగురించి భయంకరంగా ఊహించుకోవటం—యిదోరకం నరాల జబ్బని నా ఉద్దేశ్యం శారీరకంగా లోపం లేని స్త్రీలో కామ భావాలు లేవంటే నమ్మసాధ్యం కాదు నీలోనూ అంతర్గతంగా ఉన్నయ్ కోరికలు. కాని సహజంగా నీసంస్కారం గొప్పదవటం, చిన్నప్పటినుండీ వేదాంతానికి సంబంధించిన పుస్తకాలు చదవటం - యిలాటివన్నీ ఆ కోరికలను అంకురంలోనే అణచివేస్తున్నయ్ అదీ కాక స్త్రీ సహజమైన బలహీనత లేవో నిన్నంటకూడదని నీ ఆశయం అందరిలోనూ లేని ప్రత్యేకత ఏదో కావాలనుకునే నువ్వు, సృష్టిలో అతి సహజమైనవాంఛకుకూడా అతీతురాలవవాలని చూస్తున్నావ్- నీ యీ అహంభావపు యినుప తెర వెనుక సున్నితమైన భావాలన్నీ అజ్ఞాతంగానే ఉండిపోతున్నాయ్"

"లైంగికమైనవి సున్నితమైన భావా లంటున్నావా రాజూ? ఎంత దారుణం! పరిణామక్రమంలో అగ్రశ్రేణికి చెందిన యీ మానవుడిలో తన పూర్వీకులకు సంబంధించిన అల్పజంతువుల ఛాయ లింకా మిగిలిపోయే ఉన్నాయ్ రాజూ! వాటి ఫలితమే మానవుడిలోని యీ తుచ్ఛమైన ఉద్రేకాలు. అదీగాక వాంఛ విషయంలో సాధారణంగా స్త్రీది జడప్రకృతి ఆ జడత్వం నాలో ఒక్కపాలు ఎక్కువ ఉండిఉండవచ్చు."

"ఔను, పురుషుడికన్న స్త్రీ భావాలు కోరికలు సున్నితంగా, బలహీనంగా ఉండేమాట నిజమే అందుకే పురుషుడి మోహదృష్టిని స్త్రీ భరించలేదు అప్రయత్నంగానే ఆమెకన్నులు వాలిపోయాయ్ దాన్నే భావుకులు 'సిగ్గు' గా వర్ణిస్తారు కాని నీ స్వభావంఎలాటిదంటే సిగ్గుపడటానికి కూడా సిగ్గుపడతావ్. నీ ఆత్మగౌరవం అలా సిగ్గుపడకూడదని ఎదురుతిరుగుతుంది సుశిక్షితులైన స్త్రీలందరూ యిలానే ఉంటారు కాని నువ్వీ విషయంలోకాస్త పిచ్చదానివి అదంత ఆరోగ్యకరమైన లక్షణం కాదు నీ యీ వింత ప్రకృతి మున్ముందు అనేక మానసిక వికారాలకు దారితీయవచ్చు చూడు మంజూ! మనిషికి కేవలం ఆలోచించే మెద డున్నంమాత్రాన చాలదు ఆ ఆలోచనల కానకట్టనుకట్టే లోకజ్ఞానం కూడా ఉండాలి"

ఆమె మాట్లాడలేదు ఆమెకుకోపమే వచ్చిందో, బాధే పడుతూందో, లేక ఊరికే ఆలోచిస్తూ కూర్చుందో ఆ మసక చీకటిలో కనిపెట్టలేకపోయేడు రాజు.

ఆతరవాత కొన్నిరోజులకి ఆమెలో



కొద్దిగా మార్పులు వస్తున్నట్లు అతనికి తోచింది. ఒక్కోసారి అతని చేతిని తన చేతుల్లోకి తీసుకుని అలా మౌనంగా కూర్చుండిపోయేది ఏదో ఆలోచిస్తున్నట్లు.

'ఎందుకలా చేస్తున్నావ్ ?' అని అడిగితే "నీచేతి స్పర్శకీ, శ్యామలచేతి స్పర్శకీ ఏమైనా తేడాఉందా అని పరిశీలిస్తున్నాను," అంది.

రాజు కామెమాటలతో ఉత్సాహం కలిగింది. "నీ కేమైనా తేడా కన్పించిందా?" అనడిగాడు కుతూహలంగా.

"చాలా తేడా ఉంది, ఆమెస్పర్శలో ఏదో చల్లదనం, హాయి అనుభవిస్తాను.

కాని నీ స్పర్శ వేడిగా, నేను భరించ లేని ఏదో భావాన్ని నా నరాల్లోకి ప్రవహింపచేస్తున్నట్లుగా తలుస్తున్నాను. మొదట్లో ఆ భావం జుగుప్సను కలిగించేది. ఇప్పుడిప్పుడే కొద్దిగా అలవాటు పడుతున్నాను నీ స్పర్శకు," అంది మంజుల.

మరో రోజు రాజూవాళ్ళ తోటలోకి వెళ్ళేరు వాళ్ళిద్దరూ. మామిడిచెట్టు కింద ఒకరినొకరు ఆనుకుని కూర్చున్నారు. ఇప్పుడామె రాజు స్పర్శను సామాన్యంగా తీసుకోగలుగుతోంది. కాని రాజుకి మళ్ళీ బాధ కలిగించిందేమంటే, తన స్పర్శ ఆమె కిప్పుడు హాయినివ్వగలుగుతోందే తప్ప, ఎలాటి ఉద్రేకాలనూ ఆమెలో రెచ్చగొట్టటం లేదు. ఆ విషయాన్ని గురించే ఆలోచిస్తున్నాడతను.

క్రమంగా చీకట్లు ముసురుకుంటున్నయ్. ఆకాశంలో నల్లని మేఘాలు ఎక్కడెక్కడినుంచో పరుగెత్తుకుంటూ వచ్చి ఒకచోట గుమిగూడుతున్నయ్. రివ్వున వీచే గాలి ఆమె ముంగురులతో సయ్యాటలాడుతోంది. రాజు ఆమెవంక చూసేడు. 'ఎంత అందంగాఉంది మంజుల! ఈమెకి యింత దగ్గరగా ఉండికూడా యింత కాలంగా నన్ను నేను ఎలా నిగ్రహించుకోగలిగేను?' అనుకున్నాడు.

ఇంతలో ఏదో శబ్దమైనట్లయి చెట్టు వైపుకు తలెత్తి చూసింది మంజుల. ఆ దృశ్యాన్ని చూస్తూనే ఆమెముఖాన నెత్తురుచుక్క లేదు. అదే సమయానికి రాజుకూడా పైకి చూసేడు. అక్కడ రెండు పక్షులు ... లజ్జతో తల కిందికి వాల్చాడు.

"రాజూ! మనంకూడా అలా... ఛీ" అంటూ ఏడుపుముఖం పెట్టింది మంజుల. ఆమె శరీరమంతా ఏదో తెలియని భావావేశంతో వణికిపోతోంది.

కాని అతను పురుషుడు. మొదట అతనిలోని ఉత్తమసంస్కారం అతనిని తలవంచుకునేట్లు చేసింది. వెంటనే అతని నరనరాల్లోనూ ఏదో కదలిక బయలుదేరింది. చుట్టూఉన్న వాతావరణం, కొన్ని సంవత్సరాలుగా అణచిపెట్టబడిన అతని కోరికలు, తన ముందు విభ్రమంగా నిలబడిన కన్య— అతని నుద్రిక్తపరచినాయి. తను చేసే పని ఎలాటి పరిణామాలకు దారితీస్తుందో ఊహించలేని మైకంలో అతడామెను దగ్గిరకు తీసుకున్నాడు. ఆమె ఎంత పెనుగులాడినా లాభంలేకపోయింది.

కర్ణకఠోరమైన మేఘగర్జనముందు ఆ అబల ఆక్రందనం క్షీణమైపోయి అతని చెవులకు వినపడనే లేదు. ప్రకృతి విలయతాండవం చేస్తున్న ఆ సమయంలో జరిగిపోయిన దారుణానికి రాజు ఎంతవరకుబాధ్యుడో నిర్ణయించ




గల న్యాయాధికారి ఎవరూ లేరు

అరగంట పట్టింది అతని జ్ఞానేంద్రియాలు స్వాధీనంలోకి వచ్చేసరికి! అతను కళ్ళు తెరవగానే తన కౌగిలిలో యిమిడిఉన్న మంజుల కనబడింది చీకటిలో ఆమె ముఖం స్పష్టంగా కనపడటంలేదు ఐనా ఆతని మనోదృష్టికి ఆమెముఖం ఎంతో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నట్లు కనపడింది "మంజూ! నా మంజూ! ఇటుచూడు ఒక్కసారి నా వంక చూడవూ?" అంటూ ఆమె బుగ్గలను ప్రేమతో నిమిరేడు

"నీ యీ కౌగిలిలో ఎంతహాయి ననుభవిస్తున్నానో తెలుసా? సమస్త విశ్వాన్నీ నాలో లీనం చేసికొన్నంత గర్వంగా ఉంది నాకు," అన్నాడు.

ఆమెలో కదలిక లేదు.

రాజు ఆమె బుజం పట్టుకుని ఊపి, "మంజూ లే, వర్షం వచ్చేట్టున్నది. పోదాం పద," అంటూ ఆమెని లేపేడు.

కాని ఆమెలో చైతన్యం లేదు.

రాజు పేరాశతో, మల్లెమొగ్గ రేకులను విప్పి వాసన నాఘ్రాణిద్దామని ప్రయత్నించిన బాలుడిలా, ప్రవర్తించేడు. చక్కని సౌరభాన్ని అందించే మల్లెపూవుకు బదులుగా చితికిపోయిన రేకులులేని మొగ్గ తగిలిం దతనిచేతికి.

దాన్ని చూస్తూనే కెవ్వున కేక పెట్టేడు రాజు.

ఆ దృశ్యాన్ని తిలకిస్తున్న ఆకాశం గుండె బ్రద్దలై కన్నీటిధారలు కురిపించసాగింది.

"ఏమండీ, ... ఏమండోయ్! .

పరుగులాంటి నడకతో, వంటచేస్తూ చేస్తూ, చేత్తో గరిటతో వగరుస్తూ వచ్చింది కమల

"ఏమండీ, ... చూశారా? ... విన్నారా?..."

పేపరులో తలదూర్చుకు కూర్చున్న రామారావు చూడాలేదు, వినాలేదు

"అబ్బ...ముందిది వినండి," బలవంతంగా చేతిలో పేపరు లాగేసింది కమల

"ఏమిటి వినడం?" విసుక్కుంటూ అన్నాడు రామారావు.

"సుశీలా, వాళ్ళాయనా దెబ్బలాడుకుంటున్నారండీ," రహస్యం చెప్తున్నట్టు గొంతు తగ్గించి అంది కమల.

"అయితే ఏం చెయ్యమంటావు? వెళ్ళి విడదీయమంటావా?" హాస్యంగా అన్నాడు రామారావు

"అబ్బ ... అది కాదండీ పెద్ద- ఎంతో మెచ్చుకుంటారుగా మీరు వాళ్ళని వాళ్ళు మనలా ఎన్నడూ తగూలాడుకోరనీ, ఇద్దరూ పెద్ద చదువులు చదివినవారు, సంస్కార వంతులనీ ఎంతో పొగుడుతారుగా...ఆవిడ అంత చదివినా ఎంతో అణుకువుగా వుంటుందనీ, నాలాంటి మిడిమిడి జ్ఞానం వున్నవాళ్ళే, సగం సగం చదివినవారికే ఈ బిర్రతిరుగుడనీ, నిండు కుండ తొణకదనీ...ఎంతో మెచ్చుకుంటారుగా ఆవిడని ... వెళ్ళండి, వినండి! ఎలా దెబ్బలాడుకుంటున్నారో! .. మనకంటె ఎక్కువగా దెబ్బలాడుకుని, అరచుకుంటున్నారు," చెప్పుతూ అంది కమల

"నిజంగానే? ఏమని దెబ్బలాడుకుంటున్నారేమిటి?" కాస్త కుతూహలం కనపరిచాడు రామారావు

"రండి, వినండి, స్వయంగా వింటే మీకే తెలుస్తుంది,..."

ఇష్టం లేకపోయినా కుతూహలం అణుచుకోలేక లేచివెళ్లాడు రామారావు

"అవును నిజమే, నీవూ చదువుకున్నదానివి, నాతో సమానంగా ఉద్యోగం చేస్తున్నదానివి నా అంతటిదానివి నీవు — మొగుడంటే లెక్క ఏమిటి? మొగుడు పడన్నా అంటే పడవలసిన అవసరం నీ కేమిటి?... అనడం నాదే తప్పు," సుశీల మొగుడు శేఖర్ గొంతు గట్టిగా వినిపిస్తోంది

డి. కామేశ్వరి



"పిల్ల అందాన్ని చూట్టానికి వరుడు స్వయంగా వచ్చాడు."

"ఎందుకలా నోరు పారేసుకుంటారు అనవసరంగా. నే నేం తప్పు మాట అన్నానని! ఇంటికి వచ్చి గుమ్మంలో అడుగు పెట్టానో లేదో, ఇది సరిగా లేదు, అది సరిగా లేదు, వెధవయిల్లు అని సాధిస్తే నే నేం చేస్తాను. యింటికి వచ్చిన దగ్గిరనించీ విసుక్కుంటే...నేను మాత్రం మనిషినికానా? ... నేనూ ఉదయమనగా మీతో వెళ్ళినదాన్నేగా! యిప్పుడు మీతో సరిగా వచ్చాను. నే నేం పోనీ ఇంట్లో వూరికే కూర్చుని చేయలేదన్నా బావుంది..." సుశీలగొంతు అసహనంగా వినిపించింది.

"ఆ...చేశావులే మహా ఉద్యోగం. లోకంలో నీ వొక్కర్తివే చేస్తున్నట్లున్నావు. మాటమాటకీ నేనూ మీలా ఉద్యోగం చేస్తున్నానని చెప్పనక్కరలేదు. ఆ మాట నాకూ తెలుసు..."

"తెలిస్తే ఎందుకలా మాట్లాడుతారు? ఏం, ఆడదాన్నయితే నా కింక పదిచేతులు ఎక్కువ వున్నాయనుకున్నారా – ఇంటా బయటా ఒకసారే చక్కపెట్టడానికి. మీ కంటే, ఇంటికి వచ్చాక అయినా విశ్రాంతి: నాకు అదీ లేదుగా! ఇప్పుడు మళ్ళీ వంట వండాలి. నేనూ మీలా మనిషినే?"

"ఓహో ... 'నీతో సమానంగా ఉద్యోం చేస్తున్నాను కనక, నాతో సమానంగా వంట చేయాలి' అనా నీ

ఉద్దేశం? అంతేనా? ఎంత ఉద్యోగస్తు రాలైనా ఆడదానివి, నా భార్యవి అని గుర్తుంచుకో - వళ్లు దగ్గరుంచుకు మాట్లాడు.." రెచ్చిపోయాడు శేఖర్.

"నోటికి వచ్చినట్లు అనవసరంగా మీరు పడంటే అది పడేదాన్ని గాదు. నేను మిమ్మల్ని వండమనలేదు, వార్చ మనలేదు; అన్నదల్లా అయినదానికీ కానిదానికీ సాధించవద్దన్నాను;" ఆవిడగొంతూ తారస్థాయి నందు కుంది.

కమలా రామారావూ మొహాలు చూసుకున్నారు. 'ఇప్పు డేమిటంటారు' అన్నట్టు చూసింది కమల. ఆశ్చర్య పోయాడు రామారావు. 'ఎనిమిది నెలలుగా వుంటున్నా, ఒక్కసారైన గట్టిగా మాటామాటా అనుకోనివాళ్ళు యీరో జేమిటి యిలా పోట్లాడుకుం టున్నారు. ఏంజరిగింది?' ఆశ్చర్యంగా స్వగతం చెప్పుకున్నాడు రామారావు.

"ఏం, ఎంత చదువుకుంటేమాత్రం, మొగుడూ పెళ్ళాలు అన్నాక దెబ్బ లాటలు రావా? అంత ఆశ్చర్యపడ డానికి ఏముంది?" సందు చూసుకుని చెప్పింది కమల.

సుశీలా శేఖర్‌లు ఇద్దరూ ఎం.ఏ.లు, ఇద్దరూ కాలేజీలో లెక్చరర్లు. ఆ ఇంటికి వచ్చి ఎనిమిదినెలలు అవుతూంది. చిన్న భాగంలో కమలావాళ్ళూ, పెద్దభాగ ములో సుశీలా వాళ్లూ వుంటున్నారు. రామారావు ఏజీ ఆఫీసులో ఏకౌం టెంట్. రెండొందలయేభై జీతంతో, ముగ్గురుపిల్లలతో సంసారం నెట్టుతున్న సామాన్యసంసారి. కమల డిగ్రీ చదు వులు చదవకపోయినా, అభ్యుదయ భావాలు కలది.

అద్దెకు వచ్చిననాడే సుశీలా శేఖర్ లంటే కమలకీ రామారావుకీ ఇద్దరికీ ఎంతో గౌరవభిమానాలు కలిగాయి. ఇద్దరూ బాగా చదువుకున్నవారనీ, ఇద్దరూ ఉద్యోగస్థులనీ తెలియగానే ఆ గౌరవం యింకా యినుమడించింది. వాళ్ళకి పెళ్ళి అయి నాలుగేళ్ళయింది. ఇద్దరు పిల్లలనీ చూడడానికి ఆయాని యింట్లో వుంచి, ఇద్దరూ ఉద్యోగాలు ఏ గర్వం లేకుండా సరదాగా, కలుపు గోరుతనంగా, ఆత్మీయత కనపరచి మాట్లాడడంతో ఆ రోజునించే రెండు కుటుంబాలమధ్యా మైత్రి ప్రారంభమై, గాఢమైంది కొద్దిరోజులలోనే. ఆది వారంగాని, శలవరోజుగాని వస్తే రెండుకుటుంబాలు ఒకేఇంట్లో కాఫీలు భోజనాలు చేసి నలుగురూకలసి పేకాడు కోవడం, సినిమాల కెళ్ళడం, ఏ పిక్నిక్ లకో వెళ్ళి శలవరోజులు ఎంతో సర దాగా గడిపేవారు రెండుకుటుంబాల వారూ. ఎంతో అన్యోన్యంగా వుండే ఆ దంపతులని చూస్తే రామారావుకి ఎంతో ముచ్చటవేసి, కమలని అస్త మానూ దేప్పేవాడు.

"చూడు, ఆవిడని చూడు. అంత చదువుకుంది, ఉద్యోగం చేస్తోంది, అయినా యింట్లో పనిపాటలు చేసుకుంటూ ఎంతపొందికగా వుంటుందో. పిల్లల్ని ఎట్టి అలవాట్లతో పెంచుతుందో చూడు. ఎంతో కలుపుగోలుతనముగా వుంటుంది గర్వమనేది లేకుండా ఇన్నాళ్ళయింది ఎన్నడన్నా వాళ్ళిద్దరూ మాటా మాటైనా అనుకున్నారా? ... చూసి నేర్చుకో – అదీ దాంపత్యమంటే? ... నీవో, చదివింది మెట్రిక్యులేషనేగాని. ప్రపంచంలో అన్ని విషయాల గురించీ నీకు తెలియంది లేదంటావు? ... ప్రతిదానికీ అవునంటే కాదనడం, కాదంటే అవుననడం, ఏమైనా అంటే నామీద విరుచుకుపడడము, ఆ కోపంలో పిల్లల్ని చావకొట్టడం, గిన్నెలు ఎత్తేయడం...ఇవేగా నీకు తెలిసింది ... ఇంట్లో మొగుడికీ పిల్లలకీ వండిపెట్టడం ఊరందరికీ ఉపకారములాగ, మహా కష్టపడిపోతున్నట్లు రోజుకి పదిసార్లు విసుక్కోవడం చూడు, ఆవిడ చూడు ఎప్పుడు చేస్తుందో, ఎలా చేస్తుందో ... పదింటికల్లా అన్ని పనులూ చేసి కాలేజికి వెడుతుంది..." రోజుకి అధమం ఒకసారైన రామారావు ఆవిడనీ, ఆవిడ నేర్పునీ, వాళ్ళ అన్యోన్యతనీ గురించి, ఆ ఆదర్శ దంపతులని పొగడక మానడు కమలకీ లోపల వాళ్ళంటే గౌరవాభిమానాలు వున్నా, భర్తనోట ఆ పొగడ్తలు విని సహించలేదు

"ఆ...మీరూ చెప్పడమే! అన్యోన్యత గురించి! ఆయనలా మీరుంటే తప్పకుండా ఆవిడలా నేనూ వుంటాను ... మీ రెప్పుడయినా, ఒక్కనాడయినా, వంట్లో బాగుండక చస్తున్నా, వంటింట్లోకి తొంగిచూసిన పాపాన పోయారా? జ్వరం వచ్చినా ఇన్ని కాఫీనీళ్ళయినా నా మొహాన్న పోశారా ఎప్పుడయినా? ఆయన చూడండి, ప్రతిపనికీ ఆవిడకి ఎలా సాయపడతారో? ఉదయం లేచి ఒకరు కాఫీ కలిపితే, ఇంకోరు టిఫిన్ చేస్తారు. ఆయన చకచక కూరలు కడుగుతే ఆవిడ అన్నీ కుక్కరులో పడేస్తుంది. ఆయన ప్లేట్లు సవరిస్తే ఆవిడ వడ్డిస్తుంది. ఆవిడ వంట చేస్తూంటే ఆయన ఆయా చేత పిల్లలకి నీళ్లు పోయించి, ముస్తాబు చేస్తాడు ఇద్దరూకలసి చకచక అన్నీ పనులూ చేసుకుంటారు ఏం, ఆయన మాత్రం ఉద్యోగం చేయడం లేదేమిటి? పెద్ద మీరే మగవాడినన్నట్లు, మగతనానికి అవమానం అన్నట్లు యిటుపుల్ల తీసి అటు పెట్టరు ... చస్తున్నా అటు చూడరు...అంతగా అయితే ఒకక్యారియరు తెచ్చి నా మొహాన్న పడేస్తారు...గాస్ స్టౌవ్, ప్రెషరు కుక్కరులతో ఆవిడ అరగంటలోనూ చేస్తుంది, అరనిమిషంలోనూ చేస్తుంది వంట.

మండనిక బ్రరలూ, తడి బొగ్గులూ, ఏడ్చే పిల్లలూ – అన్నీ ఒక్కర్తినే చూసుకో వాలి. ఆవిడలా నేనెలా చేస్తాను. ఇద్దరూ కలిసి ఆర్జిస్తున్నారు. దర్జాగా ఖర్చు పెట్టారు. రోజు కో చీరతో నీటుగా ఆవిడ కాకపోతే నే నెలా అవుతాను ముస్తాబు! ... పదిసార్లు అడగ్గా అడగ్గా ఏడాది కో అరుచీర్లో కొనడానికి బ్రహ్మాండం చేస్తారు ... పైగా...ఆవిడతో నన్ను పోల్చడాని కైనా సిగ్గుండాలి! ఏదీ పోనీఆవిడలా నాకు డిగ్రీలు లేకపోయినా, ఏదో మెట్రిక్ ప్యాసయ్యాను గదా, ఓ గుమాస్తా ఉద్యోగం దొరక్కపోదు... ఏదైనాఉద్యోగం చూడండి చేస్తాను... అక్కడితో వదులుతయి ఆదర్శాలూ, ఆశయాలూ అంటూ పెద్దకబుర్లు!"– అంటూ కడిగేస్తుంది కమల. జవాబు చెప్పలేక గుటకలు మింగుతాడు రామారావు.

"ఏం మాట్లాడరేం? ... అబ్బే... తనదాకా వచ్చేదాకానే యీ కబుర్లు. పెళ్ళాంచేత ఉద్యోగం చేయించేటంత సంస్కారం ఎంతమంది మగవాళ్ళకి వుంటుంది? ... అందులో మీరా? అయ్యో రామ! ఒకవేళ ఉద్యోగం చేయించినా ఆయనలా ఇంటిపని చేస్తారా? ... యిటు యింటి చాకిరీ, అటు ఆఫీసు పనీ అన్నీ నా నెత్తిన రుద్దుతారు తప్ప, అలాంటి సహకారం మీ రెక్కడ యిస్తారు? ... ఆయనలా మీ రెక్కడ వుండగలరు? ... అంచేత ఆవిడతో నన్ను పోల్చకండి .." అంటూ గంయ్ మంటుంది కమల.

"చాల్లే... పెద్ద చేస్తావు ఉద్యోగం! స్కూలుఫైనలు చదువుకే నా నెత్తినెక్కి తొక్కుతున్నావు! ఇంకా ఉద్యోగం చేస్తే నన్ను నిల్వనిస్తావా?.. వెళు... వెళ్లు...ఆ కూర ఏం మాడి తగలడిందో చూడు ... మన దెబ్బలాట రోజూ వుండేదే!" అంటూ అనవసరకోపం నటిస్తాడు.

రోజుకోసారి రామారావు వాళ్ళని పొగడకా మానడు, కమల దెప్పకా మానదు. అయినా ఇద్దరికీ లోలోపల ఆశ్చర్యంగానే వుండేది. ఎంత అన్యోన్య దంపతులైతే మాత్రం ఒక్కసారైన మాటా మాటా అనుకోకుండా ఎలా వుంటారు?" అన్న సందేహం వచ్చేది. అందుకే ఇద్దరూ ఈ రోజు వాళ్ళ దెబ్బలాట విని ఒకరనిమించి ఒకరు ఆశ్చర్య పడ్డారు—

—"బాబుని చూడు! ఎలా వున్నాడో? నీ కసలు యింటి సంగతీ, పిల్లల సంగతీ ఏమైనా పడుతుందా? పిల్లల్ని కనగానే సరి కాదు. వాళ్ళని సక్రమంగా పెంచాల్సినబాధ్యతకూడా వుందని గుర్తుంచుకో ... అయినా నా వెర్రికాని, నీకు పిల్లల్ని చూడవలసిన అవసరం ఏమిటి? ... పెద్ద ఉద్యోగస్థు



రాలివి, ఆయాని పెట్టావుగా వాళ్ళ కోసం. ఏదీ, కన్నావు సరిపోయింది. ఇంక వాళ్లు గాలికి పెరుగుతారులే;" హేళనగా అంటూన్న శేఖర్ మాటలు కమల, రామారావు కుతూహలంగా వినసాగారు.

"...ఏమిటి మీ ఉద్దేశం ? ... ఊరు కుంటున్నకొద్దీ ఎందుకు కావాలని నన్ను రెచ్చగొడ్తున్నారు?" తీక్షణంగా ఉంది సుశీల గొంతు.

"అవును, కావాలనే కవ్విస్తున్నాను. చూడు, బాబువంక ఒకసారి చూడు; ఆ బట్టలు, ఆ వళ్లు ఎలా మట్టిగొట్టుకుని వున్నాయో చూశావా? ఎన్నాళ్ళ యింది వాడికి నీవు శుభ్రంగా తల దువ్వి నీళ్ళు పోసి. అన్నీ ఆయామీద వదిలే యడం, దాని దయాధర్మాలమీద వాళ్లు ఆధారపడడం,...పాప చూడు అలా గంటనించీ తడిబట్టల్లో పడుకున్నా నీకు కనిపించిందా? ... పిల్లలిద్దరూ ఎలా దిక్కు లేనివాళ్లలా వున్నారో...యివేవీ నీకు కనపడ్డంలేదా? ... ఎంత ఉద్యో గస్థురాలివైనా, నీవూ ఒక తల్లివే..."

"ఓహో !...నేను తల్లినేగాని, మీరు

తండ్రి కాదుగాబోలు. నాకేగాని మీ కే బాధ్యతా లేదుగాబోలు! నాకొక్క-ర్తి కేగాబోలు పిల్లలు... నేను వంటింట్లో వున్నాను.. బాబు అంత మట్టిగొట్టుకు వుంటే కాస్త కడిగి బట్టలు తొడిగితే తప్పా?...పాప ప్రక్క-బట్టలు మారుస్తే మీ మగత్వానికి అవమానం గాబోలు... అన్నీ నేనొక్క-ర్తినే చూసుకోవాలా? చచ్చీచెడీ రోజంతా కాలేజీలో అరచి ఇంటికి వచ్చి... మళ్ళీ నిమిషం తెరిపి లేకుండా వంటా అదీ చూస్తున్నానే, మీ రాం మాత్రం చేస్తే తప్పా?"

"నోర్మూయ్...అంతవరకు వచ్చిందన్నమాట వ్యవహారం!... యివాళ పిల్లల బట్టలు తీయమంటావు, రేపు వాళ్ళ దొడ్లు ఎత్తమంటావు!...కాస్త వళ్ళు దగ్గిరుంచుకో! నీ వెంత చదువుకున్న దానివైనా, ఉద్యోగస్థురాలివైనా...కట్టుకున్న మొగుడిని అవమానించి మాట్లాడితే సహించే ఓర్పు నాకు లేదు."

"ఎంత మీ భార్యనైనా, ప్రతిదానికీ రాద్ధాంతం చేస్తూంటే పడివుండే ఓర్పు నాకూ లేదు. నా విధులు, నా బాధ్యతలు నాకు తెలుసు. మీరేం ప్రతిదానికీ గుర్తు చేయనక్క-ర లేదు;" తీవ్రంగా వుంది సుశీల గొంతు.

—వింటున్న రామారావూ, కమలా ఆశ్చర్యంతో చూసుకున్నారు. ఎన్నడూ గట్టిగాకూడా జవాబీయని ఆవిడ, భర్తకి ఎంతో గౌరవ మిస్తూ, నమ్రతగా వుండేఆవిడ ఏమిటి యివాళ ఇంత దురుసుగా మాట్లాడుతూంది!... ఆయన మాత్రం భార్యని ఎంతో ప్రేమగా అభిమానంగా చూస్తూ, అన్నింట్లో సహకరిస్తూ, కావాలని ఉద్యోగం చేయించే మనిషి యివాళ ఎందుకిలా ఆమెని కించపరుస్తున్నాడు! అసలు యిద్దరూ పిల్లల్ని ఎంతో శుభ్రంగా వుంచి, మంచి శిక్షణలో పెంచుతారు. సగం పిల్లల పని అంతా అతనే చూస్తాడు రోజూ. ఇవా ళేమిటి ఇలా అంటున్నాడు? ఏం అయింది ఇద్దరికీ? అసలు తప్పు ఎవరిది?... ఎందుకొచ్చింది అసలు తగువు!! .. ఎంత ఆలోచించి నా ఏం తేల్చుకోలేక పోయారు ఇద్దరూ. ఇంకా పూర్తికాని ఆసంభాషణ ఈసారి మరింత శ్రద్ధగా వినసాగారు ఇద్దరూ, నిశ్శబ్దంగా చూపులతోనే ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ! —

—"బీరువా నిండా అన్ని చీరలు మూలుగుతూంటే మళ్ళీ ఏం అవసరం అని నూటఏభై పెట్టి చీర కొన్నావు?... ఇంకా ఈ నెల ఖర్చులు అన్నీ అలాగే వున్నాయి. ఏం తొందర వచ్చిందని చెప్పకుండా చేయకుండా ఇలా ఖర్చు పెట్టేశావు?"

"ప్రతి దమ్మిడీకీ లెక్క- చెప్పాలా? ఆమాత్రం ఖర్చుపెట్టే స్వాతంత్ర్యం నాకు లేదా? అన్నింటికీ సంజాయిషీ



ఇచ్చుకోవాలా ?...ప్రతీదానికీ ఇంట్లో రాద్ధాంతమే !"

"అవును అన్నింటికీ రాద్ధాంతం లాగే కన్పిస్తుంది నీకు...ఇద్దరం సంపాదిస్తున్నా, దమ్మిడీ నిలవలేదు యిప్పటి వరకు! ... అసలు నీ కేమైనా యింటి ఖర్చుల సంగతి తెలుస్తుందా? ఒళ్ళూపై తెలియకుండా రాబడికంటె ఎక్కువ ఖర్చులు పెడుతున్నావ్ తెలుసా. అన్నీ సమర్థించుకోలేక నే నెంత సతమతమవుతున్నానో తెలుసా?"

"ఎందుకన్ని మాటలంటారు అనవసరంగా. లేటెస్ట్ పాషన్ చీరెలు వస్తే నాలుగు తీసుకున్నాను తప్పా? ప్రతి దానికీ ముందు మీ పర్మిషన్ లేకుండా ఏం చేయకూడదా? ఏదో అంతబరువూ మీ రొక్కరూ మోస్తున్నట్టు, నే నేదో ఊరికే తిని కూర్చుని డబ్బు తగలేస్తు

న్నట్టు మాట్లాడుతున్నారు నేనూ మీతో సమానంగా సంపాయించి మీ చేతుల్లోనే పెడుతున్నాను అంతా. ఆ మాత్రం బరువులూ, బాధ్యతా నాకూ తెలుసు!...

"ఓహో...అంతవరకు వచ్చిందన్న మాట ... నీ డబ్బు ... నా డబ్బు అన్నంతవరకు వచ్చిందన్నమాట ... ఇవాళ నీ డబ్బన్నావు ... రేప్పొద్దున ఆడదాని డబ్బు తింటున్నా వంటావు. ఇంతకీ నాదే తప్పు...యీ నెలనించీ నీ డబ్బు నాకు దమ్మిడీ యీయవద్దు. బేంకులో దాచుకో...చీరలే కొనుక్కుంటావో, నగలే చేయించుకుంటావో!..."

"ఛీ...మీ రెందుకిలా తయారవుతున్నారు రోజురోజుకీ ... ముచ్చటపడి నాలుగు చీరలు కొనుక్కున్నందుకు ఎంతగొడవ చేస్తున్నారు. బైటికి వెళ్ళి ఉద్యోగం చేయవలసిన దానిని కాస్త మంచిచీరలు వుండాలని కొనుక్కోడం, ఎంత రాద్దాంతానికి కారణం అయింది."

"అవును, రోజుకో చీర గట్టి నీ అందాన్ని అందరికీ చాటుకోవద్దా మరి! ఆ పార్థసార ...శర్మా...అందరూ నీ చుట్టూ చేరొద్దా!!

"ఏమిటి మీ రనేది?" ఆశ్చర్యంగా అంది సుశీల.

"నే ననేది పాపం నీకు తెలియదులా వుంది! స్టాఫ్ రూములో గంటలకొద్దీ పార్థసారథీ, శర్మలతో వికవికలు పకపకలు - అవన్నీ నాకు తెలియదనుకున్నావు గాబోలు..."

"ఏమిటి మీరు మాట్లాడేది?" అత్యాశ్చర్యంతో ధ్వనించింది సుశీల గొంతు.

"ఎందుకు అమాయకత్వం నటిస్తావు యింకా? ఏమిటూ అంతూ పొంతూలేనికబుర్లు నీకు మగవాళ్ళతో! రోజూ చూస్తున్నాను ... బొత్తిగా మంచీ చెడ్డా లేకుండా, అసహ్యంగా, ఆడదాన్నని మరచిపోయి, మగవాళ్ళతో సమానంగా ఏమిటూ నవ్వులు, ఆ మాటలు...?"

"ఏమిటి మీ ఉద్దేశం! మాట్లాడితే తప్పేమిటి? ఐనా తీరికసమయాల్లో తోటి లెక్చరర్లతో మాట్లాడడం తప్పా? శర్మా, పార్థసారథీ యిద్దరూ తమాషాగా మాట్లాడతారు కనక వాళ్ళతో ఎక్కువ మాట్లాడతాను. అందులో ఏం తప్పుంది? అయినా, నలుగురిలో ఉద్యోగం చేస్తూ ఎవరితో మాట్లాడకుండా ఎలా వుంటాను? అయినా మీకీ అనుమానాలు, అపార్థాలు ఏమిటి అన్నింటికీ. నాకీ అంతు లేమిటి? ఆమాత్రం మంచీ మర్యాదా నాకు తెలియదా? మాట్లాడినంత మాత్రాన ఎవడితోనూ లేచిపోను." అసహనంగా, విసురుగా అంది సుశీల

"చాల్లే, యింకా సమర్థించుకుంటు న్నావు? నీ వ్యవహారం అంతా కని పెడుతున్నాను. నీ వరస అంతా చూస్తున్నాను. నా కేం నచ్చలేదు నీ సంగతి. నీ వెంత ఉద్యోగస్థురాలివైనా, నా భార్య వని గుర్తుంచుకో. నా భార్య మానాభిమానాలు విడిచి ప్రవ ర్తించడం నేను సహించను."

"నా మానాభిమానాలు కాపాడు కోవడం మీకంటే నాకు ఎక్కువ అవసరం. ఆ సంగతి నాకు తెలుసు... మగవాడితో మాట్లాడితే మానాభి మానాలు పోతాయని నాకు తెలి యదు...... అందులో భర్తకి చేసే ద్రోహం ఏంవుందో నాకు తెలియదు. భర్తకి భార్య ఎంత విశ్వాసంతో వుండాలో భర్తా భార్యకి అంత విశ్వా సంతో వుండాలని పాపం మీకు తెలి యకే గాబోలు...ఆ సుహాసినీ దేవితో అలా తిరుగుతారు; పద్మావతితో అలా గంటలకొద్దీ బాతాఖానీ కొడ్తారు......సరళా దేవికి నోట్సులు ప్రివేరు చేసియిస్తారు – ఆవిడ కటాక్ష వీక్షణాల కోసం... నాకూ తెలుసు అపార్థాలు తీయడం... మాటలనడం... అయినా నేను మీలా అంత హీనంగా, నీచంగా ఆలోచించను!" వెటకారంగా అంటూంది సుశీల.

"నోర్ముయ్ ... ప్రతిదానికీ మగ వాడితో వంతా నీకు?" రెచ్చిపో యాడు శేఖ.

"ఛా ... మీలాంటి మనుష్యు లతో నాకు మాట లేమిటి? ... పైకి పెద్ద అభ్యుదయవాదుల్లా, సంస్కార వంతుల్లా నటించడం...యింట్లో యిదీ వరస! ఆడదాని అభ్యుదయం కాంక్షించే వారులా స్త్రీలు, సమాన హక్కులు, ఆదర్శాలు, ఆశయాలు అంటూ పెద్ద కబుర్లు ఏమిటో మాట్లాడి, 'డిగ్రీ వుండి యింట్లో ఎందుకు కూర్చోవడం' అని ఉద్యోగంలో ఎందుకు ప్రవేశపెట్టారు? సంస్కారవంతుల్లా!...ఆడది తనతో సమా నంగా సంపాయిస్తే ఒర్చుకోలేని వారు, భార్య ఉద్యోగం చేస్తే చిన్నచూపు చూస్తుందని భ్రమపడేవారు...భార్య పరాయిమగవాడితో మాట్లాడితేనే సహించలేనివారు ... యీ ఉద్యోగం ఎందుకు చేయమన్నారు? ... ప్రతీ మాటలో ప్రతీ చేష్టలో ... విపరీతా ర్థాలు తీస్తూ యిల్లు నరకం చేస్తు న్నారు? ... ఏం, నేను చదువుకున్న దాన్నని క్రొత్తగా తెలిసిందా? ప్రతి మాటకీ చదువుకున్నదానివని ఎత్తి పొడవడం, ఉద్యోగస్థురాలివని హేళన చేయడం...ఏమి టిదంతా!...అంతే, తనదాకా వస్తేగాని తెలియదు గాబోలు! తనతో సరిసమానంగా వుండడం ఏమగవాడు సహించలేడు గాబోలు. తనదే పై చేయిగా వుండా

అనుకునే అంత అహం ఎందుకో మగవాడికి?"... సుశీల గొంతు ఆవేశంతో వణికింది.

"ఛీ...రోజూ నే నీ నరకం ఇంక భరించలేను. నా కెందుకీ కష్టం, నిష్ఠూరం... హాయిగా యింటిపట్టనే కూర్చుంటాను...చాలీచాలని జీతంతో బాధపడినపుడుగాని, నా విలువ మీకు తెలియదు ... నేను రేపే యీ ఉద్యోగము రిజైను చేస్తున్నాను;" దృఢంగా అంది సుశీల.

— "చాలా దూరమే వచ్చింది అన్నమాట వ్యవహారం..." రామం నిట్టూరుస్తూ అన్నాడు అంతా విని, లోపలిగదిలోకి వెడుతూ.

"అలాగే చేయాలి ఆవిడ... అప్పటికిగాని తెలిసిరాదు అతనికి. ఓ రెండు మూడునెలలు డబ్బుయిబ్బంది పడితేనే గాని ఆవిడ విలువ తెలియదు అతనికి... అయినా ఎప్పుడు పోతుందీ మన దేశంలో యీ స్త్రీ, పురుషుల తేడాలు, హెచ్చుతగ్గులు. ఈ మగవారి జులుము, అధికారాలు ఎప్పటికి పోతాయో! ఎంత చదువుకున్నా స్త్రీ తనతో సమానంగా వుండకుండా, క్రిందనే వుంచాలనే యీ మగవారి అహంనించి ఎప్పటికీ విముక్తి." ఉపన్యాసధోరణిలో ఆవేశంగా అంది కమల

"ఆ ..ఆ... చాల్లే ... అవకాశం వస్తే చాలు, లెక్చర్లు దంచుతావు మగవాళ్ళ దురన్యాయాల గురించి..." విసుక్కున్నాడు రామారావు.

* * *

"ఏమండీ, భోజనాలయ్యాయా?... ఓ రౌండు రమ్మీ ఆడుదామా? తీరుబాటుగా వుంది యివాళ. రేపు క్లాసులన్నీ యించుమించు విరామమే..రండి ఓ గంట ఆడదాం," అంటూ రాత్రి ఎన్మిదిగంటలవేళ వచ్చిన సుశీలా శేఖర్లని చూసి కమలా రామారావు విస్తుపోయారు. ఇద్దరూ, ఏం జరగనట్లే, నవ్వుకుంటూ వచ్చిన ఆ దంపతులని చూసి 'వీళ్ళేనా రెండుగంటలక్రితం అంతలా తగువులాడుకున్నారు' అన్నట్టు మొహాలు చూసుకున్నారు. 'ఇద్దరూ, అంతలా దెబ్బలాడుకుని అప్పుడే ఒకటెలా అయ్యారు?' ... తామిద్దరూ మాటామాటా అనుకోవడంతో మొదలై చిలికిచిలికి గాలివాన అయి, ఆయన కేకలు వేయడం, తను ఏడవడం, ఆయన కాఫీ మానితే, తను భోజనం మాని రెండుమూరోజులు ఎడమొహం పెడమొహములు, తరువాత కుర్చీలనీ, గోడలనీ, పిల్లల్నీ మధ్యవర్తులుగా వుంచి మాట్లాడడం...తరువాత చల్లబడడం... ఇంత గ్రంథం జరుగుతుంది...అలాంటిది...వీళ్ళేమిటి గంట క్రితం చచ్చేట్లు దెబ్బలాడుకుని, మామూలుగా నవ్వుకుంటూ ఎలా మాట్లాడుకో గలుగుతున్నారు పేకా



డుతున్నంత సేపు సుశీలా శేఖర్లను పరిశీలనగా చూస్తున్న కమలా, రామారావుల సందేహం అది. సందేహం సందేహంలాగే వుండిపోయింది ఆపూట.

*　　*　　*

"అయితే, నిజంగానే మీరు ఉద్యోగానికి రాజీనామా చేస్తున్నారేమిటి?" మర్నాడు ఆదివారం కూరలమార్కెటుకి వెళ్ళే త్రోవలో సుశీలని అడిగింది కమల. అడిగాక గబుక్కున నాలిక కరుచుకుంది, పొరపాటు గ్రహించి. వాళ్ళ దెబ్బలాట విన్నామని నొచ్చుకుంటుందేమో - తొందరపడి అడిగానని బాధపడింది కమల.

సుశీల ఆశ్చర్యంగా చూసింది, అర్థం కానట్టు. "ఎందుకు? నేను రాజీనామా

చెయ్యడం ఏమిటి? ఎవరు చెప్పారు?"

కమల సర్దుకుంటూ గాబరాగా అంది : "అబ్బే... నేనే అంటున్నాను. మీకు యింటి పనీ, అటు కాలేజి పనీ కష్టంగా లేదూ! అందుకు పని మానేస్తా రేమో అనుకున్నా నని," ఏదో యధాలాపంగా అడిగినట్లు సర్ది చెప్పింది

"అబ్బే ... నాకిది అలవాటే ... నాలుగేళ్ళనించీ చేస్తున్నదేగా! ... ఇవాళ క్రొత్తగా వచ్చిన యిబ్బంది ఏముంది? .. అయినా అంత కష్టపడే పనేముంది? ఆయన సగంపని సాయం చేస్తారు ... మిగతా పన్లకి మనిషి వుండనే వుంది . ఉద్యోగం మాని రోజంతా నేను చేసే పాటేముంది? .. డిగ్రీ వుండి వూరికే కూర్చోవడ మెందుకు? ... ఏం నచ్చినా రాపడ మేగా.

"ఆ ... నిజమే ... " ఏదో అంది కాని, కమల లోలోపల చాల ఆశ్చర్య పోయింది. నిన్న అంత ఖచ్చితంగా రాజీనామా చేస్తానని చెప్పినమనిషి యివాళ యిలా అంటుందేమిటి? ... అయినా వీళ్ళు చాల గమ్మత్తు మనుషులు! లోపల ఎంత కొట్టుకుచస్తున్నా ... పైకి ఎంత అన్యోన్యత నటిస్తున్నారు.." అనుకోకుండా వుండలేక పోయింది కమల

* * *

మీ రిద్దరూ తప్పక రావాలిసుమా, ఇవాళ కాలేజీ ఫంక్షన్‌కి మంచి నాటకాలు, వివిధ వేషధారణలు వున్నాయి.'' మర్నాడు ఉదయం సుశీల అంది కమలావాళ్ళతో.

"ఏం వేషధారణలు, ఎందుకు ?''

"అదే... రక్షణనిధికి మా స్టాఫ్ అందరూ కలిసి నాటకాలు, వేషధారణలు ఏర్పాటు చేశాం,'' అంటూ రెండు ఐదురూపాయల టిక్కట్లు కొనిపించింది సుశీల. "ఒక నాటకంలో మే మిద్దరంకూడా వేస్తున్నాం. తప్పక రావాలిసుమా!" మళ్ళీ గట్టిగా చెప్పింది సుశీల.

"ఏం నాటకం?" కుతూహలంగా అడిగింది కమల.

''అబ్బే . ఇప్పుడే చెప్పేస్తే ఎలా? సస్పెన్స్ .. చూస్తారుగా," నవ్వింది సుశీల.

"ఆ .. అంత సస్పెన్స్ ఏముంది లెండి. నిత్యజీవితంలో తటస్థపడే కథే...... యీావిడే రాసిందిలెండి ఆ నాటకం... అందులోనూ మే మిద్దరము భార్యాభర్తలమే. 'నిజజీవితంలో మీ రిద్దరూ భార్యాభర్తలు కాబట్టి... నాటకంలో వేస్తే సహజంగా వుంటుం' దని అందరూ బలవంత పెట్టారు." శేఖర్ అన్నాడు.

"ఇంతకీ విషయిం ఏమిటి?" రామా రావు అడిగాడు

"ఏముంది... వివాహిత స్త్రీ... ఉద్యోగం చేస్తే...ఆమె ఎదుర్కొనే సమస్యలు, ఆమె యిటు యిల్లు, అటు ఆఫీసు పని సక్రమంగా చక్కబెట్ట గలదా? ఆమెకి భర్త సహకారం వుంటుందా? భర్త ఆమెని తనతో సమానంగా గౌరవించగలడా?... అందువల్ల ఆమె సంసారంలో విపరీత పరిణామం వస్తే ఆమె అన్నీ తట్టుకుని ఎదుర్కొని నెగ్గుకు రాగలదా?... మొదలైన అంశాలమీద నాటకం ... ఆ నాటకంలో మా రిహోల్సు చూసి చాల సహజంగా వుందని అందరూ మెచ్చుకున్నారు ... పాపం యీ దెబ్బతో ఉద్యోగం చేసే ఆడవాళ్ళ మొగుళ్ళందరికీ బుద్ధి తెప్పించి, వాళ్ళ తప్పులని తెలిసికొనేటట్టు చేయాలని మా ఆవిడ చాలా కష్టపడి రాసింది లెండి ఘనంగా. ఎంతవరకు తెలుతుందో యీావిడ యత్నం"... వేళాకోళంగా అన్నాడు శేఖర్.

"ఆ...బుద్ధి తెచ్చుకోవడం ఎలా వున్నా ... కనీసం వాళ్ళ తప్పులని వాళ్లు గ్రహిస్తే అంతేచాలు ... నా ఆశయం నెరవేరినట్లే?"... వస్తారుగా తప్పక?" సుశీల ఇంకోసారి హెచ్చరించింది.

ఇద్దరూ వెళ్ళిపోయాక ఏదో అర్థం అయినట్లు మొహాలు చూసుకున్నారు కమలా, రామారావులు. ఆ మిగిలిన సందేహం కాస్తా, రాత్రి నాటకం చూశాక తీరిపోయింది. రామారావు గర్వంగా "చూశావా, నే చెప్పలా, వాళ్లు ఎలాగైనా ఆదర్శదంపతులని – యిప్పుడైనా వప్పుకుంటావా?... త్రోవలో అన్నాడు కమలతో. కమల కళ్ళలో కాస్త ఆశాభంగం కన్పించినా తేలికగా నవ్వేసి వూరుకుంది. ★





# అది ప్రశ్న - ఇది జవాబు

అవసరాల రామకృష్ణారావు

శ్రీకృష్ణమూర్తి విజయకుమార్ ముఖాన్ని బలవంతాన పైకెత్తేడు. "చూడండి డాక్టర్! ఏ క్షణంలోనూ విచక్షణకూ క్రమశిక్షణకూ లోటు రానియ్యకూడదని ప్రతిజ్ఞలు చేసుకున్న భారత సైనికులం మనం. జరిగిందానికి ఆడదానిలా మీరే యిలా కృంగిపోతే మీకింద పనిచేస్తున్న యిందరి మాటేమిటి?"

కంపౌండరు లక్ష్మణసింగ్ అన్నాడు: "వారంరోజులై డాక్టర్సు సెమినార్‌లో పాల్గొనేందుకు ఢిల్లీ వెళ్ళేం. ఇంతలో ఇంత జరుగుతుందని కలలోకూడా అనుకోలేదు."

సిగ్నలింగ్ ఆఫీసరు శ్రీకృష్ణమూర్తి పిడికిలి బిగించి ఉద్రేకంతో అన్నాడు: "మంచీ చెడ్డా అనేవి రెంటూ వదిలేస్తే ఎంత సిగ్గుమాలిన పనికయినా సిద్ధపడవచ్చు. పగవారికి బాంబులు వెయ్యడానికి తెల్లవారుఝామున రెండుగంటలుతప్ప మంచి ముహూర్తమూ, పగ తీర్చుకోడానికి నిరాయుధులూ రోగపీడితులూ తప్ప తగిన శత్రుపక్షమూ దొరకలేదా? పోనీ పొరపాటున ఒకచోట వెయ్యబోయి మరొకచోట

వేళారా అంటే – విమానాలు బాగా క్రిందికి దిగి వరసగా కనీసం ఎనిమిదయినా బాంబులు వెయ్యడం స్పష్టంగా కనిపించిందే. యింతకన్న దారుణమూ, అమాను షమూ ఉంటుందా? ఆపరేషనుథియేటరూ, సర్జికల్ వార్డూ, ఎక్సురేడిపార్ట్ మెంటూ నామరూపా ల్లేకుండా పోయాయ్!"

లక్ష్మణసింగ్ మళ్ళీ అన్నాడు: "డాక్టరుగారికి యీ ఆసుపత్రే యిల్లు. ఈ రోగులే వారి బంధుజనం. ఒక్కసారి అంతా నాశనమైపోయి యింతగా భీభత్సం జరుగుతే ఆయన గుండె దెబ్బతినక ఏమౌతుంది!"

"అంతేనా డాక్టర్?" మూర్తి ప్రశ్నకు జవాబు రాలేదు.

"గురుతరమైన యింతబాధ్యత ఎప్పుడైతే మనం నెత్తిన వేసుకున్నామో అప్పుడే అన్నిటికీ సిద్ధమయి వచ్చాం. సాధారణమైన రాగద్వేషాలకు మన సైనికవృత్తిలో స్థాన మెక్కడిది! క్షణక్షణం మన కర్తవ్యం పటుతరమైపోతుంది. మరింత మెళకువతో మన బాధ్యత నిర్వర్తించే సమయం ఆసన్నమైంది. పదిమంది పరమ పదించినా, పాతికమంది గాయాలతో గిలగిల తన్నుకుంటున్నారు. అలవాటులేని ఈ అలసత్వం మీ కెక్కణ్ణుంచి వచ్చింది? మృత్యుముఖంలో ఉన్న రోగులకయినా చిరునవ్వుతో ధైర్యం చెప్పే అనన్యమైన మీ స్థయిర్యం ఎక్కడ దాచారు? డాక్టర్! లేవండి. ఎందరు అసిస్టెంట్సు ఉన్నా మీరే హేండిల్ చెయ్యవలసిన కేసులు అనేకం ఉన్నాయి. ఇలా నేను మీకు చెప్పవలసివస్తుందని కలలోకూడా అనుకోలేదు. లేచి మొహం కడుక్కోండి?"

"క్షమించండి మూర్తీ, ఇక నావల్ల కాదు!"

డాక్టరు విజయకుమార్ ముఖం మరింత తెల్లగా పాలిపోయిఉంది. "నావల్ల కాదు – అనేమాట మనం అనవలసింది కాదు. మనల్ని నమ్మి దేశం మనమీద ఇంత భారం పెట్టింది. తమ శరీరభాగాలలో అవికూడా ఒకటిగా భావించి అలంకరించు కున్న ఆభరణాల్ని తృణప్రాయంగా ఎంచి మన చెల్లెళ్లు మనకి యిస్తున్నారు. తాము తిన్నా తినకపోయినా ఒకముద్ద మిగిల్చి మనకోసం సొమ్ము కూడబెడు తున్నారు. ఇంతింత తమ్ముళ్ళు పైసలు కూడబెట్టి రూపాయలు చేసి మనకి పంపిస్తు న్నారు. స్వేదం మొదలు రక్తంవరకు మనదేశం మనకోసం ధారపోయనిది లేదు. మనల్ని కన్నదేశం మనల్ని పూర్తిగా నమ్మింది. ఎందుకు డాక్టర్? మనవల్ల కాదని చెప్పడానికేనా?"

"నాకు జరిగిం దేమిటో మీకు తెలియదు. నాకు కలిగిన నష్ట మెంతో మీరు ఎరు గరు. నన్ను అర్థం చేసుకుంటే మీ రిలా అని ఉండరు. మానవసేవే జీవితలక్ష్యంగా

ఎంచుకున్న మామూలు డాక్టర్ని మీరు ఎరుగుదురు. ఈ డాక్టరు ఇలా తయారవడానికి ప్రేరేపించిన శక్తులూ, వ్యక్తులూ ఎవరో మీకు తెలిసిఉంటే మీరు ఇంత ఆలోచించకుండా మాటాడరు మూర్తీ."

శ్రీకృష్ణమూర్తి వాచీ చూసుకున్నాడు. కన్నీరు కారుతుండగా డాక్టరు అన్నాడు: "ఈరోజు వచ్చి చూశాను. ఇటుకలు బ్రద్దలయాయి; గాజుపలకలు పిప్పి అయాయి; ఫర్నీచరంతా ముక్కముక్క లయింది; శస్త్రపరికరాలన్నీ చెడిపోయి చెల్లాచెదరు అయిపోయాయి. వీటిమాట లెక్కేమిటి? బాధలతో, బలహీనతలతో, భయపెట్టే పీడలతో ప్రతిక్షణం భయంకరసమరం చేసి అణువంత ఆధారం కనిపిస్తే ఆకాశమంత ఆశ పడుతూ పసిపిల్లలై నా ఆశ్రయం కోరిన కొందరు రోగులే శాశ్వతంగా విశ్రాంతి పొందేరు! ఈ దృశ్యం నన్నెంత కలచివేసిందో నా పరిస్థితిలో ఉన్నవారుగాని అర్థం చేసుకోలేరు. నా చేతగానితనం నాకు జ్ఞాపకం చెయ్యడానికి ఈ దారుణసంఘటన ఒక సాధనం మాత్రమే అయిందిగాని నేనింతగా నిరాశ చెందడానికి కారణం మీకు తెలియదు మూర్తీ!"

శ్రీకృష్ణమూర్తి ఎంతో సానుభూతితో విజయకుమార్‌వైపు చూశాడు. అయితేనేం, అతని విధి అతన్ని హెచ్చరించింది.

"డాక్టర్... మిమ్మల్ని నేను సరిగ్గా అర్థం చేసుకోలేకుండాఉన్నాను. స్పెషల్ ఎమర్జన్సీ కాల్‌మీద నేను సిగ్నల్‌స్టేషన్ మరొకరి అధీనంలో ఉంచి ఆసుపత్రి కొచ్చాను. మీతో ఉన్న పరిచయంవల్ల, మీ మీద నాకున్న గౌరవంవల్ల యీ కొద్ది సమయమైనా మీతో గడపగలిగాను. నేను వెంటనే వెళ్ళాలి. మీరుకూడా వెంటనే ఆసుపత్రికి వెళ్ళండి. అత్యవసరమైన కేసులకు వెంటనే ఎటెండ్ కండి. సరిగ్గా ఏడున్నరకి మా క్వార్టర్సుకి నే వస్తాను. అప్పుడు మీ గురించి పూర్తిగా వింటాను. ఫర్ కంట్రీస్ సేక్, డోన్ట్ వేస్ట్ ఒన్ మోర్ సెకండ్. లేచి డ్రెసప్ అవండి. మీ విధి మిమ్మల్ని పిలుస్తోంది. ఊ!"

శ్రీకృష్ణమూర్తి వెళ్ళిపోయాడు. ఐదు నిమిషాల్లో రెడీ అయిపోయిన డాక్టరు విజయకుమార్‌ని చూసి లక్ష్మణసింగ్ ఆశ్చర్యపోయాడు.

* * * *

"నన్ను కలుసుకోగానే మీఅంతట మీరు ఎన్నో విషయాలు చెప్తారనుకున్నాను. ఇలా ఇంతసేపు మౌనముద్ర వహిస్తారనుకోలేదు," అన్నాడు శ్రీకృష్ణమూర్తి ఖాళీ చేసిన టీ కప్పు కింద పెడుతూ.

"మీతో చెప్పి నా హృదయభారాన్ని తగ్గించుకుందామని మొదట్లో అనుకున్న

మాట నిజమే. కాని ఎక్కడికి వచ్చినా, ఏ విధంగా చూసినా సార్థకత లక కేవలం వ్యర్థంగా కనిపించే నా దురదృష్టజీవితం ఒకరితో పంచుకోడం ఏమిన్యాయం, ఏమి ప్రయోజనం అని యిప్పు డనిపిస్తోంది.''

విజయకుమార్ వైపు మూర్తి అయోమయంగా చూశాడు. చూస్తూ అన్నాడు: "ప్రమాదకరమైన మన జీవితాలలో యివా శెక్కడో రే పెక్కడో. యాంత్రికంగా నడిచే మన జీవన విధానాలలో మనసువిప్పి మాట్లాడుకునే అవకాశాలే తక్కువ. ఆ మధ్య ఒకసారి జీ. టీ. కోసం వెయిట్ చేస్తూండగా ఢిల్లీ ప్లాట్‌ఫాంమీద మన వాళ్ళని ఓ నలుగుర్ని కలుసుకున్నాను. ఎంతలా ఎంజాయ్ చేశామనుకున్నారు! ఎవ రికి వాళ్ళం యింటిబాధ్యత లేని విడిమనుషులమే మో—యిక మాకు పట్టపగ్గాలు లేక పోయాయి.

"ఆ సందర్భంలో నేను నవ్వుతూ అన్నాను: 'జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలుతుం దంటారు. నలుగురు జోగులు రాసుకుంటే ఏం రాలుతుందా' అని.

"నా నవ్వుకి అందులో ఒకరు అభ్యంతరం చెప్పేరు: 'పవిత్రమైన జాతిభద్రత కాపాడే బ్రహ్మాండమైన బాధ్యత పైన వేసుకున్నాం. మనల్ని మనం హాస్యం చేసు కోడం న్యాయమా,' అని.

" 'ఎలాఅన్నా దానికి మరోలా అర్థం చెప్పుకోవచ్చు. బూడిద అంటే విభూతి—జ్ఞాన వైరాగ్యాలకు చిహ్నం. దీక్ష, త్యాగం మేళవించిన మన జీవితాలకు శిరో ధార్యం,' నేను ఏదో విధంగా సమాధానం చెప్పినా, పైలట్ వేణుగోపాలస్వామి తృప్తి పడలేదు. నా కెందుకో అతన్ని యింకా కరిగించా లనిపించింది.

" 'మిమ్మల్ని చూస్తూంటే మీ దగ్గిర కొన్ని విషయాలకు వివరణ తెలుసుకోవా లనిపిస్తోంది వేణూ. మీకు అభ్యంతరం లేకపోతే చెబుతారా?'

" 'నాకు తెలిసినంతవరకు తప్పక చెబుతాను. అభ్యంతరం దేనికి?'

" 'ఆశోపహతులూ, విధివంచితులూ—జీవితాలనుండి పారిపోయే ఒకమార్గంగా జీవితాలను అంతం చేసుకునే ఒక విధానంగా యుద్ధం సూచితం అవుతూంటుంది దానిమీద మీ వ్యాఖ్య?'

" 'అసలు మీ అభిప్రాయం ఏమిటి ముందు చెప్పండి?'

" 'మొదట అడిగింది నేను. మొట్టమొదట జవాబు చెప్పవలసింది మీరు."

"మిగిలిన యిద్దరూ మధ్యలో అడ్డుకున్నారు: 'అసలు మాకు ప్రశ్నే బోధపడ లేదు. వివరించి చెప్పండి.'

" 'అది కాదండీ! ప్రమాదభూయిష్టమని తెలుసుండి ప్రజలు యుద్ధంలో చేరడా

నికి కారణం ఏమిటి? ఆర్థికంగా వెనకబడిఉండటమా? ప్రేమవిషయంలో తిరస్కారమా? పెద్ద పెద్ద పరీక్షలు ప్యాసవలేకపోడమా? ఒంటరిగా రాని కష్టాలను ఒంటరిగా భరించలేక తప్పించుకుని పారిపోవడమా? ఏమిటంటారు?'

"పైలట్ నావైపు అసహ్యంగా చూస్తూ అన్నాడు 'ఏమీ ఎరగనివాళ్ళు. బొత్తిగా అజ్ఞానంగా వెయ్యవలసిన ప్రశ్నలు సర్వీసులో ఉన్న మీరు వేస్తూంటే వినడానికే నాకు చాలా చిన్నతనంగా ఉంది శ్రీకృష్ణమూర్తీ! మీ దృష్టిలో యుద్ధంలో చేరడం అంటే ఒక విధంగా శైలుకి ఖర్చు పెట్టినంతగా ఉంది చూస్తూంటే'

"మీరు పొరబడుతున్నారు వేణూ ఇవి నా ప్రశ్నలని ఎవరు చెప్పేరు? ఈ ప్రశ్నలకు మీ జవాబులు వినాలనుంది అంతే,' అన్నాను నేను"

హఠాత్తుగా వాక్కు విజయకుమార్ కలుగజేసుకున్నాడు "ఈ ప్రశ్నకి వాళ్ళేం జవాబు చెప్పేరు మూర్తీ?"

"జవాబు చెప్పేలోగా గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్ వచ్చేసింది ఎవరి హడావిడిలో వాళ్ళు విడిపోయాం - ప్రశ్నే మిగిలిపోయింది జవాబు దొరకలేదు'

విజయకుమార్ నిస్పృహగా తనలో అనుకుంటున్నట్లు "అవును. ఈ జీవితం అంతా ఒక పెద్దప్రశ్న జవాబు దొరకదు!' అని మళ్ళీ యీ లోకంలోకి వచ్చి అన్నాడు "నిజమే, 'యుద్ధంలో చేరిన ప్రతి ఒకడూ యింట్లోంచి చెప్పకుండా పారిపోయి వచ్చినవాడే' అనే ప్రజాభిప్రాయం ఒకటి లేకపోలేదు దానిని కాదనడానికి మన మేం ఋజువు చేయగలం!"

"అదేంటి డాక్టర్! ప్రతీదానికీ మన మేం రుజువు చెయ్యగలమా అని ప్రాక్టికల్‌గా లెక్కలు కట్టుకు కూచుంటామా.. ఎవరి అంతరాత్మకి వారు జవాబు చెప్పుకోగల స్థితిలో ఉంటే చాలదా? లేదా మనసిచ్చిన ఒక్క ఆత్మీయుణ్ణి సంతృప్తి పరిస్తే సరిపోదా? నామటుకు నే నీ ప్రశ్నగురించి ఎప్పుడూ ఆలోచిస్తూఉంటాను ఆజవాబే నాకు మానసికబలా న్నిస్తూఉంటుంది నేను ఈదేశంలో పుట్టేను ఈతల్లి ఒడిలో పెరిగేను, ఇక్కడఉన్న వెల్తురు చూసి అక్కడఉన్న వెన్నెల చూసి ఎక్కడా లేనంత పెరెత్తిపోయాను ఇంతవాణ్ణయాను అమ్మకు తిరిగి నే నేమిచ్చాను? తల్లి పట్ల తనయుడిజన్మ ధన్యం చేసుకునే కర్తవ్యంఅంటూ లేదా? తరతరాల త్యాగమూర్తులు చేతికిచ్చిన స్వేచ్ఛాభాగ్యాన్ని పదిలంగా భద్రపరుచుకునే బాధ్యత లేదా?"

"ఆపండి, శ్రీకృష్ణమూర్తిగారూ . . ఇంక ఆప్రశ్నలు అక్కడితో ఆపండి," విజయకుమార్ గట్టిగా అరిచాడు మూర్తి ఆతనివైపు ఆశ్చర్యంగా చూశాడు

"నాకూ ఒక కథ ఉంది జవాబు లేకపోయినా ప్రశ్నయినా ఉంది సందడికే

కాదు, సవ్వడికే నోచుకోని నాలో మళ్ళీ సంచలనం ఉందనిపించారు. బండబారిన బతుకులలో లేతమొలకలు లేపుతున్నారు మూగబోయిన మనసుమలుపులలో వలపుఅలలను ఊపుతున్నారు ఇంతవరకూ వచ్చాక యీవ్యథ యిట దాగదు ఈ కథ యిక ఆగదు "

డాక్టరు విజయకుమార్ ముఖ్యమైన తన జీవితఘట్టాలను వినిపించ నారంభించాడు సిగ్నలింగ్ ఆఫీసరు శ్రీకృష్ణమూర్తి. అతను చెప్పే ప్రతీఅక్షరం ఎంతో ఆసక్తితో వింటున్నాడు

*　　　　*　　　　*　　　　*

'ప్రజలు యుద్ధంలో ఎందుకు చేరుతారు ?' అనే ప్రశ్నలాగే ముందు నే నొక ప్రశ్నవేసి నాకథ ప్రారంభిస్తాను. విద్యార్థులు మెడిసన్అంటే ఎందుకు ఎక్కువ ఆసక్తి చూపిస్తారు? జవాబు నేనే చెబుతాను మనుషులంతా, ఇన్ జనరల్, దుర్మార్గులనేంత నిరాశావాదిని కాను నేను సరైనతోవని కనీసావసరాలు తీరతాయనే ధీమాఉంటే మనిషి సర్వసాధారణంగా తప్పుతోవ తొక్కడు కాని జీవనవ్యయం పెరిగిన, భౌతికసుఖాలమీద భ్రమ ఎక్కువైన నేటి నాగరిక జీవన వ్యాపారసరళిలో ఈ 'కనీసఅవసరాలు' అనేదాని నిర్వచనం తాటిప్రమాణాన ఎదిగిపోయింది నెలకి నాలుగుఅంకెల జీతమయినా లేనిదే మొగుణ్ణి మొగాడికింద లెక్కకట్టరు చిట్టితల్లులు కన్నం వేసిగాని, కన్నుమూసి కంట్రాక్టు చేసి కమిషన్ కొట్టిగాని, కల్లుదుకాణం పెట్టికాని, కన్యలచే కానివ్యాపారం చేయించిగాని కాసులు గడిద్దామని అందరూ అనుకోరు. మరి ? గొర్రెతోకలాంటి గుమస్తా ఉద్యోగం, బతకలేక బడిపంతులుపని, చెట్టుకింద ప్లీడరు డబ్బు తగినంత సంపాదించేది కాకపోయినా చేస్తున్న ఉద్యోగాన్ని గౌరవించడం, ముసిలిమొగుణ్ణి ప్రేమించడంఅంత కష్టం. అందుకనే ఎంబీ అన్నా బియ్యీ అన్నా అంతగిరాకీ ప్రజల్నందర్నీ రుణవిముక్తుల్ని చేసేసి అపారమైన లోకసేవ చేసిపారేద్దామని నేను మెడిసిన్‌లో చేరలేదని చెప్పడానికే యిదంతా చెప్పవలసివచ్చింది అంతకంతా కట్నం లాగుదామనీ, కట్టుకున్న కట్లపాములాంటి కాంతాస్వరూపం కళ్ళముందు కదలక మాననని కూచున్నా పై చదువుకు ఫారెన్ వెళ్ళడం, మెరుస్తున్న విమానం వీపుమీద స్వారీచేస్తూ మెరుపుల్నీ మబ్బుల్నీ దాటివెళ్ళి, మరోప్రపంచంలో దిగి, మెరుపుతీగల్ని స్పృశించి....కల షాక్‌కొట్టగా కళ్లు తెరవడం అందరితోపాటు నాకూ అలవాటే.'

'అబ్బాయికి మెడిసిన్‌లో సీటొచ్చిందిటగా !' మా అమ్మ పట్టలేని ఆనందం.

'నే చెప్పలేదటే వాడిది బ్రహ్మాండమైన జాతకమని!' నాన్న పొంగు.

'అన్నయ్యకి రాకపోతే మరెవరి కొస్తుందీ?' చెల్లెలి అంచనా

'వాడి పేరేమిటి వాడి ఊరేమిటి?' అక్కయ్య ఉత్తరం ఆరోజు చూడాలి ఆకళ్ళల్లో ఆశాదీపాలు ఆకాశ హర్మ్యాలు!

మా అమ్మకి ఆమె పుట్టింటివారిచ్చిన నగలు చాలా ఉండేవి ప్రతీరోజూ దేవుడికి పూజ చేసేటప్పుడు పక్క నొక వెండిపళ్ళెం ఉంచి, వాటిలో నగలన్నీ పేర్చి, పసుపూ కుంకుమా పువ్వులూ వేసి కళ్ళ కద్దుకుని ఒకటీ ఒకటీ ఒంటినిండా పెట్టు కొనేది. మానాన్న ఆమధ్య స్నేహితుడికి అప్పిస్తానంటే ఎన్నాళ్ళు అడిగినా ఒక్క గాజుకూడా యివ్వలేదు మా అక్క పెళ్ళికి అయిన అప్పులు తీర్చలేక మానాన్న ఎంత యిబ్బందిపడినా అంత బంగారం ఉండికూడా మాటాడలేదు మెడిసిన్‌లో నాకు సీటు వస్తే వెంకట్రవణమూర్తికి నిలువుదోపిడీ యిస్తానని— అలాగే చేసిందంటే నామీద ఎంతాశ పెట్టుకుందో మీకు అర్థమయే ఉంటుంది ఒక్క నిమిషమేనా మాటాడకుండా ఉండలేని మానాన్న రాత్రి ఎనిమిదీ అయేసరికల్లా తను మాటాడ్డం మాట అటుంచి, ఎవడు నోరెత్తినా తుపాకిని వేస్తానన్నాడంటే నా చదువుగురించి ఎంతశ్రద్ధ వహించేవాడో మీకు బోధపడేఉంటుంది ఎప్పుడూ లేంది మా చెల్లెలు కాసులమ్మ నా గదిలో సామాను ఎప్పటికప్పుడు సర్దిపెట్టేది నా ఫ్లాస్కునిండా చిక్కని కాఫీ పోసిఉంచేది ఇంతెందుకు, ఇంట్లో అందరూ నన్ను ఒక్కొక్కమెట్టు సింహాసనం ఎక్కుతూన్న రాజకుమారుడిలా చూసేవారు అయితే నన్ను ప్రత్యేక వ్యక్తిగా ఏమాత్రమూ గుర్తించడానికి యిష్టపడనివాడుకూడా ఒకడు మాయింట్లో ఉండేవాడు సుమండీ! వాడిపేరు వ్యాసమూర్తి ఆపేరు పలకలేక యింట్లో అందరం 'వాసూ' అని పిలిచేవాళ్ళం

వ్యాసమూర్తి మా అమ్మకి వరసకి చెల్లెలికొడుకుట వాడి ఆస్తి అంటూ ఏవో భూములు ఉన్నాయిగాని నా అనే వారు ఎవరూ లేక మా అమ్మే చిన్నప్పట్నుంచీ వాణ్ణి చేరదీసి మాతోపాటు పెంచింది నాకంటె నాలుగునెలలు చిన్న. పెద్దయాక మారిపోయాడు గాని చిన్నప్పుడు నాకంటే బాగా ఏపుగా, దుండులా, బూడిద గుమ్మడి పండులా ఉండేవాడు చిన్నప్పట్నుంచీ వాడివంతా అద్దోరకం వీధి గేటు అడ్డంగా గడియ వేసిఉంటే అది తీసుకుని వెళ్ళడం వాడికి బద్ధకంట— గేటు ఇటువైపు ఎక్కి అటువైపు దిగడం వాడికి ఎంతో సుళువుగా ఉంటుంది కాటోలు ముక్కుతో మాటాడ్డం, నోటితో గాలి పీల్చడం వాడికి సరదా పది పన్నెండేళ్ళ దాకా అన్నం గిన్నెలో పెట్టి, వాడికి జామచెట్టుమీదకి అందిచవలసిందే చిలకలు జామపళ్ళు కొరకడం చూస్తూ తనూ ఏ అప్పడమో కొరుకుతూ ఉంటే వాడికి




బ్రహ్మానందానుభవం అయిపోతుందనుకుంటాను 'మానవుని దంతముయొక్క మూడు ఉపయోగములు వ్రాయుము' అని సైన్సులో యిచ్చిన ప్రశ్నకు వాడు వ్రాసిన జవాబులు ఇవీ

1. తోచనప్పుడు చక్కంగా గోళ్ళు కొరుకుకొనుటకు
2. మనకు ఇష్టము లేనివారిని తనివితీర వెక్కిరించుటకు
3. కోపము వచ్చినప్పుడు పటపట కొరుకుటకు

ఇక క్లాసుల్లో మేష్టర్లనీ అమ్మాయిల్నీ ఏడిపించడంలో వాడు రీసెర్చిస్కాలరు. వాడి గురించి యింటికి ఫిర్యాదు రాని రోజంటూ ఉండేది కాదు మా నాన్న మా అమ్మమీద తారాజువ్వలా లేచేది వాటిగురించే.

'వీడి గురించి వీధిలో తలెత్తుకు తిరగలేకుండా ఉన్నాం ఈ తెచ్చిపెట్టుకున్న తద్దినం జన్మాంతం శనిలా ఉందే! ఇదెక్కడ నా కొంపకి తెచ్చిపెట్టేవ్!'

'చాల్లెండి. వాడు వింటే నొచ్చుకుంటాడు తల్లీ తండ్రీ లేనివాడు వాడికి మన బాబుగారి మూటలోంచి ఏం తెచ్చిపెట్టడంలేదు చిన్నప్పుడు పెంకితనం చేసిన వాళ్ళే పెద్దప్పుడు ఎంతో బుద్ధిగా తయారవడం ఎరుగుదుం. మన కడుపున పుట్టిన వాడే అల్లరి చేస్తే ఏం చేస్తాం? అడవిలో దిగబెట్టి రాలేంగదా!' నాన్న విసుక్కుంటూ వెళ్ళిపోగానే, అమ్మ పోపులపెట్టి తీసి చూస్తే, అందులో డబ్బుల్లేవు!

'చచ్చి ఎక్కడుందో-అది ఏడుస్తుందని ఊరుకున్నానుగాని, యిదే నా కడుపున పుట్టిన కొడుకైతే యీ పాటికి...'

మా చెల్లెల్ని 'మంకీ' అని పిలిచేవాడు నన్ను 'డాంకీ' అనేవాడు. నాన్న ఎన్ని సార్లు కొట్టినా వా అనదల్చుకొన్నదీ చెయ్యదల్చుకొన్నదీ మానేవాడుకాదు

'ఈ ఏబ్రాసి మొహానికి చదువేమిటి, సంధ్యేమిటి? వీడి పరీక్షకి ఫీజు కట్టేకన్న అచ్చ రూపాయిలకింద మార్పించి పదహారూ పెద్ద చెరువులో పారెయ్యడం మంచిది,' అనే వాడు నాన్న. కాని ఎస్సెస్సెల్సీ రిజల్ట్సు వచ్చిననాడు నా నెంబరుతో పాటు వాడి నెంబరూ పేపర్లో ఉండడం మాకు ఆశ్చర్యం కలిగించింది. అయితే అసలైన ఆశ్చర్యం ముందే ఉందని మా కప్పుడు తెలియలేదు. మా మార్కుల రిజిష్టర్లు వచ్చాయి. నేను బొటాబొటీ మార్కులతో ప్యాసయ్యాను. వాడిటోటల్ నాలు గొందల ఇరవై అయిదు! ఏం మాటాడ్డానికీ నా నోట మాట రాలేదు.

'ఎక్కడో కాపీ కొట్టిఉంటాడు వెధవ,' అన్నాడు మా నాన్న.

'ఎం తల్లరి చేస్తాడో అంత బ్రహ్మాండమైన తెలివితేటలు! ఏం బాబూ వాసూ! మంచిమార్కు లొచ్చాయని నీకు సంతోషంగా లేదట్రా?'

మా అమ్మ మాటకి అదోలా నవ్వేడు వాడు అప్పటి వాడి మొహం యిప్పుడు నా కళ్ళెదుట చూస్తున్నంత స్పష్టంగా నాకు గుర్తుంది అదృష్ట దురదృష్టాలకు అతీతంగా ఉన్నంత ప్రశాంతంగా ఉంది తల దువ్వుకోడు. ఇంత పౌడరు రాసుకోడు శుభ్రమైన బట్టలు వేసుకోడు అయితేనేం దొంగవెధవ బాగుంటాడు!'

## 2

అరోజు రాత్రే అనుకుంటాను వాడి మార్కులవిషయం మళ్ళీ నాన్నగారు కదిపేరు

'స్కూలికి సెకండు వచ్చావ్‌కదా! నీకు సరదాగా, గర్వంగా లేదుట్రా వాసూ?'

'నేను అనుకున్నవన్నీ పడ్డాయి ఆ వేళకి నాకు జ్ఞాపకం వచ్చాయి, రాశాను. అలా జరక్కపోతే మంచి మార్కులమాట దేవు డెరుగు, పరీక్ష ఫెయిలయి ఉందును పోనిద్దూ పెదనాన్నా. యివి ఓ పరీక్షలట, యివీ ఓ మార్కులట! ఎవరేనా నవ్వుతారు!'

నాన్న ఫెడేల్‌మని ఒక్క లెంపకాయ కొట్టేరు

'ఓరి వెధవా...ఇంతున్నావోలేవో ఏం తెలుసునని పెద్దపెద్ద కబుర్లు చెబుతున్నావ్? ఏకంగా పరీక్షవిధానాన్నే విమర్శిస్తున్నావే ... ముందుముందు ఎంత చదువుకోవాలి, ఎన్ని పరీక్షలకు వెళ్ళాలి...'

నాన్న ఊహించినది పొరపాటు. వాడు మళ్ళీ మళ్ళీ ఎక్కువపరీక్షలకు వెళ్ళలేదు. మళ్ళీ మరే పరీక్షా ప్యాసయిన పాపాన పోలేదు! ఇంటర్మీడియట్ రెండో క్లాసులో నేనయినా ప్యాసయానుగాని అయిదుసార్లు వెళ్ళినా వాడు అక్కడే ఉండిపోయాడు.

'అయినా చదువొకటే వాడి వ్యాపార మైతేగదా!' అనేవాడు నాన్న. నిజమే. పదిహేడు పద్దెనిమిది సంవత్సరాలు వచ్చినకొద్దీ వాడికి ఊరిధ్యాస ఎక్కువై పోయింది.

'ఏంరా బాబూ వాసూ! నీ కింక బాగుపడేయోగం లేదా ఏమిట్రా? నాలుగు రోజుల్లో పరీక్ష లున్నాయి. రాత్రనగా వెళ్ళిపోయావు, ఇప్పుడా రావడం? నీ కెప్పు డొస్తుందిరా బుద్ధి? నీవల్ల నే నింట్లో నిలబడలేకుండాఉన్నాన్రా బాబూ!' అని ఓనాడు మా అమ్మ గోలపెడితే వాడి జవా బేమిటో తెలుసా?

'న న్నేం చెయ్యమంటావ్ పెద్దమ్మా! సూరమ్మపిన్ని రెండోకూతురికి రాత్రి నొప్పులొచ్చాయి. సమయానికి యింట్లో మొగా ళ్లెవరూ లేరు. నే నలా వెడుతూంటే నన్నుపిలిచి లేడీడాక్టర్ని తీసుకురమ్మంది. తీరా వెడితే ఆవిడ ఊళ్ళోలేదు. మరొక డాక్టరు ఎక్కడో నాలుగుమైళ్ళ దూరాన ఉంటోంది. అద్దెసైకిలు తీసుకుని అవిణ్ణి తీసుకువచ్చేసరికి చాలా రాత్రయిపోయింది. సమయానికి ఆవిడ రాబట్టిగాని సీతక్క ప్రాణం పోయిఉండును. అంత కష్టమైపోయింది. వెంటనే నేనే టాక్సీ తీసుకు రావలసివచ్చింది సీతక్కని టాక్సీమీద పెద్దాసుపత్రికి తీసుకెళ్ళేం.'

'పోనీ హాస్పిటల్లో చేర్పించి వెంటనే వచ్చెయ్యకపోయావా?'

'సీతక్కని ఆపరేషన్ ధియేటరులోకి తీసికెళ్ళేరు. ఎంత గోలపెట్టినా సూరమ్మ పిన్నిని లోపలికి రానిచ్చారుకాదు. ఒక్కర్తే బైట బెంచీమీద ఏడుస్తూ కూచుంది. 'నీ ఉపకారం మరిచిపోన్రా వ్యాసం!' చాలా రాత్రయిపోయింది. మీవాళ్ళు దెబ్బ లాడుతారు. ఇక వెళ్ళిపో అమ్మా!' అంది సూరమ్మపిన్ని. పైకి అలా అందిగాని ఆవేళప్పుడు ఆమొహం న న్నెంతగా సహాయం కోరుతోందో నేను మరచిపోలేను పెద్దమ్మా! అంతరాత్రివేళ ఆవి ణ్ణలా విడిచిరాను. నువ్వే చెప్పు. ఆవిడ కేం లేదా, పోదా? మొగుడేమో క్యాంపుకు వెళ్ళేడు. కొడుకులిద్దరూ శలవలకి మేనత్త గారి ఊరు వెళ్ళేరు. అప్పటిదాకా ఉన్న అల్లుడూ, అతని స్నేహితుడూ అప్పుడే మెయిలుకి వెళ్ళిపోయారు—— ఆ కాస్సేపే నేను ఆమెకి ఎవరినయినా అయితే, కేవలం సూరమ్మపిన్నికోసమే నేను ఉండలేదనిపిస్తోంది, ఇప్పు డాలోచిస్తూంటే. స్ట్రెచర్ మీద పడుకుని చావుబతుకులమధ్య కొట్టుకుంటున్న సీతక్క ఆపరేషన్ గదిలోకి వెళ్ళింది. దాని కేమయిందో తెలుసుకోందే నేనుమాత్రం అక్కణ్ణుంచి కదలగలనా పెద్దమ్మా?'

అయిదు నిమిషాలు ఆగి మళ్ళీ వాడే అన్నాడు: 'అయితేనేం. సూరమ్మపిన్ని అదృష్టవంతురాలే సుమీ పెద్దమ్మా...సీతక్కకి ఆపరేషను చేశారు. తల్లీ పిల్లడూ కులాసాగానే ఉన్నార్ట - నేను పిల్లాణ్ణి చూశాను. ఎంతున్నాడనుకున్నావ్? పడవలా ఉన్నాడు దొంగభడవ...ఊచిపుచ్చుకుని ఒక్క లెంపకాయ యిచ్చుకోవా లనిపించిందనుకో ..'

అమ్మ యివేవీ వినడంలేదు వ్యాసమూర్తిని కన్నతల్లి చచ్చినతరవాత నరకానికి వెళ్ళిందో స్వర్గానికివెళ్ళిందో ఇదివరకు ఆమెకి అనుమానంగా ఉండేది అందుకనే 'చచ్చి ఎక్కడుంవో ..' అంటూండేది యిదివరకు. ఈసారిమాత్రం 'ఇలాంటి వాణ్ణి కని నీకడుపు పండిపోయిందే చెల్లీ ... ఈసారి నువ్వెక్కడుంటావో తెలిసిపోయిందే తల్లీ!' అనుకునిఉంటుంటుంది ఆమెకళ్ళల్లో నీళ్ళు నిండేయి.

'ఎందుకు పెద్దమ్మా ఏడుస్తున్నావ్ సీతక్కకి కులాసాగానే ఉందని చెప్తుంటే నీకు నమ్మకము లేదాయేం?'

అమ్మ జవాబు చెప్పే స్థితిలోలేదు వెంటనే వాడికి కడుపునిండా అన్నం పెట్టింది. నాలుగురోజుల్నించీ నాకోసం తీసిఉంచి ప్రత్యేకించి దాచిన పట్టెడువెన్నా వాడికి వేసేసింది. చెల్లెలికి యిష్టమనిఉంచిన గిన్నెడుమీగడా వాడికి ఒంపేసింది నాన్నకోసం అట్టిపెట్టిన కమ్మటి పెరుగంతా వాడికే పోసేసింది

అవాళ భోజనాలదగ్గిర మేం ముగ్గురం చాలా అల్లరిపెట్టేశాం. అమ్మ అంత అల్లరీ హాయిగా భరించింది 'వెర్రివెధవ, ఎలాబతుకుతాడో ఏమో!' అని కళ్ళనీళ్ళు పెట్టుకుంది, గంటయి గుర్రుపెడుతున్న మా వాసుగాణ్ణి తలుచుకుని!

ఆ మర్నాడు కాబోలు మా అమ్మ వాడితో అంది: 'ఏంరా బాబూ వాసూ! ఊరి సంగతేగాని యింటిసంగతి నీకేమీ పట్టినట్టులేదే! మీ పెదనాన్నలాంటి మనిషిని పెట్టుకుని మీ అక్కపెళ్ళి ఎలా చేశానో ఆ భగవంతుడి కెరుక. ఇక ఈ కాసులు పెళ్ళికూడా అయిపోతే నాకు నిశ్చింత. ఆయనకి ఎలాగా చీమకుట్టినట్టయినాలేదు. ఎదిగిన చెల్లెలు యింట్లో ఉంటే అన్నీ తెలిసినవాడివీ, అందరికీ సహాయం చేస్తున్నవాడివీ నువ్వే ఊరుకుంటే ఎలా?'

'చాలా పొరపాటు జరిగింది పెద్దమ్మా...ఏమిటో ఇది నేను ఆలోచించనేలేదు తప్పకుండా చూస్తాను. చెల్లమ్మని నాకు బాగా తెలుసు దానికి ఎలాంటి సంబంధం తీసుకురావాలోకూడా నాకు తెలుసు ఏమే మంకీ?' కాసులమ్మ గంయ్‌మంది

'వీడిబతుక్కి సంబంధాలు తీసుకురావడం ఒకటా? అమ్మా! నేను మళ్ళీ చెప్పలేదనుకునేవ్ - వీ డెవర్ని తెచ్చినా నేను చిక్కగా పేడనీళ్ళు కలిపిఉంచుతాను!'



'ఏమిటే కాసులూ! మరీ నోటికి ఏదొస్తే అదీ?'

'లేపోతే చూడు, నేను మంకీనట, మంకీ!'

'అంతో యింతో మనమందరం మంకీలమేనే సుందరాంగీ! నాలాంటివాడికి గుణాలలో కోతిపోలిక; నీలాంటిదానికి చక్కని ఆ కనుముక్కు తీరులో వానరం వాలకం.'

కాసులు వాసుని నిజంగా కోతిలా వెక్కిరించింది.

అన్నట్టే రెణ్నెల్లు దాటకుండా మా వ్యాసమూర్తి ఎవడో పెళ్ళికొడుకుని బుక్ చేసి ముందుగదిలో కూచోబెట్టి లోపలి కెళ్ళేడు.

'పెద్దమ్మా పెద్దమ్మా! అల్లు డొచ్చాడు. వెల్లవేస్తున్నదాన్లా నువ్వింకా ఇలాగే ఉన్నావేమిటి? పట్టుచీర కట్టుకుని ఏడువారాల నగలూ బిగించు _ అన్నట్టు కాసు లేదీ?'

కాసులు ఆ వేళకి తలుపుకన్నంలోంచి కాబోయే భాగస్వామిని తిలకిస్తోంది.

ఆమె కతడు చూడగానే నచ్చేశాడు తెల్లగా పొడుగ్గా ఉన్నాడు. ముఖ్యంగా షోగ్గా కనిపిస్తున్నాడు. టెర్లివ్‌సూటు వేశాడు. 'చేతికి వాచీ, కళ్ళకి గాగిల్సు. ఇంతకన్న కోరతగిం దేముంది!' అనుకుంది. తెలుగు సినిమాలు తెగచూసే కాసులికి మరు క్షణం తనూ అతనూ బృందావనగార్డెన్సులో డ్యూయెట్సు పాడుతున్నట్టు అని పించింది. ఇంతట్లో వాసొచ్చి చెవికి కీ యిచ్చి, చక్కనికల చెరిపేశాడు

'ఏమే. సి. హెచ్. నాతిలా మొహం నువ్వూ – యిక్క దేం చేస్తున్నట్టూ? వెంటనే వెళ్ళి పగటివేషం ప్రారంభించు '

ఈలోగా అమ్మ వాసుని పెరట్లోకి తీసికెళ్ళింది

'తలచుకున్నప్పుడే తాత పెళ్ళని – ఎప్పుడుపడితే అప్పుడు ఓ వారం వర్జ్యం చూసుకోకుండా పెళ్ళికొడుకుని తీసుకువచ్చెయ్యడమేనట్రా! మీ పెద్దనాన్నకూడా సమయానికి ఊళ్ళో లేరాయె ఇంతకీ అతని తాలూకు పెద్దవాళ్ళెవరూ రాకుండా ఏకనిరంజన్ అని యిత నొక్కడూ రాడ మేమిటి?'

'ఇత నొక్కడే కదుటమ్మా పెళ్ళి చేసుకునేదీ!'

'గొప్ప గొడవొచ్చిపడిందే నీతో ... పోనీ వాళ్ళ కుల మేమిటో గోత్ర మేమిటో...'

'అదంత ముఖ్యమని నాకు తోచలేదు, కనుక్కోలేదు. అంతే;' ఈసారి అమ్మ బుగ్గలు నొక్కుకుంది అమ్మని చూసి వాడు నెత్తి మొత్తుకున్నాడు.

'బియ్యే పాసయ్యాడు '

'ఇంతా చేసి బియ్యేయేనా, ఛీ ఛీ,' అనుకుంది కాసులు

'నెలకి నూటయాభై తెస్తాడు.'

'అఘోరించినట్టే ఉంది,' అనుకునిఉంటుంది కాసులు.

'కానీ కట్నం పుచ్చుకోని మనిషి.'

'కట్నం పుచ్చుకోని మనిషి, అదేం మనిషి!' అంది అమ్మ – పైగా ఇలా అంది: 'బాబూ మరోలా అనుకోకు. మీ పెదనాన్నగారు వచ్చాక నెమ్మదిమీద కబురంపు దాంలే, మెల్లిగా వచ్చినవాణ్ణి వచ్చినట్టే సాగనంపు.'

'ఛ! ఏం మనుషులు!' అనుకుంటూ వాసు యివతలి కొచ్చేశాడు.

'ఈసారి చిక్కని పేడనీళ్ళతోపాటు, చక్కని సున్నపునీళ్ళూకూడా వేరే ఉంచుతానే అమ్మా!' అంది కాసులు.

'ఎందుకూ?' అన్నట్టు చూసింది అమ్మ.

'మొదటిది పెళ్ళికొడుక్కి, రెండోది తీసుకొచ్చిన పెద్దమనిషికి.'

ఇద్దరూ నవ్వుకున్నారు.

* * * *

పట్టుకోవలసిన పెద్దతలల్ని పట్టుకుని మానాన్న ఎలాగైతేనేం నాకు ఎం. బీ. లో సీటు సంపాదించాడు. నేను ఒక్కొక్క ఏడూ ప్యాసవుతూంటే మా యింట్లోవాళ్ళు నా అడుగులకి ఎలా మడుగులొత్తేవారో మొదట్లోనే చెప్పేను. నాకు జరిగే ఆదరణతోపాటు వాసుకి నిరాదరణకూడా ఎక్కువైపోయిందని వేరే చెప్పనక్కర్లేదనుకుంటాను. ఒకసారైనా యింట్లో ఎవరోఒకరు వాడ్ని ఇస్పల్టు చేస్తేగాని-మాకు రోజు వెళ్ళేదికాదు. వాడు సాధారణంగా జవాబు చెప్పేవాడుకాదు. జవాబు చెప్పాడా యిక దులిపి దుళ్ళకొట్టేసేవాడు. అలాంటి పరిస్థితిలో నాన్న వాణ్ణి ఎక్కడ వెళ్ళగొడతారో అని నాగుండె పీచుపీచు మనేది. వాడు చదువు ఏకంగా మానేసి ఊరిమీదపడి వేళా పాళా లేకుండా తిరగడంతో మా అమ్మకూడా అస్తమానూ వాణ్ణి ఏదోఒకటి సాధించడం ప్రారంభించింది. వా డింట్లోంచి వెళ్ళిపోతే వాడికన్న ఎక్కువ నష్టపోయేది మేమే. పంటకాలువ ఒడ్డున పదిహేను ఎకరాల పొలం వాడిపేరఉంది. మేం ఏటా సరిపడే ధాన్యం అక్కణ్ణుంచి తెచ్చుకోడమేకాక మిగిలినవి అమ్ముకుంటున్నాంకూడా. నా చదువుకి ఎక్కళ్ళేని సొమ్మూ చాలడం లేదు. పోతే పీడిఆస్తీ మాకు దక్కదు. అందుకని వాడి అల్లరికూడా చచ్చినట్టు భరించేవాళ్ళం. అదిగాక వాడికి బుద్ధి పుట్టాలేగాని అందర్నీ అలా కూచోబెట్టి ఎంత పనైనా చేసేవాడు.

నేను ఎం. బీ. లో చేరేక మానాన్న తన స్నేహితులదగ్గిర నన్ను ఉదహరించేటప్పుడు 'వాడు' అనడం మానేసి 'అతను' అని గౌరవిస్తున్నారు. మా అమ్మకూడా మాపెద్దాడు అనడం మానేసి 'మా అబ్బాయి విజయకుమార్' అనడం అలవాటుచేసుకుంది. ఇక మాకాసులు 'డాక్టరన్నయ్యా' అని తప్ప మరోలా నన్ను పిలవదు. ఇక మా వ్యాసమూర్తి మాత్రం అతి కష్టంమీద నన్ను డాంకీ అనడం మానేస్తానని మాట యిచ్చేడు 'ఒరే అనిమాత్రం పిలవకమానను; నీ దిక్కున్నచోట చెప్పుకో,' అన్నాడు.

ఒకసారి మావూళ్ళోనే మా దూరపుబంధువులు ఒకరింట్లో పెళ్ళి జరిగింది. వారేమో ఆడపెళ్ళివారు. ఎక్కువ డబ్బున్నవాళ్ళు కాకపోవడంచేతా, ఉన్న కాస్త ఆస్తీ కట్నంకింద జమకట్టెయ్యడంవల్లా పెళ్ళిపనులకని పనిమనుషుల్ని పురమాయించే స్తోమతలేక యింట్లోఉన్న లెక్కమనుషులే తలోపనీ పైన వేసుకున్నారు.

ఈ రాత్రి పెళ్ళనగా ఈ మధ్యాహ్నందాకా పెళ్ళికూతురుకూడా ఒళ్ళు వంచి పని చేస్తూనేఉంది. పెళ్ళికూతురు చిన్నన్నయ్య నా క్లాసుమేటు. మమ్మల్ని పిలవడానికి ప్రత్యేకించి వచ్చాడు.

'తెల్లారి లేస్తే ఎనాటమీ థీరీపేపరు ఉందిరా, రాలేనేమో !' అన్నాను నేను.

'నన్ను పిలవడానికి రావాలిట్రా క్రేక్‌మాస్టర్‌జనరల్! అయినా నేను రాకపోతే సోముడు పెళ్ళి ఎలా జరుగుతుందట! పద, ఇప్పుడే నేను నీతో వచ్చేస్తున్నాను,' అని వెంటనే మా వ్యాసమూర్తి వాడితో వెళ్ళిపోయాడు.

నిజానికి ఈ పెళ్ళిళ్ళకీ వాటికీ వెళ్ళడం నా కాట్టే యిష్టం ఉండదు. ఏమిటో చెప్పలేని మొహమాటం. అందర్లో అలైట్లలో అన్ని అడచూపులకి తట్టుకోలేక పోడం ఒక బలహీనత అయితే అవుగాక, ఏదో ఓ వంకపెట్టి నా గదిలోనే కూచుని సన్నగా రేడియో పెట్టుకుని వినాలని ఉంటుంది.

'అన్నట్టు యీ పెళ్ళికి గీతావాళ్ళూ వస్తారుకదుటే అమ్మా !'

మా చెల్లి మాటలు విని నేను ఉలిక్కిపడ్డాను. గీతావాళ్ళమ్మ సుందరమ్మగారు మా నాన్నగారికి దూరపుచుట్టం. వాళ్ళనాన్న కేశవరావుగారు అనకాపల్లిలో ఆకాశాని కంటే చెరుకుతోటలు వేయించి, మధుర జలధరాలు స్పష్టించి కనకవర్షం కురిపించిన సమర్థుడు. ఎప్పుడో ఆరేడేళ్ళక్రితం వాళ్ళ కొత్తమేడలో గృహప్రవేశానికని పిలిస్తే అమ్మా నేనూ చెల్లీ వెళ్ళేం. కొత్తయిల్లు ఎంత బాగుందని! వాళ్ళు నలుగురే అయినా పదిమందికి సరిపడే విశాల భవనం. పెద్దపెద్ద గదులూ, ప్రతీ గదిలో కొళాయిలూ, మెత్తని సోఫాలూ, స్ప్రింగు మంచాలూ...చక్కగా అలంకరించబడిన ఆ హాల్లో తూగుటుయ్యాల్లో కూచుంటే ఇం కెక్కడికీ వెళ్ళాలనుండదు. పొరపాటు – ఆ యింటిముందున్న పెద్ద పువ్వులతోటా, అందులో ఉన్న దోసెడేసి రంగురంగుల డాలియాపువ్వులూ చూస్తూ అక్కడున్న సిమెంటు బెంచీమీద కూచుంటే ఇం కెక్కడికీ వెళ్ళాలనుండదు. ఇదీ పొరపాటే – ఒప్పుగా ముద్దుగా చక్కగా వాళ్ళమ్మపక్క కూచుని ఉన్న పది పదకొండేళ్ళ గీత ఎదురుగా ఎక్కడ కూచున్నా సరే, ఇం కెక్కడికీ వెళ్ళాలనుండదు. ఆ ఆకారం నా కళ్ళముందునుంచి కదలదు.

'అమ్మా! గీత ఎంతయిందో ఎలా ఉందో చూడలనుందే.'

ఈ ప్రశ్న మా చెల్లి మా అమ్మని అడుగుతున్నదికాదు. నా మనసు నన్ను అడుగుతున్నది. నాకు జవాబు కావాలి. ఇప్పుడా అమ్మాయికి పదిహేడేళ్ళు ఉండొచ్చు. ఎలా ఉందో ! ఎలా ఉందో ?




అమ్మ నాన్నతో అంటోంది. 'ఏమండోయ్, మీకు చెప్పేనో లేదో — ఆవాళ అనకాపల్లి వెళ్ళిననాడు నేను మీ సుందరాన్ని కదిపిచూశాను, 'ఏవమ్మోయ్ వదినా, మళ్ళీ ఎవరికేనా మాట యిచ్చేరుగనక...మీ గీతకీ మా విజయకీ సరిగ్గా ఈడూ జోడూ కుదురుతుంది. పై సంబంధాలు వెతకమాకండి.' ఆవిడ జవాబు జ్ఞాపకముందా ?'

'ఏదో చెప్పేవ్, నే నంతగా పట్టించుకోలేదు. ఏవందేం ?'

'అబ్బో ఆవిడగారి కెంతటెక్కు! గావీణ్ణం పురుషుళ్ళు దిగి కారుతోంది! 'ఇంతింత పిల్లలు, ఇప్పట్నుంచీ పెళ్ళిమాట లేమిటి వదినా–ఎవరేనా నవ్వాగల్రూ' అని కొట్టిపారేసింది. సర్లెండి, పడినగోడలు పడినట్టే ఉండవుకదా! ఈనాడు నా కొడుకు డాక్టర్ వెలిగిస్తున్నాడు. నా కాళ్ళదగ్గిర కొస్తుందో రాదో నేనూ చూస్తాను. అక్కడికి ప్రపంచంలో వాళ్ళే భాగ్యవంతులు కాబోలు...అయినా నేను పిల్లాణ్ణి తీసుకుని పెళ్ళి కెడితే ముందే లోకువై పోయినట్టు ఉంటుందేమో! ఏమండీ, ఏవంటారు ?'

మా కాసులు ఊరుకోలేదు. 'అదేం మాటే అమ్మా! వాళ్ళు ఏ కారుమీదో వచ్చి ముహూర్తం చూసి వెంటనే వెళ్ళిపోతేనో ?'

'బాగుంది. అలా చెయ్యడానికి ఎన్ని వేల గుండె లుండాలేం ?' అంది అమ్మ ధీమాగా, ఆమె ధీమాను ఏమంత కొట్టిపారెయ్యవలసిందిగా నాకు తోచలేదు. పెళ్ళి కెదిగిన పిల్ల యింట్లో ఉందాయె. శుభ్రమైన పెళ్ళికొడుకు, మంచి చదువులో ఉన్నవాడు నిజానికి ఎవరింటికి ఎవరు వెళ్ళాలి చెప్పండి!'

నాన్న అన్నాడు: 'మొగపెళ్ళివారికి ఈ సుందరమ్మగారే బాగా దగ్గిరట. యిలా వచ్చి అలా వెళ్ళిపోతే వాళ్ళు ఒప్పుకోరు; కనీసం నాలుగైదు రోజులు ఉంటారనుకుంటాను అయినా మనమటుకు మనం ఎవరింట్లోనో పెళ్ళికి వెళ్ళడం మన పరువు తక్కువ అనుకోడం తెలివితక్కువ.'

'సరే అయితే ... అందరం వెడదాం. విజయకుమార్ని మాత్రం తీసికెళ్ళొద్దు అంది అమ్మ నా గుండె గతుక్కుమంది – ఏమి నా దౌర్భాగ్యం!

'ఏం అతని కేం లోపముందని యింట్లో తొక్కిపెడతాం! అందరం వెడదాం మరేం మించిపోయింది లేదు. నువ్వూ రడీకావోయ్.' అన్నాడు నాన్న

'అబ్బా. నే న్రాలేను; మీరు వెళ్ళండి. నాకు మొహమాటంగా ఉంటుంది.' అ సిన నా నాలికని వెంటనే అక్కడికి కోసేద్దామా అనిపించింది!

'అయితే సరే ... ముందు మేం స్టడీచేసివస్తాం ... యిల్లు కనిపెట్టుకుఉండు. చూస్తూండగా అన్నితాళాలూ వేసేసి, వీధిగదితాళాలు నాకిచ్చి అందరూ పెళ్ళికి వెళ్ళిపోయారు అంత ఒంటరితనమూ, అంతటి ఆశాభంగమూ నేను జీవితంలో ఎప్పుడూ ఎరగను అరగంటపైగా నే నెంత బాగా కనపడగలనో అంతగా అలంకరించుకుని ఆ గదికికూడా తాళం వేసేసి పెళ్ళివారింటికి బయలుదేరాను.

అసలే మొహమాటస్థుణ్ణవడంచేతా, అందరితోటి బయలుదేరకపోవడంచేతా ఏదో తప్పుచేసినవాడిలా వెనకగుమ్మంలోంచి లోపల జొరబడవలసివచ్చింది. పెరటివైపునకూడా భోజనాలకోసం కాబోలు పెద్దపందిరి వేయించారు. అది సరిగ్గా ముహూర్తంవేళ అవడంచేత చాలామంది వీధివైపునే ఉన్నట్టున్నారు నేనలా లోపలికి వచ్చి వరండామీంచి నడిచి పెరటివైపుగది కిటికిలోంచి లోపలికి చూశాను. నా అదృష్టం ఏంచెప్పను! పెళ్ళివారింట్లో నాకు మొట్టమొదట కనిపించింది గీత!

మనిషికీ మనిషికీ మనస్తత్వంలో తేడా ఉంటుంది దీన్నిబట్టే మనోదృక్పథమూ, పరిశీలనాజ్ఞానమూ ఉంటాయి. కాని నేర్చుకునే విద్యరీత్యా స్టూడెంట్సుకి భౌతికమైన పరిశీలనవిషయంలో మిగిలిన విద్యార్థుల కున్న సుతారపుపొరలూ, సున్నితమైన తెరలూ ఉండవు ఇవేకాక ఎంత మొహమాటస్థుడికయినా సాటి లేడీస్టూడెంట్సుతో, ఆసుపత్రులలోని నర్సులతో, డాక్టరమ్మలతో, పగలూ రాత్రీ అనకుండా కలసి పని చెయ్యడంవల్ల పరిచయాలకూ పరిశీలనలకూ అవకాశం ఎక్కువ మా ఇంట్లో నేను చూసే మా అమ్మావాళ్ళూ అదోలోకం. సహవిద్యరీత్యా నేను కలుసుకునే సోదరీమణులతీరు అదోలోకం. కాని వీటన్నిటినీమించిందీ, వందపువ్వుల్లో ఉన్నా ముందు నాదృష్టిని ఆకర్షించేదీ గీతమాత్రమే! పదిహేడేళ్ళ గీతకు నే నెంత చక్కని



రూపకల్పన యివ్వగలనో అంత అందంగానూ తయారయింది గీత. శరీరంతో పాటు ఆమె వేషధారణలోని నాజూకుతనం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. ఆ పందిరీ, ఆ మంత్రాలూ, ఆ సన్నాయివాయిద్యమూ నా మనసుని ఆ క్షణాన్న పెళ్ళికొడుకును చేసి కూచొపెట్టింది

ఎవరో గదిలోకి పెద్దగా జోళ్ళచప్పుడు చేసుకుంటూ వచ్చారు. దాన్తో నేను ఈ లోకంలోకి వచ్చాను. గీత కొంచెం పక్కగా తిరిగిఉంది – ఎవరినో విసనకర్రతో విసురుతోంది. ఆ దెవరికా అని కళ్ళెత్తిచూశాను. అక్కడ ఉన్నది మా వ్యాసమూర్తి!

## 3

గదిలో యింకా ఒకరిద్దరు ముసలమ్మలుకూడా ఉన్నారు. గదిలోకి చప్పుడు చేసుకుంటూ వచ్చింది డాక్టరు. ఆయన్ని తీసుకొచ్చింది గీతనాన్న కేశవరావుగారు!

'వీళ్ళింటికి కబురుచేశాం గీతా! ఎవరూ లేరట; యిల్లు తాళం వేసిఉందిట యిదిగో డాక్టరుగార్ని తీసుకొచ్చాను.'

డాక్టరు మా వాసుని పరీక్షచేసి 'ఇతనితలకి యీ మంచుముక్కని పెట్టి కాస్తున్న దెవరూ?' అన్నారు ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేసి.

'నేనేనండీ, ఏమీ?' అంది గీత.

'ఇలా చెయ్యాలని నీ కెవరు చెప్పారమ్మా?' అన్నాడు మళ్ళీ...

"చెప్పడాని కేముందండీ...మంచి ఎండవేళ...ఎండ నిప్పులు చెరుగుతోంది. వద్దు వద్దంటూంటే ఈయన నలా బిందెలకొద్దీ నూతిలోనీళ్ళు తోడిపోసేస్తున్నారు. ఒక్కసారి ఉన్నట్టుండి పడిపోయారు, మొహం తిరిగినట్టు. గదిలోకి తీసుకొచ్చి పడుకోబెట్టేరు. అదృష్టవశాత్తూ నేనక్కడ ఉన్నాను. అప్పటికప్పుడు ఆయనకి ఒళ్ళు కాలిపోయేంత జ్వరం వచ్చేసింది. వడదెబ్బ తగిలితే మంచు పెడతారని ఎవరో అంటూంటే విన్నాను. కాని రాత్రికి పెళ్ళి...ఎవరి హడావిడిలో వాళ్ళున్నారు. తమ్ముణ్ణి పంపించి అయిసు తెప్పించాను. ఏం, ఇప్పు డెలా ఉందంటారు?' అంది గీత.

'తెలిసిచేస్తేనేం తెలియకచేస్తేనేం–సమయానికి తగిన ప్రథమచికిత్స చేసి అతన్ని రక్షించావమ్మా..ఇలాంటి వడదెబ్బకి అప్పటికప్పుడు ప్రాణం పోయినవాళ్ళున్నారు;' డాక్టరుగారు వాసుకి ఏదో యింజక్షను యిచ్చారు. ఏవో రెండుపొట్లాలుకూడా ఇచ్చినట్టున్నారు.

'టెంపరేచరు తగ్గిపోతుంది. మరేం గాభరాపడకండి. బాగా అలసిపోయినట్టున్నాడు. విశ్రాంతి తీసుకోనియ్యండి. ఎవరూ డిస్టర్బ్ చెయ్యొద్దు. జ్వరం ఒకవేళ ఎక్కువగానిఅయితే మళ్ళీ ఐసుపెట్టండి;' మరోమారు గీతను ప్రశ్నించి డాక్టరుగారు వెళ్ళిపోయారు. ఇక ఆగలేక నేను లోపలికివెళ్ళి కేశవరావుగార్ని విష్‌చేశాను.

'నువ్వేటోయ్ విజయా ... ఎవరో అనుకున్నాను. మాయింటికి వచ్చినపుడు పొట్టిగా పీలగా ఉండేవాడివి. ఎంతలో ఎంత ఎదిగేవ్! మెడిసన్ ఫోర్తియరుటగా యిప్పుడూ? బాగుందోయ్...వెరీగ్లాడ్ టు మీట్ యూ...అమ్మా గీతా! మన నారాయణగారిఅబ్బాయి విజయకుమారే!'

'నమస్కారం,' అంది గీత లేచి, రెండుచేతులూ జోడించి.

'నమస్కారం,' అన్నాను నేను ఆమెను నఖశిఖపర్యంతం పరిశీలిస్తూ.

'ఎవనికైనా ఏదైనా సహాయం చేస్తూంటే యిక మా వాసుకి ఒళ్ళూ పయీ తెలీదు...సమయానికి మీరు ఆదుకోబట్టిగాని ..' అన్నాను ఏదో ఒకటి అనాలని

ఆమె మాటడలేదు. మళ్ళీ అన్నాను. 'ఇంతకి మా వ్యాసమూర్తికి ఏమయిం దండీ ?'

ఈ ప్రశ్నకి అక్కడ పడుకున్న ఒక అవ్వగారు లేచికూచుంది. ''ఎవరుబాబూ ఆ అడుగుతున్నదీ- వాసు అన్నయ్యా ? మనిషిటయ్యా బాబూ మీ తమ్ముడు- మణి పూసగాని ? ఒళ్ళొంచి చాకిరీ చేసే మా పూర్వోత్తరంవాళ్ళంకూడా అతనిముందు పనికిరాకపోయాం కదుటయ్యా! మూడురోజులకింద కాబోలు వచ్చాడు. ఒక్క నిముషమైనా నడుం వాలిస్తేనా- గాడిపొయ్యి తవ్వడం దగ్గర్నుంచీ పందిరిలైట్లు బిగించేవరకు, వడ్డనమొదలు రాత్రి పక్కలు వేసేవరకు, ఎక్కడ చూసినా ఇతనే కదటయ్యా! ఎవరి కేం కావలసినా అడగవలసింది ఇతన్నే కదటయ్యా! అసలు యితనే లేకపోతే సోముడు పెళ్ళి ఇంత ఘనంగా జరిగిఉండునా అని...!''

ఇంకా అవ్వగారు ఏమిటేమిటో అంటూనే ఉంది; బిలబిలమంటూ ఆ గదిలోకి ఓ ఆయిదారుగురు ఆడవాళ్ళు చక్కావచ్చారు. నేను పక్కకి తప్పుకున్నాను; అవ్వ ముడుచుకు పడుకుంది.

'ఏడీ, ఎక్కడా మా వాసుబాబూ ? వీడితో ఇదేచిక్కు...ఇలాగే పీకలమీదికి తెచ్చుకుంటూ ఉంటాడు,' అంటూ అమ్మ వాడిదగ్గిర కొచ్చి ఒంటిమీద చెయ్యివేసి చూసింది.

'అయ్యో! ఎలా కాలిపోతోందో...ఇంత హడావిడిలో వీడి కిక్క డేం జరుగు తుంది ? ఏమండీ, ఎక్కడా...వెంటనే రిక్షా పిలిపించండి...వెళ్ళిపోదాం.'

'నిజంగా వాసు మా కెంతచాకిరీ చేశాడనుకున్నావ్ సుభద్రమ్మపిన్నీ...వాడి రుణం తీర్చుకోలేం అనుకో...తీరా పాపం పుస్తిముడుపు వేళకి ఒళ్ళెరక్కుండా పడిపోయాడు ... వాడి కిలా వచ్చినప్పుడే ఎవరం ఏమీ చెయ్యలేకపోయాం ... మమ్మల్ని మన్నించు పిన్నీ !'

'అయ్యో ఎంతమాట ... మీ రేం చేస్తారు రాధమ్మా ! .. వాడికి యిలాంటివి మామూలే...ఇవా ళ్ళొస్తుంది...రేపు పోతుంది...ఎవరూ అక్కడ కూచున్నది ? నువ్వు గీతవి కదుటే అమ్మాయీ ?'

'నమస్కారం అత్తా.'

'పోన్లే...యిప్పటికేనా మేం నీ కంటికి కనిపించడం సంతోషించతగ్గవిషయ మేనే కోడలా ... పెళ్ళిపందిట్లోకి రాకుండా ఒక్కత్తివీ నువ్విక్కడ ఏం చేస్తున్నట్టూ.'

'దాన్దంతా అదో చిత్రమైనపద్ధతి వదినా,' అంటూ గీత తల్లి సుందరమ్మగారు వెనకనించి జవాబు చెప్పింది. అవ్వగారు మళ్ళా లేచికూచుని విజృంభించింది.

'ఏమిటట్రా? ఏమిటి? మీ కిందులో ఏమిచిత్రం కనిపించిందో నాకు చెప్పండి చూస్తాను. పెద్దకాలపు ముండని నన్నోముక్క ఎవరైనా అన్నా, కాటికి కాళ్ల జాపుకున్న నా కేం పూసురాదు. అందుకని మనసులో ఉన్నది అనేస్తున్నాను. ఆ పిల్లాడు ఈ పెళ్ళివారు — రెండుతరపులవారికీ ఏమంత దగ్గిరబంధువుకాదు. అయినా చచ్చీచాకరి చేశాడు ఒళ్ళు తెలియకుండా పడిపోయాడు. మీ రందరూ ఏం చేశారు? ఎవరో ముఖ్యమైనవారు వెళ్ళి ఆ పెళ్ళితంతులో పాల్గొనవచ్చు: ఎవరూ కాదన్రు. కాని కేవలం చూడ్డాని కొచ్చిన యింతమంది ఆడా మొగా ఉన్నారు. ఒక్కళ్ళు వచ్చి 'అయ్యో పాపం ఎలా ఉం' దనైనా కనుక్కున్న పాపాన పోయారూ? ఎక్కడో ముక్కూ మొఖం ఎరగని యీ అమ్మాయికి కావలసి వచ్చింది. నే నీ గదిలో ఉండి చూస్తున్నాను— ఆ పిల్ల మనసు ఎలా కొట్టుకు పోయిందో...తలమీద తడిగుడ్డలు వేసింది. విసురుతూ కూచుంది. మంచు ముక్కలు తెప్పించి పెట్టింది. డాక్టర్ని పిలిపించింది. మా కాలంలో ఆమాత్రం యీమాత్రం తెలిసినవాళ్ళకి ఎవరి కేమొచ్చినా యిలాగే చేతనైన సహాయం చేసేవాళ్ళం. ఈ పిదపకాలంలోకూడా యిలాంటి మంచి మనసున్నవా ళ్లున్నారంటే ఎంతో సరదా వేసింది. అలాంటిది యిది మీకు చిత్రమనిపించిందా? మతిలేకపోతే సరి!'

అవ్వగారు మళ్ళీ ముడుచుకు పడుకుంది. అమ్మ కృతజ్ఞతాపూర్వకంగా గీత వైపు చూసి ఏదో అనబోయింది. ఇంతలో మా కాసులు:

'ఎప్పు డొచ్చాడో! యిదిగో, డాక్టరన్నయ్యకూడా యిక్కడే ఉన్నాడే అమ్మ!' అంది. అప్పటివరకూ ఎవరూ గుర్తించలేదని పక్కనున్న బీరువా చాటున నిల బడి సిగ్గుతో దహించుకుపోతున్న నేను మనసులో చెల్లికి ధన్యవాదాలు చెప్పు కున్నాను. కాని అందరూ నా వైపు చూసేసరికి అదోలా అనిపించి మెడ పక్కకి వాల్చేశాను.

'అబ్బాయిని యింట్లో ఉంచివచ్చానని చెప్పేవ్ కాదుటమ్మా వదినా! మొత్తానికి చమత్కారివే,' అని సుందరమ్మత్త నా వైపు తిరిగి నన్ను ఎగాదిగా నవ్వుతూ చూసి, 'ఎక్కడైనా సంబంధంగాని జతపడిందా ఏమిటయ్యా! అలా ఊ( పెళ్ళి కొడుకులా సిగ్గుపడిపోతున్నావూ?' అంది. అందరూ నవ్వేరు.




'నీకు తెలీని సంబంధం మేమెలా స్థిరపరుచుకుంటాం వదినా?' అంది గుంభనగా అమ్మ. సుందరమ్మత్త జవాబు చెప్పేలోగానే రిక్షాలు వచ్చేశాయి.

'వెళ్ళేముందు సుందరమ్మవదిన్ని మా యింట్లో ఓ రోజు ఉంచి మరీ పంపాలి సుమా రాధమ్మా! ఇక్కణ్నుంచి యిలాగే దాటించేశేవ్ గనక,' అంది అమ్మ. అందరం వీధిలోకి వచ్చేశాం. వాసుని నేనూ నాన్నా పట్టుకుని నెమ్మదిగా నడిపించుకుని రిక్షా ఎక్కించాం. వాడి పక్కరిక్షాలో నేనూ కూచున్నాను. వాడు నా భుజం మీద తలవాల్చి కూచున్నాడు. ముందురిక్షాలు కదిలాయి, మూడోరిక్షా మాది. ఇలా మా రిక్షా ఆ వీధి దాటిందో లేదో 'ఏయ్ రిక్షా ఆపు' అని ఎవరో కేకేశారు. నేను రిక్షా ఆపించి వెనక్కి చూశాను. ఆ వీధిలైట్లో స్పష్టంగా కన్పిస్తోంది – గీత తమ్ముడు బాబ్జీ. చేతిలో ఏదో తెల్లగా మడిచిఉన్నది పట్టుకుని పరిగెత్తుకువస్తున్నాడు.

నా రక్తం ఒక్కక్షణం నాట్యం చేసింది. నా గుండె మృదంగం వాయించింది. నా మనసు పరవశించిపోయింది. గీత నాకేదో కబురు పంపిస్తోంది. అంత తొందరగా ఏం రాసి పంపగలదనే అనుమానం అనవసరం. "రేపు సాయంకాలం ఐదు గంటలకి పార్కుదగ్గిర నన్ను కలుసుకోండి," కావచ్చు. ప్రేమలేఖలో రోగి ముఖ్యం కాదు, రమ్యత ముఖ్యం. బాబ్జీ రిక్షాను చేరుకున్నా ఒకపట్టాన ఆయాసం తగ్గి వాడి నోట మాట రాలేదు.

'మీరేనా విజయకుమార్‌గారు? మా అక్క ఇది మీకు యిమ్మంది;' ఎంత

సూటిగా, ఎంతసుఖవుగా పంపింది ! ఇక ఆ ప్రేమలేఖలో ఎన్ని కేజీల పంచదార ఉంటుందో !

'ఇదిగో యీ పొట్లంలో రెండుమాత్ర లున్నాయి. ఒకటి వెళ్ళగానే వాసుగారి చేత మింగించమంది. రెండోది ఓ రాత్రివేళట. మరిచిపోవద్దని మరీ మరీ చెప్ప మంది.'

నామీద తల వాల్చుకుని పడుకున్న వాసుగాణ్ణి అలాగే రిక్షాలోంచి కిందికి తోసెయ్యా లనిపించింది.

ఓ తల్లిలేదు, తండ్రిలేడు, మనస్సా కనుక్కునే దిక్కులేదు; అయితే నేం దొంగవెధవ అదృష్టవంతుడు !

* * * *

ఆవాళ ధీరీపేపరు పూర్తిగా పాడుచేశాను. బుర్ర వేడెక్కిపోయింది. ఎంతో అలసటతో తిరిగొచ్చాను.

'ఇంతసేపు చేశావేంరా? నీ కోసం గీత వచ్చింది. పాపం చాలా సేపయింది.'

'బహుశా నాకోసం అయిఉండదులే,' అన్నాను గట్టిగా.

'నా మొహం, నీ కోసంకాక మరెవరికోసం? అది వింటే నొచ్చుకుంటుంది ఊరుకో,' అంది అమ్మ.

గీతతమ్ముడు బాబ్జీ అన్నాడు: 'నిజమే, మేం కేవలం విజయకుమార్ బావ కోసమే రాలేదు !'

నాకు ఒళ్లు మండిపోయింది. ఆ కోపమంతా మా అక్కయ్యమీద చూపించాను. 'ఆ అమ్మాయి నన్ను అవమానపరచడంకోసమే ఈ ఊరు వచ్చినట్టుంది. మధ్యని నువ్వుకూడా దూరుతావెందుకు సిగ్గులేక? ఆ వాసుగాడికోసం వచ్చిఉంటుంది. వాడికి నిన్నటికే పూర్తిగా తగ్గిపోయిందనీ యీ మధ్యాహ్నమే కడుపునిండా కొట్టేసి వాడు వీధిని పడ్డాడనీ ఆమెకు తెలియదుకాబోలు.'

'మేం వ్యాసమూర్తిగారికోసమై రాలేదు; ఊరు విడిచి వెళ్ళిపోతున్నాంగదా! ఒకమారు చెప్పిరమ్మని నాన్న పంపిస్తే యిలా వచ్చాం,' అంది గీత అతి నెమ్మదిగా.

నేను చరచర మేడమెట్లు ఎక్కబోతున్నవాణ్ణి సడెన్ బ్రేకు వేసినట్టు అగిపోయాను. అయినా నా కేమిటో అంతా అయోమయం అనిపించింది. ఇక అక్కడ ఉండలేకపోయాను. మేడమీదకు వెళ్ళిపోయాను. నేను కిందకి దిగి వెళ్ళిపోతూంటే మా అమ్మ గీతకి బొట్టుపెట్టి తమలపాకులూ బత్తాయిపండూ యిస్తోంది.



వాళ్ళు వెళ్ళిపోతున్నారంటే నా మన సెందుకో వెలవెలబోయింది. అక్కడ పెళ్ళి వారింట్లో అంత సరిగ్గా చూడలేదు. ఇక్కడ మా యింట్లో ధైర్యంగా స్థిమితంగా ఆమెను చూశాను; చాలా చక్కని ముఖం. అందులో ఏం సందేహం లేదు. కాని ఎక్కడో ఏదో చెప్పలేని వెలితి. ఒకింత జాలితో కూడిన ప్రేమ మరింతగా నాలో పొంగిపొర్లింది.

'వీధిదాకా వెళ్ళి గీతను దిగబెట్టిరా బాబూ!' అంది అమ్మ. ఆ అవకాశం యిచ్చి నందుకు అమ్మకు లోలోపల నమస్కరిస్తూ గేటుదాకా వాళ్ళను సాగనంపేను.

గీత తమ్ముణ్ణి తీసుకుని గబగబా నడిచింది. బాటకి అటూ ఇటూ తల

లూగిస్తున్న తెల్లచామంతిపూలు చూడలేదు. నెత్తిమీద కెక్కి కూచున్న చందమామను పరికించలేదు. అట్నుంచి యిటు వీచే చక్కని పిల్లగాలులతో ఆడుకోలేదు. పూర్వకాలపుదానిలా ఒళ్ళంతా కప్పుకుంది. వయసు మళ్ళినదానిలా తలవంచుకు నడిచింది. ఒక్కసారైనా నావైపు చూడలేదు. కాని వీటన్నిటికి సరిపడే ఒకేఒకమాట వెళ్ళేముందు నమస్కారం చేస్తూ అంది: 'మీరు అదృష్టవంతులు!' అంతే. గబ గబా నడిచి కనుమరుగైపోయింది.

అది చాలదా ? నేను మెచ్చుకునే వ్యక్తినుంచి నన్ను మెచ్చుకునేవాక్యం ఒకటే ఒకటి, వేలకివేలు చెయ్యదా ? మెడిసిన్ చదువుతున్నాను. ఆరోగ్యమూ అందమూ ఉన్న పాతికేళ్ళలోపు పడుచువాణ్ణి. నన్నెవరు మెచ్చుకోరు ? కాని గీత మెచ్చుకోడందారి వేరు. ఆ అమ్మాయికి నా హృదయంలో ఉన్నస్థానం వేరు. అవును, నేను అదృష్టవంతుణ్ణి ! కాని నేనొక్కణ్ణీ ఎలా అదృష్టవంతుణ్ణి అవుతాను గీతా ? నువ్వూ నేనూ ఒకటి అయాక కదా మనం అదృష్టవంతులం ! ఏమయినా గీత గురించి పూర్తిగా తెల్సుకోవాలనీ, అన్ని విషయాలూ పూర్తిగా చర్చించాలనీ ఆరాత్రి పడుకోబోయేముందు ఎన్నెన్నో అనుకున్నాను.

'మన భోగభాగ్యాలు వాళ్ళ అంచనాకి ఏమాత్రం అందుబాటులో లేనట్టున్నాయి. లేకపోతే తల్లీ తండ్రీ ఒకమారయినా మనింటికి రాక 'వెళ్ళిపోతున్నామని చెప్పిరండి' అంటూ పిల్లల్ని పంపడ మేమిటి ! ఏవిధంగా చూసినా వాళ్ళ పద్ధతి సవ్యంగానూ సంతుష్టిగానూ లేదు. ఇక ఆ సంబంధంమాట ఎంత త్వరగా మరిచిపోతే అంత మంచిది,' అని మానాన్న అంటూంటే నాగుండెలు దడదడ కొట్టుకున్నాయి. మా అమ్మగాని మాయింట్లో మరెవరుగాని నాన్నమాట కాదనకపోవడం నాకు మరీ నిరాశ కలిగించింది. ఆమర్నాడు తెల్లారకుండా పెళ్ళివారింటికి వెళ్ళిపడ్డాను. గతరాత్రి పాసెంజర్లోనే వా ళ్ళావూరినుంచి వెళ్ళిపోయారని తెలిసింది ! మేము వాళ్ళంత గొప్పవాళ్ళం కాము. మాకు ఒక ఎకరం పొలముందా, ఒక సొంతకొంప అంటూ ఉందా ? స్పష్టంగా తెలుస్తూనేఉంది వాళ్ళకి మావాళ్ళు నచ్చలేదని. పీడాపోయింది. నచ్చితే ఎవడిక్కావాలి, నచ్చకపోతే ఎవడిక్కావాలి? అస లది ప్రశ్నేకాదు. వాళ్ళమ్మాయికి వీళ్ళబ్బాయి నచ్చేడా, లేదా ? చెప్పలేము; వీళ్ళబ్బాయికి వాళ్ళమ్మాయి నచ్చిందా, లేదా ? ఎంతగానో... చెప్పలేము !"

శ్రీకృష్ణమూర్తి విజయకుమార్ భుజం తడుతూ అన్నాడు. "నచ్చనియ్యండి, మాననియ్యండి డాక్టర్‌గారూ! మీ నెరేషనుమాత్రం చాలా డ్రామెటిక్‌గా ఉందండీ. కంగ్రాచ్యులేషన్సు. మీరు మంచి రచయితలన్నమాట."

"ఉద్రేకపూరితమైన సంఘటనలు ఉత్సాహభరింగా చెప్పగలిగె నాటకంగాని జీవితం, కవిగాని జీవీ ఉంటాయంటారా మూర్తిగారూ! మన మనసులో మాట ఆత్మీయులతో చెప్పుకోడం ఎదుటివారికోసమే కాదు; ఆమాటకొస్తే ముఖ్యంగా మనకోసమే; చెప్పకుండా ఎలా ఉండగలము!''

ఇద్దరూ మళ్ళీ టీ తాగేరు.

''చెప్పండి డాక్టర్ మీ ప్రేమగాథ ఎలా విఫలమయిందో," అన్న శ్రీకృష్ణ మూర్తిని చూసి విజయకుమార్ నవ్వేడు.

''ఇది మామూలు ప్రేమగాథాకాదు. ఇది విఫలమయిందని నేను అనుకోలేను కూడా."

"మరి?"

"చెబుతా వినండి." విజయకుమార్ మంచినీళ్ళు తాగి మళ్ళీ ప్రారంభించాడు.

* * * *

గీత ఎడ్రసు నాకు తెలుసు. ఒక ఉత్తరం రాస్తే వచ్చిన తప్పేమిటి? అని చాలా సార్లు అనుకున్నాను. అనుకున్నదానిని ఆచరణలో పెట్టలేని సహజమైన నా పిరికి తనం నన్ను నిరుత్సాహపరచడంవల్ల నేనేమీ రాయలేకపోయాను. అలాగని గీత గురించి ఒక్క క్షణమైనా ఆలోచించకుండా ఉండనూలేకపోయాను; ఇంట్లో నా పెళ్ళి గురించి ప్రయత్నాలేమైనా జరుగుతే ఎలాగో ఓలా సాహసించి బయటపెట్టిఉందును. కాని నాకంటె ముందుగా మా అమ్మనీ నాన్ననీ పీడిస్తున్నసమస్య కాసులమ్మ పెళ్ళి ఎంతముందు చేసేద్దామా అని. నా తెలివితేటలన్నీ ఉపయోగించి ఓసారి మా అమ్మతో అన్నాను: 'అమ్మా, పోనీ మనవాళ్ళేగదా, అటువైపు మనచెల్లికి తగినవరు దెవరైనా ఉన్నారేమో చూడుమని సుందరమ్మత్తకీ వాళ్ళకీ అనకాపల్లికి ఓ ఉత్తరం రాస్తేనో?'

మా అమ్మ ఊరుకోక ఆమాట నాన్నతో ఉదహరించింది. అయితే ఒక్క ఉపకారం చేసింది; నన్ను బయటపెట్టలేదు.

'నీ కేం మతిగానిపోయిందా ఏమిటి? అసలే మన మేదో అడుక్కుతింటున్నట్టు వాళ్ళకి హాస్యాస్పదంగాఉంది. ఊరికి వచ్చి మనగడప తొక్కడమే వాళ్ళకి చిన్న తనంగా తోచింది. అటువంటిది వాళ్ళనా సలహా చెయ్యడం? మన కాసులికి పెద్ద సంబంధం ఒకటితెచ్చి చేస్తే వాళ్ళతెగులు సగం కుదురుతుందిగాని...' ఇలా మొదలుపెట్టి నేను అనుకున్నది మొగ్గలోనే తుంచేశారు.

'మీరు అదృష్టవంతులు!' ఈమాటే అస్తమానూ నాకు జ్ఞాపకానికి వచ్చేది.

తాము చాలా భాగ్యవంతులమనీ మేము బాగా తక్కువస్థితిలో ఉన్నామనీ నన్ను కించపరచడానికి అన్నముక్కా అది? ఎంతమాత్రంకాదు. సరళమైన ఆ స్వరంలోని నిజాయితీని నేను శంకించలేను. మరి? ఆమెకన్న ఏవిధంగా నేను అదృష్టవంతుణ్ణి? తల బద్దలుకొట్టుకున్నా నాకు అవగాహన అవలేదు.

చదువువిషయంలో తీరికలేదని నన్ను నేను భ్రమపెట్టుకున్నా. నా మనసు ప్రతి క్షణం గీతచుట్టూ పరిభ్రమిస్తూనేఉంది. నా గీత ఎలాఉందో అని అస్తమానూ అనుకుంటూ ఉండేవాణ్ణి. ఆ ఏడాది థీరీపరీక్షలూ, ప్రాక్టికల్సూ అయిాఅవగానే, యిక ఉత్తరా లెందుకు? ఏదో వంకపెట్టి అనకాపల్లి వెళ్ళి ఆ అమ్మాయిని కలుసుకు రావాలి అనిపించింది. కాని ఇంటిదగ్గిర ఏమనిచెప్పి ఎలా బయలుదేరడమో ఒక పట్టాన నేను తేల్చుకోలేకపోయాను. ఈలోగా మా ఇంట్లో మే మెవ్వరమూ ఎప్పుడూ అనుకోని సంఘటన ఒకటి జరిగింది. అది మరెవ్వరిగురించీకాదు, మా వ్యాసమూర్తి గురించి!

# 4

మా వ్యాసమూర్తి మా నాన్నగారిని ఒకసారి అడిగాడు. ఓ వంద రూపాయలుంటే ఇమ్మని. నాన్న లేదనేశారు. ధాన్యం అమ్మితెచ్చిన డబ్బు ఆరువందలు నాన్న బీరువాలో పెడుతూంటే వాడు చూశాడట. 'అది నా డబ్బు. అందులోంచి యివ్వండి' అన్నాడు. వా డెప్పుడూ అలా అడిగింది లేదు. అలా అడగడం మే మెవ్వరం సహించలేకపోయాం. అమ్మ ఎంత వాదిస్తున్నా వినకుండా నాన్న వాణ్ణి నోటికొచ్చినట్టు తిట్టిపోశాడు.

'ఎవడికొక్కవాలి నీ బోడిసొమ్ము?' అంటూ నోట్లకట్టలు తెచ్చి వాడిమీదకు విసిరేశారు. వాడు ఏమీ అనలేదు. ఒక వంద లెక్కపెట్టి తీసుకుని మిగిలినవి అమ్మ కిచ్చి గబగబ వెళ్ళిపోయాడు. వాడిని వెళ్ళనిచ్చి మా నాన్న మరింతగా చిందులు తొక్కేరు.

'మంచి వయసులో ఉన్నాడు, దున్నపోతులా ఎదిగాడు, ఓ చదువా సత్కాలక్షేపమా? ఈ పాటికి సప్తవ్యసనాలూ సంక్రమించిఉంటాయి. లేకపోతే ఒక రోజులో వీడికి వందరూపాయిలు ఖర్చేమిటంట! ఇవాళ వంద తీసికెళ్ళేడు, రేపు వెయ్యి అడుగుతాడు. ఇదేం సానికొంపనుకున్నాడా, సంసారికొంపనుకున్నాడా? వీడి డబ్బు తిన్నామని నిందా మనకొద్దు, వీడి చాకిరీ మనకొద్దు; ఏదో ఒకనాడు 'నా ఆస్తి ఏం చేశావో అణాపైసలతో లెక్కచెప్పు' అని అడిగే రకమే ఇది. ఈ రోజు మొదలు ఇంట్లో నేనైనా ఉండాలి, వాడైనా ఉండాలి.'




అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుని ఆ రాత్రి వాసుని అడిగింది: 'ఏమిట్రా బాబూ ఇదీ? నిన్ను పెంచి పెద్దవాణ్ణి చేసినందుకు ఇలాగేనా నువ్వు చెయ్యవలసిందీ? చదువూ సంధ్యా మానేసి రోడ్లమ్మట తిరగడమే కాకుండా వందలకి వందలు తగలేస్తుంటే పెద్దవాళ్ళు అదేమనైనా అడగకూడదట్రా? అడిగితే 'నా సొమ్ము నాకు పారెయ్' అంటావా మీ పెద్దనాన్నగారిలాంటివారితో, తప్పుకాదూ?'

'తప్పే పెద్దమ్మా! ఎంత అడిగినా ఇవ్వకపోతే నోరు జారేను. అయినా ఆ అవసరం అంతటిది మరి.'

'ఒక్క రోజులో వందరూపాయిలు ఖర్చుపెట్టే అవసరం నీ కేమొచ్చిందిరా? పోనీ నాతోనైనా చెప్పకూడదుట్రా?'

'ఎవరైనా ఎందుకని నన్నడిగితేకద?'

'పోనీ ఇప్పుడేనా చెప్పకూడదా?'

'మరేం లేదు. తెలుగు మాష్టారు రామదాసుగారు ఆర్నెల్లై యింటద్దె కట్టలేదట పెద్దమ్మా. నిన్నటితో కట్టకపోతే యిల్లు ఖాళీ చేయిస్తామని నోటీసు యిచ్చారుట. ఆయనికి ముగ్గురు కొడుకులూ అయిదుగురు కూతుళ్ళూ. పెద్దకూతురు బాలెంతరాలు. వీళ్ళగాక ఆయన ముసలితల్లి ఒక్కర్తి. ఇంతమంది ఈ శీతాకాలంలో ఎక్కడికి పోతారు పెద్దమ్మా.'

గ్గేకి. ఎవ రెలాచ స్తే నీకేం? నాకేం. అంత ఉపకారబుద్ధున్న మొగాడి
:రవై మూడేళ్ళ వయస్సుంది. గోళ్లు గిల్లుకుంటూ ఊరికే ఇంట్లో కూచో
ఏదైనా ఉద్యోగం చేసి ఊరంతటినీ ఉద్ధరించరాదూ? మళ్ళీ అందులో లేదు
మన ప్రతాపం. అత్తగారి సొమ్ము అల్లుడు ధారపోశాడని...'

'పెదనాన్నా...నన్నాట్టే వేగించకు. నేను చేసిందేమో తప్పుపనికాదు. నేను ఎవరిసొమ్మూ ఎవరికీ ధారాదత్తం చెయ్యనూ లేదు.'

'ఇంకా నీ సొమ్ము ఎక్కడుందోయ్...సిగ్గులేక మాట్లాడుతున్నావ్...నీ తిండికీ, నీ చదువుకీ ఎంతయిందో అదేం లెఖ్ఖలేదన్నమాట....నీ పల్లపుముక్క కాస్తా నువ్వు బతికన్నన్నాళ్ళూ వస్తుందనుకున్నావాఏం? అయినా నాకెందుకీ అల్లరి... ప్లీడర్ని పిల్చుకొచ్చి నీకు రావలసిం దెంతో యిప్పుడే తేల్చేస్తాను

'ఏమండీ, ఇదిగో, నా మాట వినండి.'

అమ్మ అడ్డుకోపోయింది. ఆ మాట ఎవరూ వినలేదు. నేనుకూడా వెళ్ళి అడ్డుకుంటే మా నాన్న మరీ రెచ్చిపోయాడు. 'ఇంక నన్నెవరూ ఆపకండి. ఈ అర చేతిలో అగ్నిహోత్రం నేనింక భరించలేను. ఇప్పుడే ప్లీడర్ని పట్టుకొచ్చి అణా పైసలతో లెఖ్ఖ తేల్చేస్తాను.'

'అంత శ్రమ నీకెందుకు పెదనాన్నా! నాకు తెలిసిన ప్లీడరు ఒకాయన ఉన్నాడు. వెళ్ళి కనుక్కొస్తాను. ఈ డబ్బుగొడవ నాకూ తల నొప్పిగానే ఉంది.'

అమ్మా చెల్లీ ఎంత గట్టిగా పిలుస్తున్నా వినిపించుకోకుండా మా వ్యాసమూర్తి గబగబ వీధిలోకి వెళ్ళిపోయాడు. అలా జరుగుతుందని ఎంతమాత్రం ఊహించని నేనూ నాన్నా ఒకాళ్ళమొహం ఒకాళ్ళు చూస్తూ కూచున్నాం. ఆవాళ ఇంట్లో సరిగా భోంచేసిందీ లేదు; ఆ రాత్రి యింట్లో ఎవరికీ నిద్రల్లాలేవు!

"అనవసరంగా లేనిపోని అల్లరి తెచ్చిపెట్టేరు. ఓ వందరూపాయిలు వాడు అడిగింది, అదైనా వాడికోసం కాదు. మాటాడకుండా యిచ్చేస్తే యింత అల్లరౌనా? ఇదంతా వాణ్ని వీధిలో పెట్టడానికీ, మనం వీధిలో పడ్డానికీ వచ్చినట్టుంది చూస్తే..." అంది అమ్మ.

'నోరుముయ్యి... నీ వల్లే యిదంతా వచ్చింది. ఎక్కడో దూరపుచుట్టం. కొంపమీదికి ఈ కొరివిని ఎవరు తెచ్చిపెట్టమన్నారు? మేజరవగానే అంతపొలమూ వాడికి హక్కుభుక్తం అయిపోయేటట్టు అందులో రాసుంది. మంచిమాటలాడి నీ పేరయినా రాయించేశాను కాను. ఇప్పుడన్నివిధాలా కొంప మునిగింది. ఏమనుకుంటే ఏం లాభం; ఆ కాగితాలు పట్టుకుని వాడు పారిపోయేడంటే మనపని గోవిం

దాయే,' అని నాన్న అంటూంటే నే నన్నాను 'ఆ కాగితాలు ఎక్కడున్నాయో చూడరాదూ?'

అవి కనపడలేదు అలాంటి వేవో మా వాసు చేతిలో ఆవాళ సాయంకాలం చూసి నట్టు గుర్తని కాసులుకూడా చెప్పగానే నాన్న నీరుకారిపోయారు! బుర్ర బాదు కున్నాడు

'ఇంకా వీడి చదువు ఏణ్ణర్థం గడవాలి. దీనికి చూస్తే పద్దెనిమిదీ వెళ్ళిపోయాయి. ఎలా యీదుకురాను భగవంతుడా! ఆఖరికి వీణ్ణి పెంచడం పాముకి పాలు పోసిన ట్టవుతుందని కలలోకూడా అనుకోలేదు;' మా అమ్మ అవస్థ వర్ణించలేనిది. ఇరవై మూడేళ్ళు పెంచిన పిల్లడు, ఇంత అపకారం చేస్తాడంటే ఆవిడ నమ్మలేకపోతు న్నది. నాన్నతో ఎటువంటి జవాబూ చెప్పలేకపోతున్నది.

'తండ్రీ వెంకటరమణమూర్తీ! మా తప్పులుంటే మమ్మల్ని దండించు. తల్లీ తండ్రీ లేనివాడు, బొత్తిగా దుడుకువాడు; వాడంరోజు లయింది యిల్లొదిలిచి. నాకు వాడి ఆస్తీవద్దు, ఐశ్వర్యమూ వద్దు. నా చేత్తో నేను వాడికి యింత అన్నం పెట్టుకునేటట్టు అనుగ్రహించు తండ్రీ!' అని కన్నీళ్ళతో వేడుకొంటున్నది.

పదిరోజుల తర్వాత మా వ్యాసమూర్తి దగ్గిర్నుంచి నాన్నగారికి రిజష్టరు పోస్టులో పెద్దకవరు వచ్చింది. నాన్న ఒణుకుతున్న చేతుల్తో అది విప్పుతూంటే మా కెవరికీ మతుల్లేవు. అందులో వాడి ఆస్తికి సంబంధించిన కాగితాలూ, ఒకపట్టా, ఒక ఉత్తరమూ ఉన్నాయి. ఉత్తరంలో యిలా ఉంది:

"పెదనాన్నా,

నా పొలమంతా నీపేర రాసేసిన కాగితాలు ఇందులో పంపుతున్నాను. నా పొలం అమ్మి ఆడబ్బుతో చెల్లికి కట్నం ఇచ్చి పెళ్ళి చేస్తే నేను సంతోషిస్తాను; అటుపైన నీయిష్టం. నే నెక్కడ స్థిరపడేదీ యింకా నిశ్చయించుకోలేదు. అందాకా విశాఖ పట్టణంలో ఒక స్నేహితుడిదగ్గర ఉన్నాను. నీకూ పెద్దమ్మకీ అన్నయ్యకూ నా నమస్కారములు; కాసులమ్మకు నా దీవనలు. తప్పులుంటే క్షమించవలసింది.

వ్యాసమూర్తి."

ఆ ఉత్తరం చూసి మరి ఎవరిమొహమూ నాన్నగారు చూడలేకపోయారు.

'అంతా నాకే యిచ్చి నువ్వేమైపోతావ్ చిన్నన్నా!' అని కాసులమ్మ ఒకటే ఏడుపు. కడుపు తరుక్కుపోయేటట్టు కన్నీళ్ళతో నిండిపోయిన అమ్మమొహం నేను చూడలేకపోయాను.

ఓ చదువులేదు; సంధ్యలేదు. అయితేనేం, దొంగవెధవ హృదయ మున్నవాడు

మా పరీక్ష లయిపోయాక 'అమ్మా! ఓసారి విశాఖపట్నం వెళ్ళి వాసుగాణ్ణి చూసొస్తానే.' అన్నాను. 'చూసిరావడంకాదు, తీసుకురా ఇంతప్పట్నుంచీ వాణ్ణి పెంచాను. చూసి ఎన్నాళ్ళయిందో.' అని మాఅమ్మ కళ్ళనీళ్ళు పమిటచెంగుతో తుడుచుకుంది.

విశాఖపట్నం వెడుతూ రైల్లో కూచుని నేను మొట్టమొదటిసారిగా వ్యాసమూర్తి గురించి తీవ్రంగా దీర్ఘంగా ఆలోచించాను. ఇంకొక్క ఏడాది హౌస్‌సర్జన్ అయిపోతే నేను క్వాలిఫైడు డాక్టర్ని అయిపోతాను. గవర్నమెంటుఛాన్సు వస్తే గజిటెడ్ ర్యాంకు; ప్రైవేటు ప్రాక్టీసుపెట్టుకుంటే నెలకి ఓ అయిదారువందలయినా కళ్ళజూస్తాను. అయినా వాసుని నే నెప్పటికీ అందుకోలేనేమో అనిపించింది. వాడు చెప్పులు లేకుండా ఎండలో నడవగలడు. పెళ్ళివారింటికయినా మాసినబట్టలు కట్టుకు రాగలడు. పరీక్ష ఫేలయినరాత్రికూడా నిశ్చింతగా నిద్రపోగలడు. వాడు వేదాంతి; చక్రవర్తి. నేను ఎం. డీ. ప్యాసయినా, ఎఫ్. ఆర్. సి. ఎస్. డిగ్రీ పొందినా వాణ్ణి కల్సుకోలేను. పచ్చని భవిష్యత్తుకోసం బంగారుకలలు కనేవయసు నాది. చదువు నాది. 'నేను పడినశ్రమంతా మా బాబు తీరుస్తాడు.' అని మా నాన్న అనుకుంటే నేం, 'మళ్ళీ మా తండ్రి ఎలా తీసిన నగలు అలా నా ఒళ్ళంతా నింపుతాడు,' అని మా అమ్మ ఆశపడితేనేం, ఓడిపోయేవాళ్ళ కున్న మనస్తత్వంలాటిది, యిక ఏ విధంగానూ తీరదనే నిరాశలాటిది నన్ను నిలువెల్లా క్రుంగదీసింది. పరీక్షలు పాసవుతున్నా నా కీ పరాజయభావన దేనికి? పరీక్షలు ఫేలయినా మా వాసుగాడి కీ విజయోల్లాసం ఏమిటి? వాణ్నే అడగా లనిపించింది.

కాదంబరివారి వీధిలో ఉన్న, వాడిస్నేహితుడు, వా ళ్ళింటికి వెళ్ళేను. ఏం లాభం? వాడు ఆ ఊరుదాటి వారంరోజులు దాటిందిట. ఆ ఊళ్ళో ఉన్నంత కాలం ఎక్కువసేపు మాధవసేవాసదన్ మందిరంలోనే గడిపేవాడట. అక్కడికి వెళ్ళి కనుక్కుంటే 'సరళ జీవనమూ, సచ్చింతనమూ.' అనే విషయం ప్రబోధం చెయ్యడానికి వీలుగా ప్రత్యేక శిక్షణ పొందడానికి మద్రాసులో ఉన్న సంస్థకి పంప బడ్డాడట. అక్కడే ఉండిపోవడానికి నిశ్చయించాడుట.

వ్యాసమూర్తిని గురించి ఆలోచించినకొద్దీ నా బుర్ర మరింత బరువెక్కిపోయింది ఈ చదువు దేని? ఈ బతుకు దేనికి? ఉద్దేశం ఏమిటి? ప్రయోజనం ఏమిటి? ఇలాంటి పెద్దపెద్ద ప్రశ్నలు మొట్టమొదటిసారి నాలో కలిగి, జవాబులు తెలియక, నా ఆత్మ గిలగిల తన్నుకోడం ప్రారంభించింది సరిగా అప్పుడే. సరిగ్గా అదే సమయంలో ఒక సుందరస్వప్నం నాకు తాత్కాలికంగా శాంతి నిచ్చింది ఇసుకలోనా, సము



ద్రములోనా, ఆకాశములోనా ఎక్కడ చూసినా తరంగాలు. ఈ తరంగాలకు కేంద్రం ఎక్కడ? ఇంకెక్కడ? నన్ను అనుక్షణం పాలించే నా గీతదగ్గర. నే నింక ఆలశ్యం చెయ్యలేదు. వెంటనే అనకాపల్లి బస్సు ఎక్కేశాను.

అనకాపల్లిలో నాతో చదువుకున్న మోహనరావు అనే అతను ఫిజిక్సు డిమాన్‌స్ట్రేటరుగా పనిచేస్తున్నాడు. వాడు హాస్టల్లో ఉంటున్నాట్ట - కనుక్కొని అక్కడ దిగేను. మర్నాడు మధ్యాహ్నం భోంచేసి వాడలా కాలేజీకి పోగానే నే నిలా కేశవారావుగా రింటికి వెళ్ళేను. ఇల్లు తాళం వేసిఉంది. నా గుండె ఆగిపోయినట్టయింది. పోనీ ఆయిల్లు కాదేమో అనుకుంటే స్పష్టంగా నేమ్‌ప్లేట్ ఉంటాయె

నే నటూయిటూ తెల్లమొహం వేసుకుని చూస్తూంటే, గీత పక్కింటినుంచి గబగబా వచ్చి తాళం తీసి నన్ను లోపలికి ఆహ్వానించింది.

'ఎంత సేపయింది వచ్చి ? ఇంకా నయం వెళ్ళిపోయారుకారు. సామా న్లేవీ?'

స్నేహితుడింటికి పెళ్ళికి వచ్చాననీ, రాత్రి పెళ్ళయిపోయిందనీ – ఆ సాయంకాలం తిరిగి వెళ్ళిపోతూ ఓసారి చూడాలనిపించి వాళ్ళింటికి వచ్చాననీ కోశాను. వాళ్ళమ్మా నాన్నా బెజవాడ వెళ్ళేరుట. తమ్ముడేమో బడికెళ్ళాడుట. ఏమీ తోచక పోతే తలుపు తాళంవేసి పక్కింటి బాలాంబగారింటికి వెళ్ళిందిట. మంచిసమయంలో వచ్చినందుకు నన్ను నేనే అభినందించుకున్నాను. కోరినకాంతా, ఏకాంతమూ ఒకేసారి లభ్యమవడం ఎంత అదృష్టం !

'అమ్మా, నాన్నా, చెల్లీ అంతా బాగున్నారా ?' అంది కాఫీ యిస్తూ.

'ఊఁ' అన్నాను, గడియారంపంక చూస్తూ. అప్పుడు పదకొండున్నర అయింది. వాళ్ళ తమ్ముడు నాలుగున్నరకి వస్తాడుట. ఈలోగా అన్నీ మాట్లాడెయ్యాలనుకున్నాను.

'మీ తమ్ముడు వ్యాసమూర్తిగారు క్షేమమేనా ?'

నా ఒళ్ళు మండిపోయింది. ఆ ప్రశ్న అడుగుతున్నప్పుడు ఆమె కళ్ళలో స్ఫురించిన ఆత్రుతా, ఆమె కంఠంలో ధ్వనించిన ఆప్యాయతా చూస్తే నాలోని మంచితనం మంటకలిసింది.

'వాడెక్కడ తమ్ముడు నాకు ? ఎక్కడో దిక్కూమొక్కూ లేనివాడని మా అమ్మ తీసుకొచ్చి పెంచింది. దానికి తగ్గట్టు మరి మే మెవరమూ తలెత్తుకోకుండా చేశాడు.'

'అదేం, ఏం చేశారేం ?'

మళ్ళీ ఆమెవైపు చూశాను. ఆందోళనతో ఆ పెదవులు కంపిస్తున్నాయి. ముందున్న ఇసుకవైపు పయనిస్తున్న ఆ మధురవాహినికి వెంటనే ఆనకట్ట కట్టడం నా బాధ్యతగా భావించాను.

'ఇం కేంచెయ్యాలి? మా ఎదురింటి గుమాస్తాగారిభార్యని తీసుకు లేచిపోయాడు!' ఇంత అబద్ధం నా జీవితంలో ఆడడం ఇదే మొదటిసారి. నిలువెల్లా నేను ఒణికిపోయాను. ఎలాగో నిలదొక్కుకున్నాను. ఆమె రెండుచెవులూ మూసుకుంది.

'నే నమ్మను, నమ్మలేను. ఎవరో కిట్టనివాళ్ళు కల్పించిన కట్టుకథ–ఇది మీ రెలా నమ్మేరు, ఎలా నమ్మగలిగేరు ? వ్యాసమూర్తిగార్ని అంత తక్కువగా అంచనా వెయ్యడానికి మీ మన సెలా ఒప్పింది ?'

అపజయమూ అవమానమూ నన్ను చిత్రవధ చేశాయి. నేను నా ముందు నేరస్థుడిగా సిగ్గుతో నిలబడిపోయాను.

'మాటాడరేం? అంతటి అపవాదుని మీ రెలా నమ్మగలిగేరు?'

'వా డలాంటిపని చెయ్యడని మీకుమాత్రం అంత నమ్మక మేమిటి?'

'అయితే చెప్తా వినండి;' ఆమె కుర్చీ దగ్గిరికి లాక్కుని కూచుంది.

గీతతో అనేక విషయాలు ముఖాముఖీ మాటాడదామని నే వచ్చాను. ఆమె గురించి ఒక్క కొత్తవిషయం తెలియలేదు. నా ప్రేమవిషయం ప్రస్తావనగానైనా రాలేదు. 'మీరు అదృష్టవంతులు!' ఎందుకో తెలియలేదు. అప్పుడే ఒంటిగంటయింది. నే నెక్కడికి వెడితే అక్కడికి వ్యాసమూర్తి మాత్రం నన్ను వదలడం లేదు!

'ఏమి టాలోచిస్తున్నారు?'

'ఏం లేదు, ఏదో చెప్తా నన్నారుగా, చెప్పండి.'

'వ్యాసమూర్తిగారిమీద నా కీంత నమ్మకానికి కారణమేనా? చెప్తాన

'వాడి గురించి నాకు బాగా తెలుసు.'

'తెలియదనే నా ఉద్దేశం. అయినా ఇది అయన గురించి కాదు, నా గురించే. ఇన్నాళ్ళకు ఒకరితో చెప్పుకునే అవకాశం కలిగింది.'

ఇన్నిరోజుల తర్వాత, యింతగా వేచిఉన్నమీదట, యిప్పటికైనా ఈ అదృష్టం పట్టినందుకు నా కెంతో ఆనంద మనిపించింది. ఆమె గురించి నా చెవిలో ఏం పోసినా అది సుధే. ప్రతీఅక్షరం ఎంతో నెమ్మదిగా, పొదపుగా, ప్రేమగా విన్నాను.

'ఇవన్నీ మీకు పెద్ద ఉత్తరంగా రాద్దామనుకున్నాను. మీరే నా ఎదుటికి వచ్చి వినడం నా అదృష్టం. తర్వాతైనా నా కేదైనా చెప్పుకోవాలని ఉన్నప్పుడు మీకు ఉత్తరాలు రాస్తూంటాను. జవాబులు కోరను. నా ఆలోచనలు సహృదయంతో పంచుకునే సన్నిహితులు ఒక రున్నారనే ధైర్యం నాకు ప్రసాదించండి.'

నాకు గీతమాటలు సరిగ్గా బోధపడలేదు. అయినా ఆమె ఉపయోగించిన కొన్ని పదాలలోని మాధుర్యం నన్ను పరవశుణ్ణి చేస్తోంది. తాత్కాలికమైన ఆనందంతో తల ఊగించాను. మరింత వేగంగా గీత తన జీవితంలో ఒక ముఖ్య సంఘటన గురించి చెప్పసాగింది.

## 5

గీతకు ఎనిమిదేళ్ళున్నప్పుడు జరిగిన సంగతి వాళ్ళ అమ్మమ్మ నిచ్చెనెక్కి అటకమీద ఆవకాయ తీస్తూంటే జారిపడి మోకాలిఎముక విగిరింది. వెంటనే కార

మీద వైజాగ్ తీసుకొచ్చి జనరల్ ఆస్పత్రిలో చేర్చారు. సుందరమ్మగారికి అప్పుడే రెండు వారాలనుండి జ్వరంగా ఉండడంచేత ఆవిడ తల్లితో వెళ్ళడానికి కుదిరింది కాదు. అల్లుడు కేశవరావే ఆమెను దిగబెట్టవలసివచ్చింది. తనూ వస్తానని పేచీ పెడితే, పోనీ కారులోగదా, మళ్ళీ తీసికొచ్చి దిగబెట్టెయ్యవచ్చునని గీతనికూడా విశాఖపట్నం తీసికెళ్ళేరుట. తీరా అక్కడ అమ్మమ్మను జాయిన్ చేశాక, ఆమెను విడిచిరానని గీత ఒకటే అల్లరి. 'మరీ చంటిపిల్ల కాదుగదా, పోనీ ఉండనియ్యండి,' అని అక్కడివాళ్ళంటే ఆ ఒక్కరోజుమాత్రమే ఉంచడానికి అమ్మాయిని ఒప్పించి, భార్యకి జబ్బుగా ఉందని కేశవరావుగారు ఆ రాత్రే అనకాపల్లి వచ్చేశారుట.

ఒక్కరోజులో కొన్ని గంటలు. అయితే నేం ఆ బాలిక లేతమనసులో శాశ్వతంగా ప్రభావం చూపిన విలువైన గడియ లవి. అమ్మమ్మ ఏమైపోతుందో అని అక్కడ ఉండిపోయిందిగాని నిజానికి గీతకు ఆ మూలుగులూ, ఆ మందుల వాసనలూ, ఆ రోగిష్టి ముఖాలూ ఎంతో భయాన్ని కలిగించాయి. ఇంతలో కారు చీకట్లో కాంతిరేఖలాగ ఒక నర్సు అక్కడికొచ్చి గీత మనసంతా నిండికూచుంది. రాగానే గీతను ముద్దెట్టుకుని, అడిగింది: 'మీకు బలే సాయం దొరికిందే మామ్మగారూ, మనవరాలా?' అమ్మమ్మ జవాబు చెప్పలేదు. నర్సుచెయ్యి పట్టుకుని ఏడవడం మొదలుపెట్టింది.

'ఆ దేవిటి ఏడుస్తున్నారా, ఛ, మీ కేమయిందని?'

'ఇం కేం కావాలి! బాధ భరించలేకుండా ఉన్నాను; చచ్చినా బాగుణ్ణు.'

'చూడండి, మీ రలా అంటూంటే నో రెరగని ఆ పసిపిల్ల గుడ్లనిండా ఎలా నీరు నింపుకుందోను. ఇంతకీ మీ కేమయిందని!'

'అయితే నా కాలు మళ్ళీ మామూలుగా అవుతుందంటావా నర్సమ్మా?'

'ఎందు కవదు? పిప్పి పిప్పి అయిన కాళ్ళవాళ్ళు మా ఆస్పత్రినుంచి కుప్పి గంతులు వేస్తూ బయటకు వెళ్ళిపోయారు. అలా కాకపోతే మే మెందుకు, యిన్నిన్ని మందు లెందుకు?'

'ఎంత మంచి కబురు చెప్పేవు తల్లీ... అయితే పెద్దడాక్టరుగారు ఏమన్నారు! నా కాలికి. ఏం చేస్తారు? ఏమీ జరక్కపోతే యీ మణికిదగ్గిర యింత నెప్పి, యిక్కడ యింత కట్టూ ఏమిటి?'

నర్సు నవ్వుతూ అంది: 'కట్టు కట్టద్దా మరి? మీ రీ వయసులో చేసిన సర్కస్ ఫీటు తక్కువదా? కట్టు సంగతి చెబుతా వినండి. విరిగిన ఎముకలు తిన్నగా ఉంచడానికీ, కండరాలు కొంచెం వదులు అవడానికీ కాలుని సాగదీసి కడతారు. రేపు ఆపరేషను




గదిలో విరిగిన ఎముకను సరిచేస్తారు. అంతే. రెండ్రోజుల్లో కొంచెం మీకాలిని అటూ ఇటూ కదపొచ్చు.'

'నిజంగా?' అమ్మమ్మ ముఖంమీదకు వచ్చిన ఆశారేఖను గీత స్పష్టంగా చూసింది. 'అందుకు సందేహమా?' అన్నట్టు నర్సు ఆమె వీపుమీద ప్రేమతో నిమిరింది.

'ఇక్కడ బొత్తిగా అంటూసొంటూ ఉన్నట్టులేదే అమ్మా! ఎలా తినిచావను ఈ కూడు?'

'అదిగో అక్కడి పేషంట్లు మావాళ్ళే...వాళ్ళతో మాటాడి మీకు వేరే వండించడానికి ప్రయత్నిస్తాను.'

ఈసారి అమ్మమ్మ నర్సుచెయ్యి తీసుకుని తన గుండెలమీద పెట్టుకుంది.

'అక్కడ మా అమ్మాయి కెలా ఉందో...నే నిలా ఉన్నట్టు దానికి చెప్పేరో లేదో...ఇంతదూరం కబు రెలా పెడుతుందే మాయమ్మా!'

'ఈ పక్కవరండాలోనే ఫోను ఉంది. మూడుగంటల కొకసారి ఫోను చేసి చెప్పమని మీ అల్లుడుగారు పురమాయించి వెళ్ళేరు. మీ అమ్మాయికి నార్మలు వచ్చిందని యిప్పుడిప్పుడే కబురు వచ్చింది.'

'అమ్మయ్య... సగం నా బాధ తగ్గిపోయిందే అమ్మా!'

'మామ్మగారూ, చాలాసేపు కూచున్నాను. ఇక నే వెడతాను. మీ కేం బాధ లేదు. మరో అరగంటకి మళ్ళీ నే వస్తాను. మీ కేం కావలసినా మేం ఎవరమో ఒకరం డ్యూటీలో ఉంటాం; సందేహించకుండా మీ బాధ ఏమిటో చెప్పండి. భగవంతుణ్ణి తలచుకుని పడుకోండి. మీకు చక్కగా నిద్రపడుతుంది. అన్నిటినీ మించి ముత్యంలాంటి మనమరాలు మీ కుంది. 'కుంచమంత కూతురుంటే మంచంమీదే కూడుట;' మీ కేంలోటు? వస్తా,' అని చెప్పవాల్చకుండా తనవైపు చూస్తూ, ప్రత్యక్షరం ప్రశంసాపూర్వకంగా వింటున్న గీతను మరొక మారు ముద్దెట్టుకొని— 'నాలో ఏముందని అంత చిత్రంగా చూస్తున్నావ్ పాపా?' అంటూ టకటక నడుచుకుని వెళ్ళిపోయింది. గీత తనకు తెలియనంత ఆకర్షణతో రెండుచేతులూ జోడించి 'నమస్తే' అనడం ఆమె గుర్తించిఉండదు. ముసిలావిడ 'చల్లని తల్లివి. పది కాలాలపాటు బతుకు' అని గొణుక్కోవడం కూడా ఆనర్సు పరికించిఉండదు.

అందరికీ అన్ని జబ్బులూ నయమయాక అమ్మమ్మ అమ్మతో అన్నమాటలు గీత ఎప్పుడూ మరచిపోలేదు.

'నన్నెవరు బతికించా రనుకున్నావ్, సుందరం? ఒళ్ళెరక్కుండా జ్వరంతో పడుకున్న నువ్వుకాదు; అప్పటి కప్పుడు ఆతృతతో నన్ను పెద్దడాక్టరుకి చూపించిన అల్లుడూకాదు; ఆఖరికి నే నేమైపోతానో అని నన్ను వదిలిపెట్టని మనవరాలూ కాదు. అసలు ఒకవేళ మీరు ముగ్గురూ కలిసి అక్కడున్నాసరే నన్ను రక్షించింది మీరైఉండరు. కాటికి కాళ్ళు జాచుకున్నదాన్ని, కాలు విరుచుకున్నదాన్ని, కుంటిముండనై నే నెలాబతకాలి? అనే ప్రశ్నకి జవాబు చెప్పి నాకు ధైర్యాన్నిచ్చింది మీరెవరూ కానేకాదు. ఏది కావాలన్నా నాకు సహాయం చేసేవారు ఇంత ఆస్పత్రిలోనూ ఒకర్రైనా ఉన్నారనే భావమే నన్ను బ్రతికించింది. ఆ భావం కలిగించింది నర్సమ్మ; అంతకన్న జన్మకి సార్థకత ఏముంది! నే నక్కణ్ణుంచి వచ్చేస్తున్ననాడు ఆ అమ్మాయి ఏమందో తెలుసా—

'ఏమండోయ్ మామ్మగారూ! చూశారా, లేచి కూచోలేనేమో అనికూడా అనుకునేవారు—కొత్తగా నడక నేర్చిన పాపలా ఎలా అడుగులేస్తున్నారోను! అడుగులకి అరిసెలు పంచిపెడతారంటారే, ఏవీ అవి మాకు?'

'మాతల్లి... మా అమ్మ... ఇదిగో కొస్త ఓపికరానీ... నిజంగా బుట్టెడు




అరిసెలు చేసి నీకు పంపిస్తాను; అందాకా ఇదిగో ఈ పాతికరూపాయిలూ బహుమతిగా తీసుకుని ఓచీర కొనుక్కో అమ్మా;'

'డెబ్బైయేళ్ళ మామ్మగారు పిల్లిమొగ్గవేసి కాలు విరక్కొట్టుకుని కుంటుకుంటూ వచ్చారు. చురుగ్గా నడుస్తూ నవ్వుకుంటూ వెళ్ళిపోతున్నారు. అంతకు మించిన బహుమతి మా కేముంది మామ్మగారూ ? వీలయితే మళ్ళీ ఎప్పుడేనా రండి.'

'ఏం, ఈసారి రెండుకాళ్ళూ విరక్కొట్టుకోమన్నావా ? నిజంగా ఏం చేసినా సరే, నీ దగ్గిరకి రావాలనే ఉంటుందే పిల్లా. నీ పిల్లలు అదృష్టవంతులే తల్లీ!'

'మా పెద్దమ్మాయి వయస్సెంతో తెలుసా ?'

'ఎంతటా ?'

'డెబ్బై!

* * * *

గీత పమిటచెంగుతో చెంపల్ని తుడుచుకుంది.

'ఆపదలో ఉన్నవారికీ, అనేకరకాల బాధలతో అలమటించేవారికీ తాత్కాలి కంగా అయినాసరే, ఉపశాంతి కలిగించగల జన్మ యెంత ధన్యమైన దంటారు విజయకుమార్! పసివారి మొదలు ముసలివారివరకు అందరూ నా పిల్లలే అనుకోగల వ్యక్తిత్వం ఎంత గొప్పదంటారు! 'ఫరవాలేదు, మీ గురించి కనుక్కోడానికి నే నున్నాను,' అని ఒక్కరితోనైనా త్రికరణశుద్ధిగా చెప్పగలిగిన అదృష్టం అదెంత అనన్యమైన దంటారు!

ఆనాడు ఆస్పత్రిలో నా హృదయఫలకంమీద చెరగని ముద్ర వేసిన ఆ సేవా బీజం నా ప్రత్యణువులోనూ ఊడలు దింపుకుని మహావృక్షమైపోయింది. పరార్థం కోసం కానిది బ్రతుకే కాదనే భావం నాతోపాటు పెరిగి పెద్దదైంది.'

'అయితే దానికోసం మీ రేం చేశారు?' అని ఆమె నడిగాను.

'ఏం చేశాను; ఏమీ చెయ్యలేకపోయాను! ఒకసారి యింట్లోంచి పారిపోయి ప్రేమసమాజంలో సేవికగా చేరుదా మనుకుంటే నాన్న అడ్డుపడిపోయారు. మరో సారి నర్సు ట్రైనింగుకోసం దరఖాస్తుఫారాలు తెప్పించి నింపుతూంటే తమ్ముడు చూసి అమ్మతో చెప్పేశాడు. వెంటనే వాటిని అమ్మ చింపేసింది. నా కోరిక ముక్కముక్క అయింది. అయినా నానుంచి తొలగిపోలేదు. మొన్న మళ్ళీ మీ ఊళ్ళో పెళ్ళికి వచ్చినపుడు మీ వ్యాసమూర్తిగారి సేవ చూస్తే నాకు నర్సు జ్ఞాపకానికి వచ్చింది. అందుకే పరోపకారార్థమే బతుకుతున్నవాళ్ళు తప్పుమార్గం పట్టే రంటే నేను నమ్మలేను.'

'మీరు నమ్మినదానిమీద మీకున్న నమ్మకానికి నాకు చాలా ఆనంద మౌతోంది గీతా! నిజానికి వాసు ఏ పాపమూ ఎరగడు. పైగా ఆస్తంతా మా నాన్నగారిపేర ఒకస్వచ్ఛంద సేవాసంస్థలో చేరిపోయాడు. వాడి విషయంలో అలా కల్పించి చెప్పిన మహాపరాధం నాదే!' నా మనసు తేలికపడింది. కొత్త విషయాన్ని కనుగొన్న ఉత్సాహ మేమీ ఆమెలో కనబడలేదు గాని, ఆత్మవిశ్వాసంతో ఆమె ముఖం ప్రజ్వలితమైంది.

'నేను ముందే చెప్పలేదా? అలా చెబితే నే నేమంటానో అని మీ రలా కల్పించి చెప్పిఉండవచ్చు. అంతే కదూ?'

నే నేం మాటాడలేదు. అదంతా సుఖవుగా పూర్తయినందుకు సంతోషించాను.

'మొత్తంమీద వ్యాసమూర్తిగారు అదృష్టవంతులు!' అంది గీత తనలో అనుకుంటున్నట్టు.

'అదృష్టవంతులు,' అనేమాట వినగానే ఇక నేను ఊరుకోలేకపోయాను. 'ఆమధ్య పెళ్ళికి మీరు మా వూరు వచ్చినపుడు మా యింటికి వచ్చారు జ్ఞాపకముందా? అప్పుడు మా యింటినుంచి వెళ్ళిపోతున్నప్పుడు గేటుదాకా మిమ్మల్నీ, మీ తమ్ముణ్ణీ నేను దిగబెట్టేను. మీ రప్పుడూ యిలాగే అన్నారు: 'మీరు అదృష్టవంతులు.' అని. అప్పుడలా ఏ ఉద్దేశంతో నాతో అన్నారో ఇప్పుడు చెప్పగలరా?'

గీత కొంచెంసేపు మౌనం వహించింది.

'ఇన్నేళ్ళ తరవాత ఎప్పుడో అన్న ముక్కకి అర్థం చెప్పుకోడం కష్టమే. కాని




ఆ మాటకి నా మనసు ఎన్నిరకాల అర్థాలు చెప్పుకుందో నా హృదయం ఎన్నిరకాల భావాలకు లోనయిందో మీరు ఒక్కసారైనా ఆలోచించిఉండరు సుమా. గీతా! బాగా ఆలోచించండి, కావలసినంత టైమ్ తీసుకోండి. అదేమిటో తెలుసుకుందామనే యింతదూరం వచ్చాననే మాట మరచిపోకండి.'

గీత నా వైపు ఆశ్చర్యంగా చూసింది. 'మీ మాటలు చిత్రంగా ఉన్నాయి విజయకుమార్! నిజంగా అప్పుడు నే నెందుకలా అన్నానో గుర్తురావడంలేదు. అయినా దాని కిప్పుడు జవాబు చెప్పుకోడమూ ఏమంత కష్టంకాదు. అప్పుడు కాదు ఎప్పుడైనా మీరు అదృష్టవంతులే మీ వ్యాసమూర్తిగారు సమాజసేవలో స్థిరపడిపోయారు. ఇక మీరా? మెడిసన్ పూర్తి చేశారు. వ్యాధిపీడితులకు బాధ తగ్గించే

పవిత్రమైన వృత్తి మీది. మానవసేవకు అంకితమైన ఉద్యోగం మీది. ఇంత కన్న ఏంకావాలి? నాలాంటి దురదృష్టవంతురాలికి నిరంతర సేవాభాగ్యం ఎప్పటికైనా అందేనా? ఆ ఊసెత్తితే అమ్మా నాన్నా ఒంటికాలిమీద లేస్తున్నారు. ఎం. బీ. లో చేర్పించమని ఎంతో మొత్తుకుంటే ఉన్నచదువుకూడా మానిపించి యింట్లో కూచో బెట్టేరు. అప్పట్నుంచీ మరింత ఎక్కువగా నాకు సంబధాలు చూడ్డం ప్రారంభించారు. ఇప్పుడు మావాళ్ళు బెజవాడ వెళ్ళింది అందుకే. నేను నేనుగా ఏమీ చెయ్యలేనట. అదృష్టం అన్నది నాకు వేరే లేదట. నన్ను కట్టుకున్నవాడితో ముడిపడి ఉంటుందిట.'

'నిజం, నిజం.' అన్నాను నేను అప్రయత్నంగా. అంతే కాదు. ఉద్రేకంతో ఆమె రెండు చేతులూ పట్టుకున్నాను.

'గీతా, నిన్ను నా ప్రాణాధికంగా ప్రేమిస్తున్నానని నువ్వింకా తెలుసుకోలేదా? పవిత్రమైన నీ ఆశయానికి పటిష్ఠమైన ఆశ్రయం నేను నీ కివ్వలేనా?'

ఆమె నా చేతులు విడిపించుకోలేదు. ఆ ధైర్యంతో ఎడంచేత్తో ఆమె భుజం పట్టుకుని కుడిచేత్తో ఆమె గెడ్డం పట్టుకుని ముఖం పైకెత్తి సూటిగా ఆమె కళ్ళలోకి చూశాను. చూస్తూండగా అందమైన ఆ కళ్ళు అశ్రుపూరితాలయాయి. అలా ఎందుకు జరిగిందో అర్థం చేసుకొనే హడావిడిలో నేనుండి వెనక వాళ్ళమ్మా నాన్నా రావడంకూడా చూళ్ళేదు!

'ఆఁ ఆఁ! ఎవడ్రా అదీ? వదులు వదులు అమ్మాయిని, వదులు' అని కేశవరావు గారు గట్టిగా అరిచారు. నేను సిగ్గుపడి దూరంగా జరిగిపోయాను. గీత మొహం కప్పుకుని పెరట్లోకి పారిపోయింది.

'ఎవరూ? నువ్వేటోయ్ విజయకుమార్! అయినింట్లో పుట్టి ఏం బుద్ధులోయ్ యివీ! అమ్మాయిని ఒంటరిగా చూసి అవమానిస్తావా? ఈ అవకాశంకోసం ఎన్నాళ్ళనుంచీ చూస్తున్నావ్?'

నా నెత్తిమీద పిడుగుపడ్డట్టయింది. అవమానంతో క్రుంగిపోయి పక్కనున్న కుర్చీలో కూలబడ్డాను.

'అయ్యో, ఏమయిందే నా తల్లీ!' అని పెరట్లోకి కూతురిదగ్గిరకి వెళ్ళిన సుందరమ్మగారు పెద్ద గోలపెడుతూ మళ్ళీ వీధివైపు వచ్చేసింది.

'చేసిన సిగ్గుమాలినపనికి చివాట్లుపెట్టి సాగనంపక మర్యాదచేసి కుర్చీలోకూడా కూచోబెడతా రెందుకూ? మనం మనపిల్లని ఇవ్వలేదని మొదట్నుంచీ వాళ్ళ కేడుపే. ఆమధ్య సుభద్రమ్మగారు ఏవో పేరంటంలో నామీద విరుచుకుపడిందిట.

తెలిసినవాళ్ళు ఒకరు చెప్పేరు. తాహతూ, తారతమ్యం చూసుకోవద్దూ? ఆ వాసు గాడో ఎవడో వాడి ఆస్తంతా పడేసుకుని వాణ్ణి చల్లగా వెళ్ళగొట్టి - దాంతో యీయన గారిచదువు వెలిగించారు. ఇదీ మనప్రతాపం. తనకి పిల్లనివ్వలేదని తల్లీ తండ్రీ లేకుండాచూసి పిల్లని అవమానించడానికి వస్తాడా? పిల్ల నోటిమాట రాకుండా దుఃఖంతో కుమిలిపోతోందే... కొంచెమైనా మంచీ మర్యాదా నీతీ జాతీ...'

నే నిక భరించలేకపోయాను. లేచి గబగబా వీధిలోకి వచ్చేశాను. వాళ్ళమాటలు నన్నింకా వెంబడిస్తూనే ఉన్నాయి.

'ఏతప్పూ చెయ్యనివాడైతే నోరుమూసుకుని అలా చల్లగా జారిపోడం దేనికీ? సమయానికి మనం వచ్చాంగాని...తనకీ పెళ్ళికాని ఒక చెల్లెలు ఉందిగా...

మా ఫ్రెండుదగ్గిర హేండ్‌బ్యాగ్ తీసుకుని స్టేషను కెలా వచ్చిపడ్డానో తెలీదు. వెయ్యిసూదులతో ఒకమారు గుచ్చినంతబాధగా ఉంది తల. ఇటువంటి అవమానం జన్మలో ఎరగను. ఇంతటి అశాభంగం భరించేశక్తి నాకులేదు.

కేశవరావుగారూ, సుందరమ్మత్తా నాకు కొత్తకాదు. వాళ్ళకి మా కుటుంబంమీద ఎప్పుడూ మంచి అభిప్రాయంలేదు. గీత అభిప్రాయం ఏమిటి? విషబాణాలలాంటి అన్నిమాటలు తల్లిదండ్రులు నామీద వదులుతూంటే ఒక్క మాటకైనా అడ్డు కోకపోవడంలో ఆమె అంతర్యం ఏమిటి? ప్రేమించినవ్యక్తి ఎన్నాళ్ళయినా నాకు చిక్కుప్రశ్నగా మిగిలిపోవలసిందేనా? నిరీక్షణలో ప్రతిక్షణం నేను పొందుతున్న శిక్షకు అంతన్నది లేనేలేదా?

నే నామెను తాకినపుడు అశ్రుపూరితా లయిన ఆమెకళ్ళు చెప్పే భావం ఏమిటి? ఉన్న ఒక్క ఆధారమూ దూరమైపోతే ఎంత బాధపడిపోతామో అంత వ్యధా నిస్పృహా ఆ చూపుకి అర్థం అయితే దాని తాత్పర్యం 'ఏమిటి, మీరైనా మ రొక్కరైనా నన్ను అర్థం చేసుకుంటా రనుకున్నాను. ఇంతేనా?' అనా? ఆమె చేతుల్ని నా చేతుల్తో పట్టుకున్నపుడు నేను పొందిన అనుభూతి ఏమిటి? నాలో కలిగినవి వెచ్చవెచ్చని భావాలా? కాదు, ఎంతమాత్రం కాదు; చలనంలేని నదిలో చేపపిల్లలు యీదినట్టు, చల్లని చెట్టునీడలో లేడిపిల్లలు ఆడుకుంటున్నట్టు, చలించని రాతిని సముద్రపు కెరటాలు ఢీకొంటున్నట్టు.. మెత్తని ఆ స్పర్శ నేను కోరే శారీరక సుఖాల కన్నిటికీ ఛెళ్ళున లెంపకాయ కొట్టినట్టా?

డాక్టర్ని అయితేనేం గాక! మనిషి జీవించడానికి ఆరోగ్యమైన స్థితిలో ఉన్న ఒక గుండెకాయా, రెండు ఊపిరితిత్తులూ అతి ముఖ్యమని నా కా సంమయంలో అనిపించలేదు. అవేకాదు, నా క్రాఫింగు పాపిడిలో చివర లేచినిలుచున్న అన్నిటికన్న

ఎత్తైనవెంట్రుక చివరనుంచి అరిపాదం చర్మంవరకు నా శరీరమంతా కేవలం వ్యర్థమని అనిపించింది. మనిషి ప్రాణం తీసుకుపోవడానికి మృత్యువు వచ్చేది ఒక్కసారే. కాని, మనసు అనే మాయలో మమత అనే మత్తులో కలలు అనే అలలలో కాలం అనే కనీ కనిపించని కన్య ఆడించేదీ ఏడిపించేదీ ఎన్నిసార్లో!

తెగిపోయిన గాలిపటం ఎక్కడికి పోతుంది? గాలి ఎటు వీస్తే అటు. నేను మెయిల్లో కూచుని మెడ్రాసు వెళ్ళడమూ అలాగే జరిగింది. నాకు జరుగుతున్న ప్రాపంచిక విషయాలమీద ఏమాత్రమూ ఆసక్తి లేకపోయినా, పంచేంద్రియాలూ వాటిపని అవి చెయ్యక మానవుగా! దేశం దేశంఅంతా యుద్ధచైతన్యంతో నిండి పోయిందా అనిపించింది. ఏ ప్రయాణికుడి నోట విన్నా అదేమాట. ఏ స్టేషన్లో రైలాగినా అవేవార్తలు. ఆరోజు పేపరు కొనుక్కుందామన్నా దొరకనంత గిరాకీ పెరిగిపోయింది. మా కంపార్టుమెంటులో ఒకరిద్దరివద్ద ట్రాన్సిస్టర్సు ఉన్నాయి. ఎంత పల్లెటూరివాడయినాసరే ఆ క్షణం ఏం న్యూసు వస్తోందో చెవులొగ్గి వినవలసిందే.

నేను ఏరోజూ కారోజు పేపర్ చదివేవాణ్ణే అయినా, చదువూ పరీక్షలూ హడా విడిలో యిటీవల సరిహద్దులో జరిగిన అలజడివివరాలు అంతగా పట్టించుకోలేదు. నేనెంత అన్యచింతావిమగ్నుణ్ణయినా అవే విషయాలు రైల్లో ఒకరు చర్చిస్తూంటే అంతో యింతో ఆసక్తి చూపించక తప్పలేదు.

'ఈ మధ్య సరిహద్దు ప్రాంతాల్లో పొరుగుదేశం పెట్టిన అల్లరీ చూపించిన దురా క్రమణ బుద్ధీ తక్కువదేం కాదు. కాశ్మీరు వేసవికేంద్రమైన గుల్మర్గ్ చుట్టుపట్ల మొట్ట మొదట ఈ అల్లరి ఆరంభ మయిందని అంచనాలు వేస్తున్నారు. ఆ నెల మొదట్లో కాబోలు గ్రామస్థులు అనుకున్నారు: 'ఇదేమిటి. ఎప్పుడూ ఎరగని ఇన్ని కొత్త మొహాలు ఊళ్ళో కనిపిస్తున్నా యేమిటీ' అని. కొందరు బుద్ధిమంతులైన కాశ్మీరీలు అధికారులకు ఈ వర్తమానం అందజేశారు. కాశ్మీరు ప్రభుత్వం తక్షణచర్య తీసు కునేలోగానే అప్పుడే అనేక ముఠాలు మన సరిహద్దురేఖ లోపలివైపున యించు మించు పదిమైళ్ళు చొచ్చుకువచ్చి అక్కడక్కడ మకాములు ఏర్పరుచుకున్నారు. కొందరు శ్రీనగర్ విమానాశ్రయంవైపు, మరికొందరు రహదారీని అడ్డంగా తవ్వెయ్యడానికి. అంతా ముందు కుట్ర చేసి ఒక్కమారు దెబ్బతీద్దామనీ, ఆంతరంగి కంగా మతకలహాలు రేపి, కాశ్మీరును కొల్లగొడదామనీ. కాని మన దళాలేనా అంత చేతకానివి? మన విమానాశ్రయాన్ని రక్షించుకున్నాయి. మన గస్తీదళాలు శ్రీనగర్ చుట్టూ మరింతగా పటిష్ఠం చెయ్యబడ్డాయి. ఇలా ఒకచోట వేసుకున్న కుతంత్రం

నాశనం కావడంతో భారీఎత్తున కాల్పులు సాగించి, అంతర్జాతీయ సరిహద్దు దాటి, ప్రచ్ఛన్నసమరాన్ని బాహాటంగా యుద్ధమని ప్రకటించారు.'

నా ప్రక్కనే కూర్చున్న మరొక ముసలాయన అన్నారు 'నిరంకుశ ప్రభుత్వాని కున్న దృష్టిలోపమే యిది. ఏమిటంటే శాంతికాముకదేశాన్ని చేతకాని దేశంకింద జమకట్టడమే ఆనాడు పోట్లాటకి వచ్చిన రోగమూ ఇదే. మూడేళ్ళ



క్రిందట చైనీయులకు పుట్టి అగ్నిపర్వతంలా లోలో శాఖలు దింపుకుంటున్న విష బీజమూ ఇదే. కాని మనవాళ్ళు ఎంతచక్కని పాఠం చెబుతున్నారు! ఎంత క్రమ శిక్షణ పాటిస్తున్నారు ఆనాటి మన పూర్వుల ఆదర్శాలకు యీ ఇరవయ్యో శతాబ్దంలోకూడా నిలబడి నెగ్గుకురావడం ఎంత ఘనకార్యం! ఎంతగొప్ప విజయమిది!!'

అందరు ప్రయాణీకుల్లో ఒక్కసారి సమరోత్సాహం పెల్లుబికింది పట్టలేని ఉద్రేకోత్సాహాలతో అందరూ ఒక్కసారి జయజయధ్వానాలు చేశారు. 'జై హింద్, జై జవాన్' అని అరచే అరుపుల్లో కెనేడియన్ ఇంజను కూతకూడా ఎవరికీ వినబడ లేదు. వ్యక్తిగతమైన నా వ్యధలూ బాధలూ ఒక్కసారి ఎక్కడికి పోయాయో తెలి యదు. ఒళ్ళుతెలియకుండా కేకలు వేశాను కుడిచెయ్యి ఎత్తి పిడికిలి బిగించి ఉద్రేక ఉత్సాహాలతో అరచాను.

## 6

ఉక్సిమీద మాధవసేవాసదనానికి చేరుకున్నాను. ఊరికి దూరంగా, ప్రశాంతంగా ఉన్న అయిదెకరాల కొబ్బరితోటలో అక్కడక్కడ నిర్మించబడిన కుటీరాల గుంపు అది అనుకోకుండా అక్కడ ప్రత్యక్షమైన నన్ను చూసి మా వ్యాసమూర్తి ఆశ్చర్యపోయాడు. వాడిలో నాకు ఆశ్చర్యం కలిగించిన విషయం ఎన్నేళ్ళయినా ఏమాత్రమూ మార్పు లేకపోవడం. అక్కడికి నేను ఎందుకు వచ్చానో వాడు అడక్కుండానే నాకు తోచిన ధోరణిలో కల్పించి చెప్పేను. వాడు అడ్డుప్రశ్న లేపి వెయ్యలేదు. నేను చెప్పింది ఎంతవరకు నమ్మేడో ఆ మొహం చూస్తే నాకు బోధ పడలేదు.

'చదువన్నది పూర్తయిందా?' అన్నాడు.

'అయింది జ్ఞానమన్నది ప్రారంభమయిందికూడా!' అని ఆ జవాబుకు నేనే ఆశ్చర్యపోయాను. నిర్మలమూ, నిశ్శబ్దమూ అయిన అక్కడి వాతావరణమే నన్నలా అనిపించిం దనుకున్నాను. అలా అంటూంటే నా కళ్ళమ్మట గిర్రున నీళ్లు తిరిగాయి

'కఠోరమైన కర్తవ్యనిష్ఠకేగాని కన్నీళ్ళ కిక్కడ తావులేదు.' అన్నాడు వ్యాసమూర్తి కఠినంగా.

'కాని కనపడకపోయినా కన్నీళ్లు ఉండొచ్చు. కళ్ళతో చూడలేని గాయాలు ఉండొచ్చు. వాటిమాట?'

'వేదన చాలదు. సాధన అవసరం,' అంటూ నా జవాబుకి ఎదురు చూడకుండా ఏదో పనిమీద వెళ్ళిపోయాడు.

అక్కడ అంతా ఓ వారంరోజులు ఉన్నాననుకుంటాను. ఆ కార్యక్రమమంతా పరిశీలకుడిగా కాక పరివ్రాజకుడిగా చూశాను. అంగవిహీన శరణాలయమూ, కుష్ఠు వ్యాధి నివారణ కేంద్రమూ, భక్తి గ్రంథమాల అనబడే లైబ్రరీ, వేదపాఠశాలా, కళాకేంద్రమూ – యివి మాధవసేవాసదనంలో కొన్ని అనుబంధకుటీరాలు. ప్రతి రోజూ ప్రార్థనలు, భక్తిబోధనలు జరుగుతాయి. మతకులవర్గభేదం లేకుండా, ఎవరి కే ఆపద జరిగిందని తెలిసినా శక్తికొలదీ సేవాకార్యక్రమాలద్వారా ఈ సంస్థ ఆదు కొంటుంది. నేను అక్కడికి వెళ్ళిన సాయంకాలమే రక్షణనిధి వసూలు చేసుకుని సేవాదళం వాలంటీర్లు సేవాసదనానికి తిరిగివచ్చారు.

'అమ్మ నిన్ను పిలుస్తోంది' అన్నాడు ఒకరోజున మా వ్యాసమూర్తి.

'నిజమే, పదిపదిహేను రోజు లయిపోయింది ఇల్లు విడిచి. ఒక ఉత్తరమైనా రాశాను కాను' అన్నాను నాలో అనుకున్నట్టు. వ్యాసమూర్తి చిరునవ్వుతో నా వైపు చూశాడు.

'అమ్మ అంటే నీ అమ్మ సుభద్రమ్మ అని నా ఉద్దేశం కాదు!'

నా ఆశ్చర్యాని కంతులేకపోయింది.

'నీకూ నాకూ అందరికీ అమ్మ, మన అమ్మలందరికీ అమ్మ. మనల్ని కని కనిపెట్టే మన దేశం, మన భారతమాత. మనదీ ఒక జాతి అనీ, మనకీ ఒక సంస్కృతి ఉందనీ, తలెత్తి మనం నలుగురిలో చెప్పుకోవలసిన మన పుణ్యమూర్తి మన ఆర్యభూమి. అమ్మ ఆపదలో ఉండి నిన్ను పిలుస్తోంది.' యుద్ధంలో చేరమని మా వ్యాసమూర్తి నన్ను ప్రోత్సహిస్తున్నాడన్నమాట. నాకూ క్కడా నవ్వు రావడానికి కారణముంది మరి.

'గాలి వీచడంలో, నీరు ప్రవహించడంలో, పక్షుల కిచకిచలలో, ప్రకృతి చేసే మృదుసవ్వడులు తప్ప, నిశ్శబ్ద వాతావరణంలో నిర్మలంగా ఉండే ఇంతటి ప్రశాంత ఆశ్రమసీమలనుండి నువ్వేనా వాసూ నన్ను యుద్ధభూమికి పంపుతున్నది?'

వ్యాసమూర్తి స్పష్టంగా, స్వచ్ఛంగా చెప్పిన జవాబు నే నెప్పుడూ మరువలేనిది. 'అవును మనం శాంతిప్రియులం. అహింసాప్రియుడైన అశోకుని ధర్మచక్రం మన పతాక – చరిత్రలో పతాకశీర్షిక. అయితే – దాని అర్థం అహింసావాదులు అసమర్థులనా? శాంతి స్థాపకులూ, సత్యకాముకులూ అయిన గాంధీ జవహరులు మనకు సదా స్మరణీయులు. అయితే – దాని అర్థం భారతీయులు పనికిమాలినవా రనా? మనం ఎవరిమీదా కత్తి కట్టలేదు. మన ప్రతిష్ఠ ఆపదలో ఉంటే మాత్రం

అడ్డుకొని తీరతాం. ఎవరి పరిధిలో వారు, ఎవరికి చేతనయినంత వారు దేశమాతక రుణం తీర్చుకోవలసిన సమయం ఆసన్నమైంది.'

'అయితే నన్నిప్పు డేం చెయ్యమంటావ్ వాసూ ?'

'ఎందుకూ పనికిరానివా రనుకొనే పసిపాపలూ, స్త్రీలే అనేకవిధాల దేశసేవ చేస్తూంటే యిన్నాళ్ళ నీ చదువుని ఉపయోగించవలసిన తరుణం ఇదేనని నీకు గుర్తు అవడంలేదా ? ఒక సైనికుడయితే పదిమంది శత్రువుల్ని చంపుతాడు. ఒక సైనిక వైద్యుడైతే వందమంది మిత్రుల గాయాలకు కట్టుకడతాడు. నీ కర్తవ్యం ఎంత గురుతరమైనదో నువ్వే నిర్ణయించుకో.'

నిజానికి నే నేమి నిర్ణయించుకోలేకపోయాను ఆ మర్నాడే మా అమ్మకి సీరియస్‌గా ఉందని టెలిగ్రాము వచ్చింది. మా వ్యాసమూర్తితో చెప్పనైనా చెప్పకుండా నేను రైలెక్కేశాను

*          *          *          *          *

చేసినపనికి దార్లో అనేకవిధాల సిగ్గూ, అవమానమూ దహించివేస్తున్నా, దేశం యొక్క క్లిష్టపరిస్థితి ప్రతిహారుని బాధ్యతా చెవులు హోరెత్తుతున్నట్టు వినిపిస్తున్నా- అమ్మ కెలా ఉందో, హఠాత్తుగా ఏం జబ్బు చేసిందో, కళ్ళతోనయినా చూడగలనో లేనో అనుకుంటూ యిల్లు చేరుకున్నాను. అమ్మని చూసి నా ఆశ్చర్యాని కంతులేక పోయింది – అమ్మ మామూలు ఆరోగ్యంతో ఉంది !

నాన్న అన్నారు· 'ఎప్పుడూ లేంది ఇన్నాళ్ళు ఎక్కడికి వెళ్ళిపోయావో అని మీ అమ్మ ఒకటే బెంగపెట్టుకున్నుంది విజయా ! విశాఖపట్నానికీ, మద్రాసుకీ ఎక్స్ప్రెస్ టెలిగ్రాంలు యిస్తేగాని ఊరుకుందికాదు. ఐనా ఎక్కడి కెడితే అక్కడ ఉండిపోవడమేనా ? ఒక్క ఉత్తరమ్ముక్క రాస్తే నీసొమ్ము ఏంపోయింది ? అది గాక అనుకోకుండా అప్పటికప్పుడు కాసులమ్మకి పెళ్ళి కుదిరింది. నీకు ఎక్స్ప్రెస్ డెలివరీ ఉత్తరం రాశాం, అందలేదూ ? ఎల్లుండే పెళ్ళి. అన్నట్టు వాసు ఎలా ఉన్నాడోయ్ ?'

అమ్మ వాసుగురించి మరీమరీ ఆడిగింది. నేను చెప్పేను. పెళ్ళికి రమ్మని వాడికి టెలిగ్రాముకూడా యిప్పించింది. అదీగాక నేనూ, నాన్నా ఉత్తరంకూడా రాశాం. వాడు రానూలేదు జవాబూలేదు ! దాని పెళ్ళయినంతసేపూ అమ్మ వాసుని తలచుకొని కళ్లు తుడుచుకుంటూనేఉంది. మా బావ సుగర్‌ఫ్యాక్టరీలో అసిస్టెంటు కెమిస్టుగా ఉన్నాడు. వాళ్ళది బాగా పెద్దకుటుంబం. ఇదే పెద్దకోడలు. పెళ్ళి అవగానే కార్యం చేసేసుకుని వెంటనే కాసులమ్మని కాపురానికి తీసికెళ్ళిపోయారు. మాఅక్క




దానితోకూడా వెళ్ళి ఒక వారంరోజులు అక్కడుండి, అక్కణ్ణుంచి వాళ్ళఊరు – బిలాసపూరు వెళ్ళిపోయింది. మీకు చెప్పలేదేమో మా పెద్దబావకి రైల్వేలో పని.

గీతనుంచి ఉత్తరం వచ్చింది ఒకనాడు. ఆతృతగా చించాను. ఆ రోజు నేను అనకాపల్లిలో వాళ్ళింట్లోంచి వెళ్ళిపోయేముందు నేను పొందిన అవమానానికి తన తల్లితండ్రుల తరఫున తన్ను క్షమించమని మొట్టమొదట రాసింది గీత.

'మిమ్మల్ని చూస్తే మొట్టమొదట్నుంచీ పవిత్రమైన భ్రాతృసంబంధం తప్ప నాకు మరొక ఆలోచనేలేదు. అంతేకాక, మీకు నాపైన మరొకరకమైన భావం ఉందని – అదలా ఉదయించి వికసించడానికి నాకు తెలియకుండా నేను దోహదం చేశానని కలలోకూడా అనుకోలేదు. విశాలమైన సేవాదీక్షకీ, సంకుచితమైన సంసారిక జీవనానికీ పొత్తుకుదరదని నా ఉద్దేశం ఎప్పుడూ అలాంటి భావాలే నాలో కలగలేదు. పద్దెనిమిదేళ్ళ వయసులో యిటువంటి మనస్తత్వం ఆశ్చర్యమైతే అవుగాక, నా విషయంలో మాత్రం ఇది నిజం. అంతవరకు ఆత్మీయుల్లా ఉన్న మీరు ఒక్కసారిగా ఏదో కొత్తగా చూసి, కొత్తమాటలు ఉపయోగిస్తూంటే, నిజంగా నేను బెదిరిపోయాను. చేతికందినది ఏదో పోయినట్టు చెప్పలేని దుఃఖం ముంచుకొచ్చింది. ఒక పట్టాన నేను మామూలు స్థితికి రాలేదు. వచ్చాక వీధిలోకి వచ్చి చూస్తే మీరు

లేరు. మా అమ్మా నాన్నా మాటల్నిబట్టి మిమ్మల్ని వా రేదో అనరాని మాటలని పంపించివేసినట్టు తెలుస్తోంది. దీని కంతటికీ నేనే కారణం: నన్ను క్షమించండి.'

ఆ తరవాత ఆమె రాసిన సంగతులు నాకు కొత్తవి. ఆ రోజు గీత తల్లితండ్రులు యింటికొచ్చారే - వస్తూనే ఏదో కలకత్తా సంబంధమట, నిశ్చయించుకు వచ్చేశారట. గీత అవుననసూ లేదు, కాదననూ లేదు!

'ఎందుకే అమ్మాయ్, అలా వెర్రిచూపులు చూస్తావ్? ఆ మధ్య నిన్ను చూడ్డానికి వచ్చాడే - కలకత్తాలో పని చేస్తున్నానని చెప్పలేదూ - అతనే. ఏం, నీ కేం నచ్చలేదా?'

గీత మాటాడలేదు.

'అసలు పెళ్ళే చేసుకోవా యేమిటే?!' అని సుందరమ్మగారు నిలదీసింది. గీత కళ్ళల్లో నీటిచుక్కలు నిలిచాయి.

'శుభమా అని అదేమిటే తల్లీ! అంత పెద్ద సంబంధం కుదిరిందని మేం పొంగి పోతూంటే ... అయ్యోరామ! ఎక్కడ పోగయిందండీ ఈ శుద్ధ బుద్ధావతారం,' కేశవరావుగారు సుందరమ్మగార్ని ఆగమనీ, అక్కణ్ణుంచి వెళిపొమ్మనీ సంజ్ఞ చేశారు. ఆవిడ గుమ్మంలో నిలబడ్డ కొడుకుని తీసుకుని గబ గబా లోపలికి వెళ్ళి పోయింది. మొదట్నుంచీ గీతకి వాళ్ళమ్మకన్న నాన్నగారిదగ్గరే చనువు ఎక్కువట.

'చూడమ్మా, నీ కిష్టంలేందే పెళ్ళిచెయ్యం. అసలు నీ అభిప్రాయ మేమిటో నాతో స్పష్టంగా చెప్పు. పెళ్ళి చేసుకోకుండా ఏం చేద్దామని?'

గీత గదిలోకి వెళ్ళి ఆరోజు పేపరు తీసుకొచ్చి ఒక పేజీ వాళ్ళ నాన్నగారికి చూపించింది. 'చూడునాన్నా! వియత్నాంలో యుద్ధం మరీ ఘోరరూపం దాల్చిందిట. పాపం! ఎంతోమంది కాళ్ళూ చేతులూ లేనివాళ్ళయిపోయారట. ఎంతోమంది రెడ్‌క్రాస్ మహిళలు సమయానికి ఆదుకుని వాళ్ళ గాయాలకు కట్లుకట్టి ధైర్యం చెప్పేరుట. ఇంటింటికీ వెళ్ళి క్రైస్తవమతప్రచారిణులు ఎంతోడబ్బు పోగుచేసి వాళ్ళ కుటుంబాలకు పంపించారట. ఇంతకన్న జన్మకి సార్థకత ఏముంది నాన్నా ... నేనూ నా కుటుంబమూ నా పిల్లలూ అని కూచుంటే వీళ్ళంతటి మహోత్తమమైన సేవ చెయ్యగలిగేవారేనా నాన్నా?'

కేశవరావుగారు కూతురివైపు లాలనగా చూస్తూ అన్నారు: 'వీళ్ళు చేసినకృషి అన్నివిధాలా శ్లాఘించవలసిందే. లభించే అవకాశాలనుబట్టి సేవాధర్మం యొక్క తత్వం మారుతూంటుందమ్మా గీతా! ఇంతకీ ఈ సంఘసేవికల కందరికీ జీవితంలో మరొక అవకాశం లేక ఆత్మాంకితం చేసుకోలేదని నువ్వెలా చెప్పగలవ్?'

'అలా కాదనిమాత్రం నువ్వెలా చెప్పగలవ్ ?'

ఆయన నవ్వుతూ అన్నారు: "మనకి లభించే విజ్ఞానపరిమితినిబట్టి మన అంచనాలు ఉంటాయి. ఎక్కడైనా సంప్రదాయాన్నిబట్టీ దేశకాలరీతుల్నిబట్టీ సేవాధర్మం మారుతూఉంటుంది. ఇంతకీ సాంఘిక సేవకి సంసారజీవనం ఎలా అడ్డొస్తుందో నా కేం అర్థం కావడంలేదు. స్వధర్మాన్ని విడిచిన, మించిన సందర్భం అంటూ ఎక్కడుంది? సంఘసేవికల్లో చాలామంది సంసారజీవితంకోసం తహతహలాడుతున్నవారే... ఆశ్రయాన్ని కోరే స్త్రీ మొదట తన స్థానాన్ని సుస్థిరం చేసుకుంటేనే ఎవరికైనా సహాయం చెయ్యగలదనుకుంటాను.' గీత తను చెప్పేది జాగ్రత్తగా వినడంచూసి ఆయన ఇంకా చెప్పేరు: 'మీ అమ్మ, అమ్మమ్మ – వీళ్ళ జీవితాలన్నీ నిరర్థకమని అనగలమా? మీ అమ్మమ్మ నెవరు పిల్చినా వాళ్ళని కాదనకుండా వెళ్ళి పెళ్ళిపనులు చేసేది. ఊరగాయల పాళ్ళు వేసిపెట్టేది. నొప్పులు రాగానే వెళ్ళి పురిటిస్నానం చేయించివచ్చేది, ఇరుగు పొరుగుల కెవరికైనా సరే. ఇదంతా సాంఘిక సేవ కాదంటావా? ఈ క్షణాన నువ్వు ఏనర్సు ట్రెయినింగుకో వెడితేమాత్రం! ఎల్లకాలం అవివాహితగా ఉండి నీ శరీరధర్మాన్ని కాదనగలవా? సాంఘిక విమర్శల్ని కాదనే మనోవిగ్రహమూ, ఆత్మధృతీ నీ కున్నాయా? ఆలోచించి చెప్పు.'

గీత మాటాడలేదు.

'మాకా ఏ పదిమందోలేరు; నువ్వూ, బాబిగాడూను. నీమీద ఎన్నో ఆశలు పెట్టుకున్న మీ అమ్మను కాదని మరెవరూ తొక్కని దారివిపట్టి నువ్వు జయించి రాగలవా? నీ సాంఘిక సేవ నీ కన్నతల్లి మనసు నొప్పించడంతోటే ప్రారంభమౌతుందా?'

గీత కళ్ళనీరు నింపుకుంది.

'చూడు తల్లీ... తల్లిదండ్రులకన్న నీ క్షేమం కోరేవారుండరు. నీమనసు చాలా మెత్తనిది. కాని నువ్వు సుఖపడాలన్నా యింకొకరికి సుఖం పంచిపెట్టాలన్నా మంచితనం, మెత్తదనంకన్న లోకజ్ఞానం ఎక్కువ అవసరం. దేశాన్ని స్వర్గం చేసేముందు నీయిల్లు నందనవనం చేసుకో."

కేశవరావుగారు సుందరమ్మగార్ని కేకేశారు: "ఇదిగో, ఏమోయ్! ఇంతలో ఎక్కడికి పోయావ్? ఇలారా ... నీకూతురు పెళ్ళికి ఒప్పుకుంది. మరి ఎంత తొందర్లో ముహూర్తం పెట్టిస్తావో, నీదే ఆలశ్యం.'

సుందరమ్మగారు, కూతురు బుగ్గలు పుణికింది. ఇవన్నీ వివరంగా రాస్తూ గీత ఆఖర్న రాసింది:

'కనీసం ఒకరికి సంతోషం కలిగించి నీ పని ఆరంభించు — అన్న సూత్రం ప్రకారం, కన్న తల్లిదండ్రులకు ఆనందం కలిగించేటట్టు — మొన్న దశమీ శనివారంనాడు తిరుపతిలో వెంకటేశ్వరస్వామి సన్నిధిలో మా వివాహం అతి వైభవంగా జరిగింది. గృహిణిగా నాకు కావలసినవారి సందర్శ్నం ప్రతి నిముషమూ ఆనందింపజెయ్యడానికి ప్రయత్నిస్తాను. కాని నేను చేరుకోబోయే గమ్యస్థానానికి నా సంసారజీవితం మొదటిమెట్టు మాత్రమే. విశ్వవిస్తృతమైన సేవాభాగ్యం ప్రసాదించమని మీరు నాతోపాటు భగవంతుణ్ణి ప్రార్థించండి విజయకుమార్!'

* * *

నాకు ఊపిరి తిరక్కుండా పెళ్ళిసంబంధాలు రాసాగేయి. ఎంత కావలిస్తే అంత కట్నం యివ్వడానికి సిద్ధంగా ఉన్నామనీ, అవసరమైతే పైచదువులు చదివించడానికి ఆర్థికంగా సహాయం చెయ్యగలమనీ...,ఇలా అనేకరకాలు. నేను ఎప్పటికప్పుడు ఎవేవో చెప్పి తప్పించుకుంటూవచ్చాను. 'ఇష్టం లేకపోతే పిల్లని చూసిరా...మనం అనుకున్నప్పుడల్లా మంచి సంబంధాలు రావు — గీత పెళ్ళికి మనకి శుభలేఖైనా పంపలేదు. వాళ్ళని తలదన్నే సంబంధం తీసుకొస్తాను,' అన్న అమ్మ మాటకి తాటిప్రమాణాన లేచిపోయాను: 'నా ప్రాక్టీసు వ్యవహారమేదో తేలేలోగా మళ్ళీ యీ ఊసు ఎత్తేవంటే మళ్ళీ కనపడకుండా పారిపోతాను.' నా దగ్గరయితే ఆ ప్రసక్తి మానేసింది కాని నాన్నదగ్గర రోజుకి ఒకమాటయినా ఆ ప్రసక్తి లేనిదే అమ్మ ఉండలేకపోయేది.

కన్నకూతుళ్లు యిద్దరూ అత్తారిళ్ళకు పోగా, పెంచినవాడు మరి కనిపించకపోగా, మాట్లాడ్డానికేనా వీల్లేనంతగా నేను కట్టుదిట్టం చెయ్యగా ఎంతసేపు నడుం వాల్చినా తరగని మధ్యాహ్నపువేళల్లో మా అమ్మ కన్ను మూస్తుండగానే...

...కాదు, చూస్తుండగానే ఆ మధ్య హాల్లోకి ఒళ్ళుగా ఉన్న ఓ తెల్లని పిల్ల వచ్చేస్తుంది. చేతినిండా గాజులు, కొప్పునిండా పువ్వులు, కళ్ళనిండా కాంతులు. 'అదేం అత్తయ్యా! అలా పడుకున్నారు, లేవండి? చిక్కుడుకాయలు ఒలుద్దాం' అంటుంది. చిక్కుడుకాయలు జంగిట్లో పోసుకుని యిద్దరూ ఒలుస్తూండగా 'అయ్యో పాపం, తలుపుకి జారగిలబడి ఎలాకూచున్నారో; పెద్దకాలం...నడుం నిలబడదు మరి...పాపం పడుకున్నవారిని ఎరక్కపోయి పిలిచాను ఒకర్తైనీ అయితే అదోలా ఉంటుంది నాకు; అందుకని ఉండబట్టక పిలిచాను' అంటుంది 'మహాలక్ష్మి'.




ఎంత అభిమానం! 'అయితే అత్తయ్యా! చిక్కుళ్ళు ఏం చెయ్యమన్నారూ? వేయించుకుందామా, లేకపోతే పులుసూబెల్లం పెట్టి ఒండుకుందామా?' లక్షాధికార్ల ఇంట్లోంచి వస్తేనేం, సాంప్రదాయం ఎక్కడికి పోతుంది వీసమెత్తు గర్వమైనా ఉన్నదా పిల్లకి,...ఎంత చిన్న విషయమైనా తనని అడగందే చెయ్యదే! అమ్మ ఆనందం భరించలేక కళ్లు తెరుస్తుండగనే

...కాదు, మళ్ళీ మూసుకున్నా రాదు అంత చక్కని కల!

పిచ్చిఅమ్మ అక్క డలా ఊహించుకుంటూంటే, వెర్రినాన్న యిక్కడ స్నేహితుడితో చెప్పుకునే అంచనాలు ఇలా ఉంటాయి

'ఇక్కడ కుర్చీలో మా అబ్బాయి కూచుంటాడు. ఇలా పేషెంట్లు వచ్చి యీ సందులోంచి వెళ్ళిపోతుంటారు. పక్క పెరడుకూడా కొనేసి రెండు గదులు వేయిస్తే కొద్దిమంది రోగులయినా యిక్కడ ఉండడానికి వీలవుతుంది అస్పత్రీ యిల్లూ ఒకచోట ఉంటే భరించడం కష్టమేమో! కష్టాని కేముంది, ఉన్న ఒకడూ కళ్ళెదుట ఉంటాడు అయినా అటూయిటూ తిరుగుతూంటే వాడి ఆరోగ్యం పాడై పోదూ? మందులకి మొదట్లో రెండు బీరవాలు చాలనుకుంటాను. అన్నట్టు నాకు మతే లేదు. ఆపరేషనుబల్ల ఒకటి ఉండొద్దూ? వీధివసారాలో పేషెంట్లు కూచోడానికి రెండు బెంచీలు సరిపోతాయా? ఏకంగా పురమాయించుకుంటే కలప

కలిసొస్తుంది. ఓ కాంపౌండరూ, మరో నౌఖరూ, ప్రారంభంలో యిద్దరుంటే చాలంటావా? ఏదైనా భారీఎత్తున మొదలెట్టాలి. మొదట్లో కక్కుర్తిపడితే దెబ్బ తినేస్తాం బాగుంది, అసలుసంగతి మరిచేపోయాను. వీధిలో బల్లమాటో? కర్రదా, ఇత్తడిదా? ఛఛ...కర్ర దేం బాగుంటుంది మంచి నగిషీఅక్షరాలతో తళతళ మెరవాలి మా అబ్బాయి పేరు!' నా ప్రైవేటుప్రాక్టీసు విషయమై ఊపిరి తిర క్కుండా యింట్లో పనులు జరుగుతున్నాయి

'ఒక్క ఏడాది వీడి ప్రాక్టీసు చూసి నేను రిటైరయిపోతాను.' అని నాన్న అంటే, అమ్మ ముసిముసినవ్వు నవ్వుతూ అంది 'మీకూ నాకూ రిటైరవడ మంటూ ఉండదు.'

'మధ్య నువ్వు రిటైరవడ మేమిటి, ఉద్యోగం సద్యోగం లేనిదానివి!'

'బాగుంది, ఇంట్లో నేను వంటవుద్యోగం చెయ్యకపోతేనే యిన్నాళ్లూ మీరు బయటఉద్యోగం చేశారు కాబోలు! ఇదిమాత్రం శాస్త్రం కాదా! మీరు ఊం వందలూ వేలూ తగలేసి డింకీలు కొట్టికొట్టి డిగ్రీలు తెచ్చుచుంటారు మేం కాణీ ఖర్చు లేకుండా కేవలం చూసి నేర్చుకుని గౌరవపట్టాలని పొందుతాం.'

'ఏమో ఆశాస్త్రంలో మాత్రం మీకు పెద్ద పేరేముంది? నలభీమపాక మన్నారుగాని దమయంతీద్రౌపదీ పాకం అనలేదుకదా!'

'అరాసినవాడు మొగాడయితే యిం కెలా రాస్తాడు మరి?'

'బాగుంది కాని మన కిక రిటైరవడం లేదంటావేం?'

'తీరిక ఉండొద్దూ?'

'నీ బదులు కోడలు యింట్లోపనీ, నా బదులు కొడుకు పైపనీ సవరిస్తే కాళ్లు జాపుకుని కృష్ణారామా అనుకోక మన కేం పనే?'

'బాగుంది కదూ? ఏళ్లు గడిచినకొద్దీ బిలబిలమంటూ పావురాల గూడులాగ యిల్లంతా మనవలతో మనవరాళ్ళతో నిండిపోదూ? అలోపొలోమంటూ గుసగుస మంటూ కిచకిచలాడుతూ పడుతూ లేస్తూ ఆగిలిగిచ్చకాయలు మనల్ని నిలబడ నియ్యొద్దూ?'

నాన్న నవ్వేరు. అంతకన్న గట్టిగా నేను నవ్వేను నవ్వుతూంటే నా హృదయం లోలోన ద్రవించిపోయింది. ఆ అమాయకజీవుల ఆనందాన్ని అడ్డుపెట్టడానికి నా కేమి హక్కుంది? అనిపించింది ఆవాళ నింపుదామనుకున్న అపికేషనుఫారాలు అప్పటికి వాయిదా వేశాను అవి చూస్తేనే గుండె దడదడ లాడుతోంది!

గీతదగ్గర్నుంచి మరొక ఉత్తరం వచ్చింది. తన కొత్తకాపురంలో తొలి రోజులు ఎలా గడిచాయో వివరించి రాసింది ఇదివరకు ఉత్తరంకన్న బాగా పెద్దదే.




'మేము కలకత్తాలో ఉంటున్నామనీ, ఆయనకి ఛటర్జీ ఆటోమొబయిల్సు అనే ప్రైవేటు ఫర్మ్‌లో నెలకి వెయ్యి రూపాయిలు జీతంగల ఉద్యోగమనీ మీరు వినే ఉంటారు అత్తగారూ, మామగారూ, యిద్దరుమరుదులూ మాతోపాటే మా సొంత భవనంలో ఉంటున్నారు మేమూ యిళ్ళూ వాకిళ్ళూ తోటలూ దొడ్లూ బాగా ఉన్న వాళ్ళమేగాని యిన్నిరకాల సౌఖ్యాలూ సదుపాయాలూ ఏరగం మాకంటె అనేక విధాల ఉన్నవాళ్లు వీళ్ళు.

ఆయ నెందర్నో జమీందార్ల పిల్లల్ని చూశారట నన్ను చూసినతరువాత వాళ్ళ అంతస్థుకు మేం అందకపోయినా – మరొకపిల్లని చూడ్డానికి ఒప్పుకోక నన్నే పట్టుపట్టి చేసుకున్నారట

అందరికీ వేరే వేరే గదు లున్నాయి. మాకు వీధివైపు మేడమీద విశాలమైన గదులు వేరే ఉన్నాయి. మనం కదలక్కర్లేకుండా అన్నీ దాసీవాళ్ళే కూచున్న చోటికి తీసుకొస్తారు. మా అత్తగారూ, మామగారూ మరదులూ అందరూ చాలా మంచివాళ్ళు. ఆయన సరేసరి – నన్ను కాలు కింద మోపనియ్యరు. నా ముఖంలో లక్ష్మీకళ ఉందిట. మా అత్తగారు నన్ను లక్ష్మి అని పిలుస్తారు. ఆయన కళా అంటారు.

మా చిన్నమరిది శ్యాంప్రసాద్ చాలా ముద్దొస్తుంటాడు. నేను రాగానే వాణ్ణి ముద్దెట్టుకుని చంకనేసుకున్నాను.

'అదేమిటి కళా, దింపు దింపు... అసలే అతినీర్సంగా వున్నావు. వాడు చూస్తే దుబ్బులా ఉన్నాడు. కళ్ళు తిరిగి పడిపోగలవు. వెంటనే దింపు. బాగుంది కర్మ!' అన్నారు.

ఇంకో గడియకి ఆయన బూట్లు నేను పాలిష్ చేస్తూంటే, మా పెద్దమరిది అటొచ్చి: 'ఛ ఛ! వదినా, అదేంపని! వెంటనే లేస్తారా అన్నయ్యని పిలవమన్నారా? ఇలాంటి పనులు చెయ్యడానికి మీ కేం ప్రారబ్ధం!' అన్నాడు.

ఆ సాయంకాలం తోటలోకి వెళ్ళి మల్లెమొగ్గలు కోసుకుంటూంటే 'పనిమనిషి కోసి దండ గుచ్చిపెడుతుందమ్మా లక్ష్మీ! ఇవాళ నువ్విలా అలవాటు చేశావంటే నెత్తికెక్కి కూచుంటుంది ... ఇంకా అలా చూస్తావేం, లేచిరా, నీ కెందుకా దురవస్థ!' అంది మా అత్తగారు.

ఆ రాత్రి గదిలో బొత్తిగా పాలిపోయిన మొహంతో కూచున్నాను. 'పిల్లాణ్ణి ఎత్తుకోవడం కర్మ! ఇంట్లో పని చేసుకోవడం ప్రారబ్ధం! మనసకై మనం పువ్వులు కోసుకోడం దురవస్థ! భగవంతుడా! నా ప్రత్యణువూ ఎవరికైనా ఏ ఉపకారమేనా చేద్దాం అని కొట్టుకుపోతూంటే, నా పనులుకూడా నేను చేసుకోనోచుకోని యిక్కడ పడేసి నవ్వుకొంటున్నావా!' అని విలపించాను.

'అదోలా ఉన్నావేం? మీవాళ్ళమీద మనసయిందా?' అన్నా రాయన.

'ఏం లేదండీ!' అని కొట్టిపారెయ్యడానికి ప్రయత్నించాను.

'లేకపోవడ మేమిటి? నీ మొహంలో బెంగ స్పష్టంగా కనిపిస్తోంది. ఇక్కడ నీకు బాగా కొత్తగా ఉన్నట్టుందికదూ!'

'మీ రందరూ ఉన్నారు, నా కేం లోటు!'

'ఆ మాట నీ హృదయంలోంచి రావడంలేదు. నాలికమీంచి వస్తోంది, అంతే. మీ వాళ్ళను విడిచిపెట్టడం కష్టమయింది కదూ?'

అవుననక తప్పలేదు. ఆయన నా మెడచుట్టూ చెయ్యి పోనిచ్చి బుగ్గను తాకుతూ అన్నారు: 'కొన్నాళ్ళయాక 'మీవారిని' విడిచిపెట్టడం కష్టమవుతుంది కదూ!'

* * *

ముందు బాగా ఆలోచించుకుని ఒకనాడు ఆయనతో అన్నాను: 'చిన్న కోరిక తీరుస్తారా?'

'అంత మరీ చిన్నదయితే తీర్చలేను. బాగా పెద్దకోరిక కోరుకో.'



'అలా హాస్యం పట్టిస్తే నే చెప్పను. చాలా ముఖ్యమైన విషయం.'

'మీకు ముఖ్యమైన విషయమంటే అతిసామాన్యమైనది అయివుంటుంది.'

'నన్ను బాగా పోల్చుకున్నారే!'

'లేకపోతే, ఎలా గెల్చుకున్నాననుకున్నావ్?'

'మీరలా మాటకిమాట పేరిస్తే నా మాట చెప్పనేచెప్పను.'

ఆయన రెండుచేతులతో నోరు మూసేసుకున్నారు.

'చూడండి, మీ పనులు దాసీవాళ్లు చెయ్యడం నాకిష్టంలేదు. వాళ్లు సరిగ్గా చెయ్యడంలేదు. కనీసం మన రెండుగదులూ నేను శుభ్రం చేస్తాను. మీ గది

సర్దుతాను. అంతేకాదు, మీ బట్టలు నేనే ఆరేస్తాను. మీ వంట నేను వండుతాను. కాదనకండి.'

ఆయన పెద్దనవ్వు నవ్వేరు: "భలే, భలే... ఇంటికోడలు యువరాణీ అని విన్నాంగాని పెద్దదాసీ అని ఇదివరకు వినలేదు ... ఈ యింటికి యిలాంటిపేరు ఇదివరకు లేదు మరి!' అని నవ్వడం ఆపేసి అన్నారు: 'ఇలాంటి వెర్రిమొర్రి ఆలోచనలు మానేసి పొద్దుపోయేవేళకి పున్నమినాటి చంద్రబింబంలా తయారయి ఉండు. మెట్రోలో మాంచి బెంగాలీ సినీమా ఉంది.'

ఆయన ఆఫీసుకి వెళ్ళిపోయారు. ఆశాభంగంతో అడుగులో అడుగు వేసుకుంటూ నేను మెట్లు దిగి కిందకివచ్చి, అలా లోపలివైపు వెళ్ళేను. ఎవరిదో మూలుగు వినబడుతోంది. దగ్గరకెళ్ళి చూశాను. అది మా పెద్దమరిది విశ్వనాథ్ గది. నిండా ముసుగు కప్పుకుని మంచంమీద పడుకునిఉన్నాడు. నా పాదధ్వని విని తలమించి ముసుగు తీసి చూశాడు. దగ్గిరగా స్టూలు లాగి కూచున్నాను.

'అదేమిటి వదినా, యిక్కడికివచ్చారు? నాకు జ్వరం వచ్చింది. టెంపరేచరు బాగాఉంది. అంటువ్యాధి కావొచ్చు. దూరంగా వెళ్ళిపొండి.' ఆ యింటి పరిస్థితులు ఎన్నాళ్ళయినా నాకు అయోమయంగానే ఉన్నాయి.

'అదేమిటి విశ్వం! నీకు జ్వరంగా ఉందని నాకు తెలియనివ్వారుకాదేం? నేను యింట్లో లేననుకున్నారా?'

'అమ్మకే తెలీదు వదినా! పొద్దుటే వచ్చింది. అదే తగ్గిపోతుందని ఫోంచేసే శాను. బాగా ఎక్కువైపోయింది. ఇప్పుడే నాన్నగారు ఆస్పత్రికి వెళ్ళేరు — బెడ్ బుక్ చేసుకువద్దామని.'

'అదేమిటి విశ్వం! ఎందుకూ?'

'ఇంట్లో ఎవరి కేం రోగంవచ్చినా వెంటనే హాస్పిటల్లో ఎడ్మిట్ కావడం మాకు అలవాటు వదినా! ఏం, మీయింట్లో అలా చెయ్యరా? అక్కడ జరిగినట్లు అన్నీ కనుక్కోడం, వైద్యం చెయ్యడం ఇంట్లో జరుగుతుందా?'

నాకు కొత్తసంగతి ఇది. నేను జవాబు చెప్పలేని అవస్థ ఇది.

'అంతగా ఒణుకుతున్నావ్, చలిగా ఉందా బాబూ! దుప్పటీ కప్పనా? కాఫీ అదీ ఏదైనా కలిపియివ్వనా? తలనొప్పిగా ఉందేమో — తలపట్టనా? పోనీ కాళ్ళు పీకు తున్నాయేమో, కొంచెం పట్టేదా బాబూ విశ్వం!'

'వదినా! మీ కొక్క నమస్కారం; ఇక్కణ్ణుంచి వెళ్ళిపొండి.'

చేతి కందినట్లున్నది చెయిజారిపోడం ఇది నాకు మొదటిసారి కాదు. ఇటు

వంటి అనుభవాలకు ఏనాడో హృదయం మొండితేరిపోయింది. బరువుగా అడుగులు వేస్తూ పూజామందిరంలోకి ప్రవేశించాను.

'నన్ను విష్ణుసహస్రనామం చదవమన్నారా అత్తయ్యా!

అత్తగారు రోల్డుగోల్డు కళ్ళజోడులోంచి నన్ను చిత్రంగా చూసింది: 'ఎందుకూ? మరో అయిదు నిమిషాల్లో బ్రాహ్మడు రాడూ?'

బ్రాహ్మడు రాడానికి పది నిముషాలు పట్టింది. ఈ పదినిముషాల్లోనూ మా అత్తగారు నన్ను దగ్గిర కూచోబెట్టుకుని తల నిమురుతూ తల వాచేటట్లు చివాట్లు పెట్టింది.

ఎన్నాళ్ళయినా నాకు మొహమాటం పోలేదనీ, ఏది కావలసినా అడగననీ, సరిగ్గా తిండి తినడం లేదనీ, నీళ్ళు తొరుపుకోవడం, తల దువ్వుకోవడం—యిలాంటి పెద్దపెద్ద పనులుకూడా నౌకర్లు ఉండగా నేనే చేసుకోడం ఏం బాగులేదనీ, పళ్ళూ పాలూ సగానికి సగం ఉంచేస్తున్నాననీ—ఏదో మొదటివారం కదా అని ఊరుకున్నాను గాని యిక ముందు యిలా చేస్తే ఒప్పుకొనేది లేదనీ అడ్డమైన ఆరోపణలూ చేసి అందుకు శిక్షలో మొదటిభాగంగా ముద్దు ఒకటి పెట్టుకుంది; రెండవ భాగంగా దిష్టి తీయించింది!

* * * *

మా గది రెండంతస్తుల మేడమీద ఉంది. ఆ గదిని అనుకొని ఉన్న బాల్కనీలో పడక్కుర్చీలో తలకింద చేతులు పెట్టుకుని అలా ఆకాశంవైపు చూస్తూ గంటలు గంటలు గడపడమే నేను చూపించే విశ్వమానవప్రేమా, సాంఘిక సేవా కార్యక్రమమూను! నా ఆలోచనలు చుక్కల్లా మెరిసేవి. ఆకాశంలో ఉన్నన్ని రంగులూ దాల్చేవి. పక్షులంత వేగంగా పయనించేవి. మబ్బులన్ని రూపాలూ వేసేవి. కాని, తెల్లారితే చుక్కలూ లేవు, మధ్యాహ్నమయితే రంగులూ లేవు, చీకటిపడితే పక్షులూ లేవు, రాత్రయితే మబ్బులూ లేవు! మేనుమాత్రం అక్కడే; నేను మాత్రం ఎక్కడో!

ఊహాలోకం విడిచి ఉన్నలోకంలోకి వస్తే నాకు కనిపించే దృశ్యాలు నాకు దక్కకుండాపోయినదాన్నే స్ఫురింపజేసేవి. లేనిదానివైపే మనస్సు కేంద్రీకరింపజెయ్యడం, ఆరంగు టద్దాలలోంచి చూస్తే అన్నివిషయాలూ అలాగే కనిపించడం అత్యంతసహజ మనుకుంటాను.

ఎదురుగుండా ఎనిమిదంతస్తుల మేడ ఉంది. కనీసం ఒక పాతిక మధ్యతరగతి కుటుంబాలయినా అందులో కాపురం ఉన్నాయనుకొంటాను. ఉన్న కాస్త వరండాలో

ప్రతిఒక్కరూ బట్టలు ఆరేసుకునేవారు. అందులో ఒకావిడ, ఎక్కడ ఊరి పోయేవో, ప్రతిరోజూ బండెడు బట్టలు ఆరేసేది. ఆవిడ బాగా లావుపాటి మనిషి. బాల్చీలో ఉన్న బట్టలు వంగుని నీళ్ళు పిడిచేటప్పుడూ, ఆమెకంటె కొంచెం ఏత్తుగాఉన్న తీగెమీద కొంచెం ఎగిరి బట్టలు పరచి ఆరేసేటప్పుడూ ఆమె మొహంలో ఎంతో ఆయాసం, ఊపిరి తీసుకోడానికి ఎంతో బాధా కనిపించేవి. ఓ వందమాట్లేనా 'హరేరామ్' అనుకునేది. ఆమె కూతురో ఎవరో, పదేళ్ళైనా ఉండవు, సన్నగా పీలగా రోగిష్టిదాన్లా ఉండేది—రెండు చేతుల్తోనూ రెండు బాల్చీలు మొయ్యలేక మొయ్యలేక మోసేది. అప్పుడప్పుడు ఆరిపోయిన బట్టలు బిల్లఎక్క తీసేది.

సరిగ్గా ఆవిడకు ఎడంచేతిపక్క వాటాలో ఉన్న స్కూలుటీచరు – తెల్లారీ సరికల్లా ఆవిడ హడావిడి చూసితీరాలి. నలుగురు ఆడపిల్లలకీ మొగుడుకీ వండి పెట్టేది. నాలుగు రెళ్లు ఎనిమిదీ ప్లస్ తనది ఒకటీ, తొమ్మిది జడలు వేసేది! ఇక ఏమి పరుగో, ఏమి లోకమో! తొమ్మిదీ ఆయేసరికి ఒక చేత్తో పుస్తకాలూ, ఒక చేత్తో గొడుగూ—బస్సుకోసం పరిగెత్తుకుపోయేది.

మొదట్లో ప్రతినిముషం అమ్మా నాన్నా గుర్తుకువచ్చేవారు. పోనీ తమ్ముణ్ణయినా టెలిగ్రాం యిచ్చి పిలిపించుకుని కొన్ని రోజులపాటు ఉంచుకుందామా అనుకునే దాన్ని. కాని ఇప్పుడా ఆలోచన లేదు. ఈ పదిరోజులకీ నేనెంత మారిపోయానో గుర్తిస్తే మీరు ఆశ్చర్యపోతారు. ఈ యిల్లూ, యీ యింట్లో మనుషులూ అంటే అప్పుడే నాకు ఒక విధమైన భ్రాంతి ఏర్పడింది. ఇల్లాలిననే ఇష్టమైన భావం యీ కొద్దిరోజులకే నాలో తలఎత్తి స్థిరపడడానికి ప్రయత్నిస్తోంది.

ఇల్లాలి స్థానం అంతవరకేనా? కాదు, కాదు. ఈ యింటికి కులదీపకుణ్ణి యివ్వవలసిన మధురాతి మధురమైన బాధ్యత మరెవరిదీ కాదు; నాదే. ఈ బాల్కనీలో తీరుబడిగా కూచుని ఆకాశంవైపు తిలకిస్తున్న యీ అమ్మకళ్ళలో పక్షుల్నీ, రంగుల్నీ, చుక్కల్నీ, మబ్బుల్నీ చూడ్డానికి ఇటోకాలూ అటోకాలూ వేసి బైఠాయించే పసివాడొకడు రాకపోడు. ఈ అమ్మ ఒళ్ళో కూచుని ఉయ్యాల లూగుతాడు. ఒళ్ళోనా? కాదు. అంతరంగంలో. మీదపడి మెళ్ళో గొలుసులు పట్టుకులాగుతాడు. గొలుసులా? కాదు; ఇన్నాళ్లూ దాగిన ప్రేమపాశాలు. ఉండుండి ఊరంత నవ్వు నవ్వుతాడు ఉత్తుత్తినవ్వులా? కాదు. 'అందరిలాంటి అమ్మవే నువ్వు. అంతకన్న మరేమీ కావు' అని నన్ను వెక్కిరిస్తాడు! వీ డొక్కడేనా? అమ్మ అనురాగాన్ని పంచుకోడానికి పోటీదార్లు ఎక్కువై పోతారు. నన్ను 'తల్లి'ని చేసి నా మనసుతో

దొంగాట ఆడుకునే పిల్లలు నా యిల్లు నిండిపోతారు! నన్నిక కదలనియ్యరు! కాని...

...కాని, నేను అంచనా వేసింది ఇదేనా? నేను అందుకోగోరింది యిదేనా? దేశ మంతా వేదనామయం ఆయినప్పుడు సుఖపడే హక్కు నా కేమి ఉన్నది? 'నీకు బంధువులూ స్నేహితులూ కానివారికి కనీసం ఒక్కరికి నువ్వు చేసిన సహాయం, ఏదీ - ఒకటి చెప్పు' అంటే నే నేం మాటాడగలను?

ఇక్కడివారి అందరి కళ్ళలో వెలుగుతున్న నా మీది ఆదరాభిమానాలను నేను గుర్తించగలను. మా పుట్టింటివారు వీరికంటె భాగ్యహీనులనే ప్రసక్తి ఒక్కసారైనా నా దగ్గిర తీసుకురాని వీరి హృదయవిశాలత్వాన్ని నేను కీర్తించగలను.

వచ్చిన ప్రతి ముష్టివాడికీ మా యింట్లో బియ్యం వేస్తాము. అతిథి లేనిదే మా మామగారు ఇప్పటికీ భోజనం చెయ్యరు. నేను వచ్చాక దానధర్మాలు మరింత ఎక్కువచేసినా ఎవరూ నన్నేమీ అనలేదు. ఏ సేవాసంస్థవాలంటీర్లు వచ్చినా పది రూపాయలు తక్కువ యిచ్చిపంపము, కాని ...

... కాని ఇల్లనే చీకటినూతిలోపల ఇంగితజ్ఞానమనే బాల్చీ మరి కనపడకుండా పడిపోయిందా? దీన్ని బయటికి తీసే గేలం పేరేమిటో ఎవరికీ తెలియదా?

ఆలోచించగా ఆలోచించగా నాకు జవాబు దొరికింది విజయకుమార్! అది మీకు

స్పష్టంగా చెప్పడానికే ఇంత ఉత్తరం రాసింది. అందర్లాటివారు కాదనీ, అది మీరు అందుకోగలరనే నమ్మకమే నా చేత యింత ఉత్తరం రాయించింది.

శారీరకంగా, సాంఘికంగా స్త్రీలం - అబలల మైఉన్నాము ఈ దేశం మాకు కొన్ని కట్టుబాట్లు విధించింది. ఈ కట్టుబాట్లు ఒకప్పుడు మరీ చాద స్తంగా అర్థం లేనివిగా ఉండొచ్చు. మరీ ఇప్పుడిప్పుడు విచ్ఛలవిడితనం నేర్పేటంతగా సడలించ బడిఉండొచ్చు. కాని కట్టుబాట్లు అనేవి ఉన్నాయి. కాదనలేము ఇవి మీకేనా, మాకు లేవా అని పురుషులు అడగవచ్చు. ఉన్నాయి, కాని మాకు ఉన్నంత బంధనాలు మీకు లేవు కాబట్టి మీ రంగం మాకన్న స్వేచ్ఛాయుతమైనది, విస్తృతమైనది. అందుకనే ముఖ్యసాధనములన్నీ పురుషార్థములనే చెప్పబడిఉన్నాయి కాబట్టి కార్యశూరులూ, కదనవీరులూ మీరే అలాగని మా బాధ్యతేం తక్కువకాదు తెరపక్కనుండి మీకు ప్రాంప్టింగ్ ఇచ్చేది మేమే, జీవమిచ్చేదీ, శిక్షణిచ్చేదీ మేమే చరిత్రపుటలు తిర గేస్తే అరుదుగా మాలో కార్యస్వరూపిణులు కనబడవచ్చు. కాని మొత్తమ్మీద నాయకత్వం వహించే ఖ్యాతి మీదే ప్రేమలో ముంచి పరవశింపజేసే భార్యలమే కాక ప్రగతిపథంలోకి మళ్ళించి ప్రయోజకుల్ని చేసే మాతృమూర్తులంకూడా మేమే. మిమ్మల్ని అంటిపెట్టుకుని ఉండడమే మా జాతికి బలం మీరు గొప్పవాళ్లు కావడమే మా జన్మకు ఫలం

కీర్తిప్రతిష్ఠలు మాకేం అక్కర్లేదు. 'ఇలాంటి వాళ్ళని కన్నాం ఇంతటివాళ్ళని చేశాం' అనే తృప్తి మాకు చాలు. మనదేశంలో యిందరు వీరులున్నారంటే ఆపేరు ప్రత్యేకించి ప్రతిఒక్కరిదీ. కాని అందరిదీ కలిపిన ఖ్యాతి, మన అందరికీ తల్లి మన దేశమాతదికాదా ?

విజయకుమార్‌గారూ ! సామాన్యురాలైన ఆడదాన్ని. ఎన్నో అనుకున్నాను, ఏమీ చెయ్యలేకపోయాను కాని ఈనాడు నాకా విచారంలేదు ఒక చిన్న చీపురుపుల్ల ఆరిపోతున్న ఒక జ్యోతిని పైకి తీయగలదు. ఆ కాంతి ఎంతయినా వెలుగు నియ్య గలదు. అన్నివిధాలా అవకాశమున్న పురుషుడు ఎంత దేశసేవ చెయ్యగలడో అంతా మీనుంచి ఆశిస్తున్నాను. సేవితుడూ, సేవకుడూ అయిన సర్వేశ్వరుడు మీకు తగిన శక్తి నివ్వాలని ప్రార్థిస్తున్నాను '

## *8*

గీత రాసిన ఉత్తరం ఎన్నిసార్లు చదువుకున్నానో చెప్పలేను. సంకుచితమూ, స్వార్థభూయిష్టమూ అయిన సాధారణ జీవనగమ్యాన్ని ధర్మయుతమూ, త్యాగ

మయమూ అయేలాగ తీర్చిదిద్దే తత్వబోధ ఎలా పెడచెవిని పెట్టను ? మిలటరీ సర్వీసుకని తెప్పించిన అప్లికేషనుఫారమ్ను అప్పుడే నింపి పంపించేశాను.

అమ్మతో నాన్నతో ఈ విషయం ఎలా చెప్పడమో ఎంత ఆలోచించినా బోధ పడ్డంలేదు. నేను మిలటరీలోకి వెళ్ళిపోతాననే విషయం వాళ్ళు కలలోకూడా ఊహించలేదు. ఆసంగతి తెలిస్తే భరించి బతకగలరా ? జవాబు ఊహించడానికే భయంగా ఉంది ఊహించకుండా ఉండడ మెలాగోకూడా నాకు తెలియడంలేదు

ఇంట్లో తల్లిదండ్రుల సమక్షంలో తలెత్తుకు తిరుగలేక వీధిలోకి అడుగుపెడితే చాలు - మన దేశంలో ఏర్పడిన అత్యవసర పరిస్థితిని గురించి వార్తలు తప్ప మరొకటి వినపడంలేదు ఎక్కడ చూసినా అవసరమైన వస్తువులూ, సొమ్మూ, బంగారమూ సేకరించి దేశరక్షణనిధికి సమర్పిస్తున్నారు అధికసంఖ్యాకులైన విద్యార్థులు చేసే హడావిడి ఇంతా అంతా కాదు

కని పెంచిన తల్లిదండ్రుల్ని వృద్ధాప్యంలో వదిలి వెళ్ళిపోడానికి ఎన్నివిధాల ఆలోచించినా నా మనసు సమాధానపడడం లేదు పట్టుకుని నడిచే చేతికర్ర పెట్టిన మూల కనపడకపోతే మా అమ్మ ఎంత హంగామా చేస్తుందో నే నెరుగుదును. చత్వారం కళ్ళజోడు ఒక్కగడియ లేకపోతే మా నాన్న ఎంత కంగారు పడతారో నేను అర్థం చేసుకోగలను. చేతికందిన కొడుకు, ఆశ లల్లిన కొడుకు, ఒక్కగా నొక్క కొడుకు వయస్సు మళ్ళిన తల్లిదండ్రులకి ఎన్ని చేతికర్రల, ఎన్ని కళ్ళజోడుల సమానం ? ఇలాంటి నా బలహీనతల్ని ఆధారం చేసుకుని అనేక పిల్లప్రశ్నలు రాత్రీ పగలూ అనకుండా నన్ను కలవరపెట్టజొచ్చాయి. ఎక్కడికో వెళ్ళి ఎవర్ని ఉద్ధరిస్తావ్ ? ఇక్కడే ప్రాక్టీసు పెడితే వచ్చే నష్ట మేమిటి ? ఉచితంగా వైద్యం చేసి బీదవాళ్ళ బాధలు తగ్గించడానికి యింటినుంచి పారిపోవాలా ? నువ్వు అనన్యమైన సన్మార్గపథం త్రొక్కితే నీ తల్లిదండ్రులు నిన్ను మరింతగా దీవించేవారేగాని నీ మేలు కోరనివారు కాదే ! నీ మంచివారికి అడ్డువచ్చేవారు కాదే ! నీ సాంఘికసేవ ఏదో నీ స్వగృహంనుంచే ప్రారంభించరాదా ? పోషించి పెంచిన యిన్నాళ్ళ ఆశా ఒక్క క్షణంలో ముక్క ముక్కలయిపోతే నీ తల్లిదండ్రుల గుండె బ్రద్దలయిపోదా ? సంఘానికీ దేశానికీ సేవ చేయవలసిన బాధ్యత నీకున్నమాట నిజమే వృద్ధులైన నీతల్లిదండ్రులకు సేవ చేయవలసిన బాధ్యత నీకులేదా ?

ఆ సాయంకాలమే ఏదో యధాలాపంగా మా అమ్మ యుద్ధప్రసక్తి తెచ్చింది. 'పాపం, ఇంతమంది ప్రాణాలకి తెగించి పోరాడుతున్నారుకదా. అలాంటి ప్రదేశాల్లో వీళ్ళకి గాయాలు తగిలినా జబ్బుచేసినా దిక్కెవరు బాబూ ?'

అప్రయత్నంగా అమ్మ వేసిన ఈ ప్రశ్న నాకు అవకాశా న్నిచ్చింది. 'అలాంటి చోటికి వెళ్ళి చేసిందే సేవ. ఏమంటావు?'

'కాదామరి? ఎంత గొప్ప వీరులైనా ఒక తల్లిబిడ్డలే కద. ఆ సైనికుల్ని కన్న తల్లిదండ్రుల హృదయాలు పాపం ఎలా తల్లడిల్లిపోతూంటాయో...ఏ రోజు కెలా వున్నారో, పాపం! కబురూ అదీ తెలియదు కాబోలు...వాళ్ళవా శ్కెంత కొట్టుకు పోతూవుంటారో!'

'లేదమ్మా! దేశంకోసం పోరాడుతున్న మహావీరులు కాబట్టి వాళ్ళకి మనవాళ్ళ వుద్యోగా లన్నిటికన్న ఎక్కువ జీతమూ, సదుపాయాలూ వుంటాయి. మనదేశం దేశమంతా ఏకమై వాళ్ళకి అండగా నిలుస్తోంది. నిజంగా మనం ఏం చేసి వాళ్ళ రుణం తీర్చగలం!'

'నిజమే. కాని ఎవరికి తోచిన సాయం వాళ్ళు చెయ్యొచ్చుకదా?'

'అవును దేశానికి సాటిలేని సేవ చేసే అవకాశం నీకూ వున్నదమ్మా! నీ కొడుకుని ఆర్మీడాక్టరుగా యుద్ధానికి పంపకూడదటమ్మా?' అని అడుగుదామని నోటి చివరిదాకా వచ్చింది కాని అడగనక్కరలేదు. జవాబు నాకు తెలుసు మరు క్షణం పండిన పండులా వున్న మా అమ్మ మొహం ఎండిన ఆకులా ఎలా ముడు చుకుపోతుందో నేను ఊహించగలను. అలాంటి మొహం నేను చూడలేను రక్త స్పర్శ అనేది నన్ను వివేకహీనుణ్ణి చేస్తే చెయ్యవచ్చు. నే నీ ప్రేమపాశం విప్పుకోలేకపోతున్నాను!

ఇంటర్వ్యూకి రమ్మని కబురు వచ్చిననాడు నేను పొందిన ఆందోళన వర్ణించలేనిది

'ఇవాళ నా మనసెందుకో బాగులేదురా బాబూ!' అని అమ్మ అంటూంటే నేను ప్రాన్పడిపోయాను నే నెంత జాగ్రత్తగా కాగితాలూ అవీ దాచుకుంటున్నా నాన్న గారికి ఎలాగైనా తెలిసిపోయిందేమో. అమ్మతో చెప్పేశారేమో! నా గుండె ఎంతో వేగంలో కొట్టుకుంది

'ఇంత అన్యాయం జరుగుతుందని కలలో అనుకోలేదు!' ఇంకేం, తెలిసిపోయిం దన్నమాట! నిజానికి గట్టిగా మా అమ్మ వెళ్ళొద్దని పట్టుబడితే నేను కాలు కదప గలనా?

'ఏం జరిగిందమ్మా?' అని నేను అడక్కుండానే ఆమె చెప్పింది.

'మరేం లేదు. మన పురోహితుడు సుబ్బావధాన్లు లేడూ. ఆయనా కొడుకూ వేరుపడిపోయారుట!'

'అమ్మయ్య!' అనుకున్నాను నేను. పైకి మాత్రం ఇలా అన్నాను 'అదేమిటి,



పాపం అరని పెళ్ళానికి యీ మధ్య మశూచికం వచ్చి కళ్లు కూడా పోయా యను కున్నారే, ఈ వయసులో వేరింటికాపురం పెడితే ముసిలాళ్ళు ఏమైపోతారు?'

'బాగుంది, ఆడవాళ్ళకి పడకపోతే మొగాళ్లు ఎంతకని భరించగలరు!'

'అయితే? ఊరంతా ముష్టెత్తి కొడుక్కి చదువు చెప్పించాడు కదా! వాడికామాత్రం జ్ఞానం వుండొద్దూ? తల్లి గుడ్డిదికదా! ఏమైపోతుందనుకున్నాడు! పెళ్ళాం మాటే వేదవాక్యమా?'

అమ్మ నవ్వింది నేను ఎప్పుడూ అనుకోని ఒక విసురు విసిరింది 'బాబూ! నువ్వుకూడా తొందరగా పెళ్ళి చేసుకుని వేరైపోదూ!' అంటూ నవ్వింది. నాకు కోపమొచ్చి అక్కణ్నుంచి లేచి వెళ్ళిపోబోతే చెయ్యి పట్టుకు కూచోబెట్టింది

'ఎంతలో ఎంత కోపమొచ్చిందిరా బాబూ. మరి ఎన్నాళ్ళకీ నువ్వు పెళ్ళికి మొగ్గకపోతివి అందుకని తమాషాకి అలా అన్నాను నువ్వు బంగారు తండ్రివి. అలా ఎందుకు చేస్తావ్?'

ఈ బంగారు తండ్రి ఎలాంటి పని తలబెడుతున్నాడో ఆ వెర్రితల్లికి తెలియదు. నా కళ్ళమ్మట నీళ్ళు తిరిగేయి.

'అదేమిటి విజయా! అంతలో కన్నీరు దేనికి? ఇంతకీ నిన్ను నేనేమన్నానని! ను వ్వింత నొచ్చుకుంటావని తెలీదు. అందరూ అలా తల్లిదండ్రులకి అన్యాయం చేస్తారా? లే ..లే . ' మా అమ్మ నా భుజంమీద చెయ్యి వేసింది ఆ స్పర్శకి నా దుఃఖం కట్టలు తెంచుకుంది గదిలోకి వెళ్ళి తలుపేసుకున్నాను...

డాక్టరు విజయకుమార్ కళ్ళమ్మట నీళ్ళు జలజల కారిపోయాయి శ్రీకృష్ణ మూర్తికూడా కళ్లు తుడుచుకోడం చూసి డాక్టరు చాలా ఆశ్చర్యపోయాడు.

"అదేమిటి? ఈ చుట్టుపక్కల మిమ్మల్ని ఆయిరన్ మ్యాన్ అని వ్యవహరిస్తారు క్రమశిక్షణకు ఏమాత్రం లోపమొచ్చినా కొంచెమైనా సహించరనీ, హృదయమన్నది లేని పెద్ద పెద్ద శిక్షలు విధిస్తారనీ జూనియర్సు అనుకుంటూంటే విన్నాను నా కధ మిమ్మల్నీ కదలించి కరిగించిందా?''

శ్రీకృష్ణమూర్తి ముఖం అంతట్లో ప్రశాంతంగా మారిపోయింది. "సామాన్యుల్ని మించిన సాహసమూ ధైర్యమూ మన సైనికులకి ఉండవచ్చు అత్యవసర పరిస్థితికి తగిన సమయస్ఫూర్తి, అత్యంత ప్రమాదస్థితిలోకూడా సడలని మనోనిశ్చలతా మనకి ఉండవచ్చు క్రమబద్ధమైన వ్యాయామంతో గట్టిపడిన శరీరం మనది కావొచ్చు. మనం ఎన్నుకున్న ప్రమాదకరమైన వృత్తి, మనం పొందిన కఠినమైన శిక్షణా మనల్ని ప్రత్యేకమైన మరిమనుషులుగా పైవారికి కనిపింపజేయవచ్చు. కాని అన్నిటి అడుగునా మనం ఎవరం? అందర్లాంటి మానవులం. వెలుగునీడలకు ప్రతి బింబించే వదనమూ, రాగద్వేషాలకు ప్రతిధ్వనించే హృదయమూ మనకూ ఉన్నాయి. గుండీలుమాత్రమే కాక గుండెలుకూడా విప్పి చూడకలిగితే ఏ సైనికుడి జీవితంలో ఎన్నెన్నిరకాల ఎత్తుపల్లాలు లేవు!''

''అయితే ఏమిటి మూర్తీ నా అన్నవారు మీకు లేరని అందరూ అనుకునే మీ జీవితంలోకూడా సంచలనం కలుగజేసే సంఘటనలు ఉన్నాయా?" విజయకుమార్ విస్ఫారితనయనాలతో అడిగాడు.

"మొదట మీరు చెప్పేది పూర్తిచేయండి,'' అన్నాడు శ్రీకృష్ణమూర్తి ఎప్పటి చిరునవ్వుతో.

"నేను చెప్పడం పూర్తిఅయాక మీరు చెప్తారుగా."

"చెప్పాలనే మీ చేత యింతసేపూ చెప్పించింది"

డాక్టరు విజయకుమార్ మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు—

తెలిసిన స్నేహితు డొకడిదగ్గిర కొద్దిరోజులు గడిపివస్తానని యింట్లో చెప్పి యింటర్వ్యూకి వెళ్ళివచ్చాను. నేవచ్చిన మర్నాడే మా వ్యాసమూర్తి దగ్గిర్నుంచి ఉత్తరం వచ్చింది. అంతకుముందే నేను హఠాత్తుగా మెడ్రాసునుంచి యింటికి వచ్చేసిన కారణాలు రాస్తూ, నేను ఆర్మీ డాక్టరుగా వెళ్ళిపోడం విషయంలో వాడి అభిప్రాయాలు మరింతగా విపులీకరించమని రాశాను. కాని నేను కోరినట్టు ఉత్తరం విస్తృతంగా లేదు. బాగా క్లుప్తంగా సూటిగా ఉంది.

'జటిలమైన ఒక సమస్యని సాధించడానికి నువ్వు పూనుకున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. ఇంతగా ఎదిగినందుకు నిన్ను మనఃపూర్వకంగా అభినందిస్తున్నాను. కన్నతల్లికి సేవ చెయ్యడమా, దేశమాతకి సేవ చెయ్యడమా! ఏది ముఖ్యం అనే ప్రశ్నకు నువ్వు సరిగా జవాబు చెప్పుకోలేక పోయినట్టు నీ ఉత్తరం చూస్తే అర్థమవుతోంది. ప్రశ్నలోనే లోపం ఉంది. 'మేష్టరీ ఉద్యోగం చెయ్యనా, ప్లీడరీ చదువుతే బాగుంటుందా?' లాంటి ప్రశ్నకాదు ఇది. ఒకటి తేల్చుకుని రెండవది విసర్జించవలసిన అవసరం ఏమీ లేదు. తనయుడిగా తల్లిరుణం తీర్చుకోవలసిన బాధ్యత నీకున్నది. భారతీయుడిగా భరతమాత రుణం తీర్చుకోవలసిన బాధ్యతా నీకుంది. ఈ బాధ్యతలు గుర్తించినందుకు నిన్ను మెచ్చుకుంటున్నాను. ఒకదాని కోసం ఒకటి త్యాగం చెయ్యవలసిన అవసరం రాకుండా నేర్పరితనం చూపించు. త్యాగం చెయ్యవలసిన అవసరం వస్తే మహారాజ్యమో, మానవకళ్యాణమో తేల్చుకుని సిద్ధార్థుడైన గౌతముని పద్ధతి బాగా పరిశీలించు.'

మరొక పదిరోజుల కనుకుంటాను పోస్టుమేన్ ఆర్డర్సు తెచ్చి నాకు రహస్యంగా అందించాడు. ఒక పెట్టెలో, ఒక హోల్డాల్‌లో అవసరమైన సామాన్లు అన్నీ సర్దుకుని, పెద్ద ఉత్తరం రాసి టేబిల్‌మీద ఉంచి, రాత్రికిరాత్రి బయలుదేరి వచ్చేశాను.

నేనిక్కడ ఉద్యోగంలో చేరిన తరువాత యింటికి ఎడ్రసూ అదీ పంపుతూ మరొక ఉత్తరం రాశాను. అక్కణ్ణుంచి నాకు వచ్చిన జవాబుమాత్రం ఒకటే ఒకటి. నాన్న రాశారు. నాన్న రాసిన దేమిటంటే—

'ఎంత దగ్గిరవారినుంచీ ఏమీ ఆశించకూడదనీ, అలా ఆశించడమే అన్ని రకాల ఆశాభంగాలకూ మూలకారణమనీ, ఆ సంగతి తెలిసికూడా ఆ దౌర్బల్యానికి అతీతులుగా ఉండలేకపోవడం మానవులకి అతి సహజమనీ...'

ఇలా మొదట వేదాంత ధోరణిలో ప్రారంభమై —

'వారాలు చేసీ, వీధిలాంతరు దగ్గిర చదివీ తన జీవితం కష్టాలతో ఆరంభమైందనీ, తీరా ఒక ఉద్యోగమంటూ దొరికి కాపురమంటూ ఏర్పడ్డాక, పిల్లలు పుట్టేక,

జీత మందిన మొదటివారమే తప్ప తక్కిన నెలంతా తనెప్పుడూ చిరునవ్వు అన్నది ఎరగననీ, మా అక్క పెళ్ళితో బాగా అప్పులపాలు అయిపోయాననీ, అప్పట్నుంచీ ఒక్క రాత్రీ తను నిశ్చింతగా నిద్రపోయి ఎరగననీ ...'

ఆయన జీవితంలో నేను సరిగా గుర్తించని కొన్ని కష్టాలు హృదయం కరిగేలా వర్ణించి —

'పొద్దిసేపటిలో ప్రొద్దు గ్రుంకనున్న ఎడారిలాంటి తన బతుకు చివరిగడియలలో కొంచెం విశ్రాంతి, కాస్త మనశ్శాంతి, కొద్ది క్షణాల ఆత్మశాంతి కోరుకోవడమే కేవలం తెలివితక్కువని తన కిప్పుడు తెలిసిందనీ, తను చేసిన తప్పు ఆదెవరిమీదా రుద్దబోవడం లేదనీ, ఎప్పుడయినా ఎక్కడయినా ఆయురారోగ్య ఐశ్వర్యాలతో నేను బతకాలని తా మిద్దరూ ఆశీర్వదిస్తున్నామనీ —'

నాన్న ఉత్తరం ముగించారు.

ఉత్తరం కొన్ని వందల సార్లు పైనుంచి కిందకీ, వెనకనుంచి ముందుకీ చదివాను ఎక్కడా అమ్మ ప్రసక్తి లేదు. అమ్మకి అక్షరజ్ఞానం లేదు ఎవరిచేతనైనా ఉత్తరం రాయించాలి, ఎవరిచేతనైనా చదివించుకోవాలి. అయినా ఆమె తలుచుకుంటే అవేవీ అంత అసాధ్యమైన పనులు కావు, నే నిలా పారిపోయి రావడం ఆమె ఏవిధంగా తీసుకుందో తెలీదు ఆ తల్లి అంత దుఃఖం ఎలా భరించిందో నాకు చెప్పేవారు లేరు. దానికి తోడు నే నింటికి పంపిన రెండువందలూ వెంటనే తిరిగి వచ్చాయి! ఇక నా ఆందోళనకి అంతులేకపోయింది.

ఇక్కడ మిలటరీ ఆసుపత్రిలో చూస్తే రోజు రోజుకీ నా బాధ్యత ఎక్కువవుతోంది. నాకు వేరే సంసారబాధ్యత అన్నది లేకపోవడంచేత నా శక్తీ, కాలమూ పూర్తిగా యిక్కడే వినియోగించడానికి అవకాశం కలిగి ఈ రోగుల సేవలోనే నాకు ఇరవైనాలుగుగంటలూ గడచిపోతున్నాయి పై అధికారుల ప్రశంసలవల్ల కాక, బాధ నివారితులైన వ్యాధిపీడితులు నావైపు బరపే కృతజ్ఞతాపూర్వక దృక్కులవల్ల నాకెంతో ఉత్సాహం కలుగుతూఉండేది నా వార్డులో నాతో పని చేసే కంపౌండరు లక్ష్మణసింగ్ కూడా ఎంతో చురుకుదనమూ, సహనమూ కలవాడు అవడంవల్ల నా పని మరింత జయప్రదంగా జరుగుతూఉండేది కాని ఏ ముసలిరోగికి సేవ చేస్తున్నా మా అమ్మో నాన్నో నా కనులముందు దుఃఖపూరితమూ, పరిదీనమూ అయిన వదనాలతో నాకు కనిపించడం మానలేదు

మామూలు వైద్యశాలలోనే పరధ్యానానికీ, ప్రమత్తతకీ చోటు లేదు అందులో ఇది సైనికవైద్యశాల. అందునా యిది అత్యవసర సమయం ఒక్కొక్కప్పుడు




కొద్దివెలుగులోనే ఆపరేషన్లు చెయ్యవలసిఉంటుంది. లభించని పరికరాలకోసం పరుగులెత్తే అవకాశం ఉండకపోవచ్చును. అప్పటికప్పుడు అసాధారణమైన సమయస్ఫూర్తి ఉపయోగించి చికిత్సావిధానం సవరించుకోవాలి. శిక్షణసమయంలో ఇవన్నీ ఊహించి చెబుతారనుకోండి – అయినా బోధనకీ కార్యసాధనకీ చాలాదూరం ఉన్నదికదా!

ఒకసారి ఒక వృద్ధుడికి బ్యాండేజి వేసే విషయంలో చిన్న పొరపాటు చేశాను కమిషన్డ్ ఆఫీసరు యిలా చెయ్యడం సహించమనీ, యీసారి యిలా చేస్తే డిసిప్లినరీ యాక్షన్ తీసుకుంటామనీ పై ఆఫీసరు మందలించాడు. ఆ పొరపాటు అప్పుడే సవరించబడింది కాని మానసికంగా తగిలిన ఆ గాయం నేను భరించలేకపోయాను. దానికితోడు 'అమ్మ ఎలా ఉంది? నువ్వేనా రాయ,' మని నేను కాసులమ్మకి రాసిన ఉత్తరానికి అప్పుడే జవాబు వచ్చింది.

'అమ్మ ఎలా ఉంటే నీకెందుకు? ఆమె ఎలా ఉందో నిజంగా నీకు కావలిస్తే అంత ఘోరం చేసిఉందువా?' అంటూ ఆరంభమైంది ఆ ఉత్తరం దాని ధర్మమా అని మా చెల్లెలు కేవలం చివాట్లేకాక అందులో కొన్ని సంగతులుకూడా రాసింది.

'నువెళ్ళిపోయాక అమ్మ బెంగపెట్టుకుని అన్నం నిద్రా మాని అహోరాత్రాలూ ఏడుస్తూంటే నాన్న నాకు ఉత్తరం రాశారు. నేను వెంటనే వచ్చాను. అప్పట్నుంచీ యిక్కడే ఉన్నాను. అక్కయ్య వచ్చి ఒకమారు చూసి వెళ్ళిపోయింది.

నువ్విప్పుడు అమ్మని చూస్తే గుర్తుపట్టలేవు – అంతగా జీవచ్ఛవంగా మారి పోయింది. అసలు మొన్న మొన్నటిదాకా ఆమె బతుకుతుందనే ఎవరమూ అనుకో లేదు. డాక్టరుగారు చెప్పేరు – బతుకులో పడిందనీ, యిక ఫరవాలేదనీ. చచ్చయినా పోయిందికాదు ఎందుకోసం బతుకుతూందో తెలియదు!

ఇప్పుడు పాతయింట్లో అమ్మా నాన్నా ఉండటంలేదు. వేరే అద్దెయింట్లోకి దిగేరు. కడుతూ కడుతూన్న నీ ఆసుపత్రిగదులు చూసి అమ్మ వెక్కి వెక్కి ఏడవని రోజులేదు, అందుకనీ నాన్నగారు ఆ మధ్య రిటైరవుదా మనుకున్నారు. నీకు తెలుసుగా? సెక్రటరీని పట్టుకుని మరి రెండేళ్లు ఉద్యోగకాలం ఎలాగో పొడిగించుకున్నారు ఆయన ఒంట్లో మునుపట్లా ఓపికలేదు లేస్తే తూలిపడిపో తున్నారు. అయినా ఎవ రెన్ని విధాల చెప్పినా ఆయన ఉద్యోగం మానడంలేదు

ఇక్కడి సంగతులు రాయమని మరీమరీ రాశావు ఒక్కసంగతి రాయనని అమ్మకి మాట యిచ్చికూడా నీకీ ఉత్తరం రాస్తున్నాను ఒక్కప్రశ్నకి నాకు జవాబు కావాలి. అక్కయ్యకీ మనకూ బాగా ఎడంగాని, నీకూ నాకూ వయసు బాగా దగ్గర. ఆ చనువుతో చిన్నదాన్నయినా అడుగుతున్నాను – ఇందర్ని యిన్ని విధాల దుఃఖపెట్టి అక్కడ నువ్వు చేసే దేశసేవ ఏమిటి?'

## 9

ఉత్తరం చదవడం యిలా పూర్తిచేశానో లేదో 'బాబూ!' అని పెద్దకేక విని పించింది చూపుడువేలితో కంట్లో నిలిచిన బిందువుల్ని తుడిచేసుకుని గబగబా మెట్లెక్కి ఆసుపత్రిలోకి పరిగెత్తేను.

నన్ను పిలిచింది రామూ అనే పేషెంటు. ఎడంవైపుకిందిపక్కఎముకలో దిగి పోయిన తుపాకిగుండును ఆపరేషను చేసి తీశాము వారం రోజులైం. రెండ్రోజు లైంది కుట్లు విప్పి నేను రాగానే అతని చూపులో ధైర్యం నిలిచింది

'డాక్టరుబాబూ! నా చేతిని పట్టుకు కూచుంటామని చెప్పేరు... మళ్ళీ ఎక్కడికి వెళ్ళిపోయారు?' నే నతనిచేతిని గట్టిగా పట్టుకున్నాను.

'ఏదో ఉత్తరం వస్తే అందుకోడానికి వెళ్ళేను రామూ... అదలా చదువుతూ ఉండిపోయాను. అంతలా కంగాపడిపోతే ఎలా?'

'నిజమే బాబూ... ఏం చెయ్యను, ఒకసారి ఇలా కదిలేసరికి పక్కలో చెప్ప లేని నెప్పి వచ్చేసింది. ఏమైపోతానో అని మా చెడ్డభయమేసింది. అందుకే అంత కేకేశాను. మీరిలా దగ్గిరగా కూచుని నా చెయ్యి పట్టుకుంటే ఎంత ధైర్యంగా ఉందో

చెప్పలేను. నన్ను విడిచి ఎక్కడికీ వెళ్ళకండి డాక్టర్. ఉత్తరం వస్తే యిక్కడికే యిస్తారు. మీరు పరిగెత్తుకుని వెళ్ళి అందుకుంటేగాని దొరకదా యేం? అయినా మమ్మల్నిమించి మీ కెవరూ లేరని చెప్పేరు ఆదంతా అబద్ధమా డాక్టర్?'

'ఎవరున్నారు! ఎవరులేరా? ఉంటే ఉన్నారు. మిమల్నిమించి నా కెవరున్నారు? ఇకముందు మిమల్ని విడిచి ఎక్కడికీ వెళ్ళను వెళ్ళలేనుకూడా. అన్నీ ఒదులుకుని నేను వచ్చింది మీకోసమే ఇంకెక్కడికి వెడతాను!'

ఇంకొకరు పిల్చారు

'జాలిగొలిపే మా చూపులు మిమ్మల్ని కదలనియ్యవని ఒకసారి మీరు అంటూంటే విన్నాను. చాలా తలనొప్పిగా ఉంది. ఇలా వచ్చి మీ చల్లనిచెయ్యి నా నుదుటిమీద ఒకసారి పెట్టండి డాక్టర్!'

లక్ష్మణసింగ్ నవ్వుతూ అన్నాడు 'పోనీ, కాలో చెయ్యో విరుచుకుని మీ మధ్య మంచం వేసుకుని డాక్టరుగారినే ఏకంగా యిక్కడ ఉండిపోమనకూడదూ?'

అందరూ గొల్లున నవ్వేరు.

'సార్, మిమల్ని మోహన్‌లాల్ రమ్మంటున్నాడు.' నర్సువచ్చి చెప్పింది నేను అటువైపు వెళ్ళేను

'మీరు ముందిలా రండి డాక్టర్. మీతో మాటాడాలి. నాకు ఇవాళో రేపో కట్లు విప్పుతారనీ, వీలయినంత తొందర్లో డిస్చార్జి చేయిస్తాననీ మీరు మాట ఇచ్చేరు. అవునా? ఎన్నాళ్ళు యిక్కడిలా వుంచేస్తారు? ఇక్కడిలా పడుకుని శత్రువుల్ని హతమారుస్తున్నట్టు ఎన్నాళ్లు కలలు గనమన్నారు?'

అతను కూచోబోయి వెనక్కి పడిపోయేడు

'నువ్విలా కదలకూడదని ఎన్నిసార్లు చెప్పను? అలా తొందరపడితే మేము చేసిన కృషి అంతా వృధా అయిపోతుంది. నువ్వెలాంటి స్థితిలో ఇక్కడికొచ్చావో, ఎంత రక్తం కారిపోయిందో కొంచెం గుర్తుంచుకో. రక్తం ఎక్కించాము. మూడు రోజులపాటు నువ్వు ఏ లోకంలో వున్నావో ఎవరికీ తెలీదు. మళ్ళీ నువ్వు బతికి మనుషుల్లో పడ్డావంటే, ఇంకా నువ్వు దేశానికి చెయ్యవలసిందెంతో ఉందన్నమాట.'

ఒక కాలూ ఒక చెయ్యీ పూర్తిగా తీసెయ్యవలసివచ్చినా మోహన్‌లాల్‌లో ఆత్మవిశ్వాసం ఏమాత్రమూ తగ్గలేదు. అతని కళ్ళు మెరిశాయి.

'అబద్ధం చెప్పకుండా నా కళ్ళలోకి సూటిగా చూసి చెప్పండి. మీరు చెబితే నాకు నమ్మకమే. నేను దేశానికి ఇంకా సేవ చెయ్యగలను కదూ డాక్టర్! ఆటో మాటిక్ రైఫిల్ మళ్ళీ నా చేత్తో ఎత్తగలను కదూ! నా జన్మభూమిలోకి అన్యా

యంగా అడుగుపెట్టి ఆక్రమింపజూసిన ద్రోహిని ఒక్కణ్ణినా నేను కాల్చివెయ్య గలను కదూ డాక్టర్!'

మోహన్‌లాల్‌ని ఆగమని చెప్పి ఒక ఇంజక్షను ఇచ్చాను. వేడివేడి పాలు ఒక గ్లాసెడు తెమ్మని నర్సుతో చెప్పి అతనిచేత నెమ్మదిగా తాగించాను.

'మోహన్‌లాల్! పాతికేళ్ళ పడుచువాడివి నువ్వు. మండుతున్న రక్తం నీలో వుంది. పొంగి పొరలుతున్న దేశభక్తి నీ నరనరాల్లోనూ నిండి వుంది. వ్యక్తిగత రక్షణని ఏమాత్రం లక్ష్యపెట్టని చిత్తశుద్ధితో రెండు శత్రువుల టాంకుల్ని నాశనం చేశావు. మూడవది ఉపయోగం లేకుండా పిప్పిచేశావు. కాలూ చెయ్యీ విరిగి స్పృహ లేకుండా పడిపోయేదాకా శత్రువులతో పోరాడుతూనే వున్నావు. వెంటనే మన గస్తీదళాలు అక్కడికొచ్చి శత్రువుల్ని తరిమికొట్టి నీకు ఫస్ట్‌ఎయిడ్ యిచ్చి స్థానికవైద్యశాలలో సాధారణచికిత్స చేయించి వెంటనే నిన్నిక్కడికి పంపి వుండకపోతే నువ్వు మాకు దక్కేవాడివికాదు. ఏ రైలుకిందో ప్రమాదవశాత్తూ పడి నీ కాలూ చెయ్యీ విరిగిపోలేదు. కాలూ చెయ్యీ కానుకగా ఇచ్చిన నీ చరిత్ర దేశంకోసం ఒక్క రక్తబిందువు ఇవ్వడానికి ముందూ వెనకా ఆడే భీరువులకు గుణపాఠం.'

నే నింకా చెప్పబోతూఉంటే డాక్టర్ కృపాళ్‌సింగ్ వారించాడు. 'ఉద్రేకానికి సమయం కాదని రోగితో చెప్పి మీరే అలా ఆవేశపడితే ఎలా డాక్టర్...చూడండి అతని కళ్ళమ్మట ఎలా నీరు కారిపోతోందో! కన్నీరు తుడుచుకోడానికైనా అతనికి అవకాశం లేదే!'

ఒక గుడ్డ చల్లనినీటిలో తడిపి నేను మోహన్‌లాల్ మొహం తుడిచాను.

'ఇప్పుడు డాక్టర్ శశికాంతఘోష్ వస్తారు. మనం మెస్‌కి వెళ్ళొద్దాం రండి అన్నా డతను. నేను టైం చూసి లేచి నిలుచున్నాను.

'నా దగ్గరకు వచ్చి ఒకసారి కూచోండి డాక్టర్...నే నేం మాటాడను. మీ కళ్ళలోకి చూడను కూడా. నా గుండెమీద చెయ్యివేసి ఒక్క అయిదు నిమిషాలు ఇలా కూచోండి.'

'మీరు వెళ్ళిరండి కృపాళ్!...నే నిప్పుడే వస్తాను.'

ఆయన విసుక్కుంటూ వెళ్ళిపోయారు. నేను మోహన్‌లాల్ బెడ్‌మీద కొద్ది సేపు కూచున్నాను.

'మీరు చెప్పినట్లు కళ్లు మూసుకుని పడుకుని పూర్తిగా విశ్రాంతి తీసుకుంటాను గాని; డాక్టర్! నాకు యీ ఒక్కమాటకీ జవాబు చెప్పి వెళ్ళిపోండి. కళ్ళు మూసు

కునేసరికి మన సరిహద్దు దృశ్యమే నా బుర్రలో వుంటోంది ఒక్కొక్కప్పుడు శత్రువులమీద కసితో కోపంతో ఒణికిపోతున్నాను ఒక్క నిమిషమైనా వృథా చెయ్యకూడని యింతటి అత్యవసరస్థితిలో యిలా ఎందుకూ కాకుండా ఉండి పోయానే అనే నిస్సహాయస్థితి నన్ను క్రుంగదీస్తోంది ఆలోచించకుండా ఉండ డానికి మందేమీ లేదా డాక్టర్?' నేను లక్ష్మణసింగ్‌కి సంజ్ఞచేశాను వెంటనే అతనికి ఇంజక్షను ఇచ్చాము. మరొక పావుగంటకి అతను నిద్రపోతూఉన్నాడు

నేను ఇవతలి కొచ్చాను. ఆపరేషను థియేటరు తలుపులు తెరుచుకున్నాయి డాక్టరు ఆషాముఖర్జీ, అయిదుగురు అసిస్టెంట్లూ ఇవతలి కొచ్చారు. కేసు ఏమ యిందో ఒక డాక్టర్ని యింకో డాక్టరు అడిగి తెలుసుకోనక్కర్లేదు. మొహం చూస్తే చాలు. అబ్దుల్‌కరీమ్ ఆపరేషన్ విజయవంతం కాలేదన్నమాట. భక్తి గౌర వాలతో అతనికి నమస్కరించాను. సైనిక సంప్రదాయాలకు అనుగుణంగా అతని అంత్యక్రియలకు అప్పుడే సన్నాహాలు జరుగుతున్నాయి.

మేజర్ కరీమ్‌కు ఇరవై ఎనిమిదేళ్లట. లాహోర్ పొలిమేరలో ఒక కీలక స్థానంలోఉన్న శత్రువుల మిషన్‌గన్ స్థావరాలమీదకి తన ప్లటూన్ని ధైర్యసాహ సాలతో నడిపించి తీవ్రంగా పోరాడి అపారనష్టం కలిగించాడు. అతనికి మొదట రెండు తుపాకిగుండ్లు తగిలాయి. కాని అతను ఏమాత్రమూ జంకలేదట. మూడు టాంకుల్లో ఉన్న శత్రుసిబ్బందిని హతమార్చి ఆ టాంకులు వశపరుచుకున్నాడు ఆ సందర్భంలో అతనికి తొడలో మరొక గుండుదెబ్బ తగిలింది. ఆస్పత్రిలో చేర్చడం కొంచెం ఆలశ్యం అయింది. ఆరుగురు డాక్టర్సు అయిదుగంటలసేపు పరిశ్రమించినా లాభంలేకపోయింది. దేశచరిత్రకు మరింత దీప్తి కలుగజేసి కరీమ్ వీరస్వర్గ మలంకరించాడు.

అబ్దుల్‌కరీం నూటికి నూరుపాళ్లు మహమ్మదీయుడు. అయితేనేం, నూటికి నూరుపాళ్లూ భారతదేశపు బిడ్డ అతను. తల్లికోసం తనువు యిచ్చి ధన్యుడవడానికి అతన్ని భాషా, మతమూ అడ్డుపెట్టలేదు. మతవిభేదాలు ప్రవేశపెట్టి మనలో అంతః కలహాలు రేపుదామని పొరుగుదేశం అనుకోడం ఎంత వెర్రితనం!

మెస్‌కి వెళ్ళాలని ఆస్పత్రి మెట్లు దిగుతూ నా అలవాటుప్రకారం పాంటు కుడి జేబులో చెయ్యి పెట్టుకున్నాను ఏదో కాగితం తగిలింది – తీసి చూశాను అది చెల్లి రాసిన ఉత్తరం! పొద్దుట అది చదవగానే నా కడుపులో ఎవరో చెయ్యిపెట్టి దేవినట్టు అయిపోయింది

'ఇందర్ని ఇన్నివిధాల దుఃఖపెట్టి అక్కడ నువ్వు చేస్తున్న దేశసేవ ఏమిటి?' అనే ప్రశ్న నన్ను విడవకుండా వెంటతగిలింది, నేనిక్కడ ఉద్యోగంలో చేరినపుడు

'ఒక్క మనిషిని - నాకు పెద్ద ఖర్చేముంటుంది! నా జీతమంతా ఇంటికి పంపిం చేస్తాను నాన్న విశ్రాంతి తీసుకుంటారు ఇరవైనాలుగ్గంటలూ యింట్లో ఉండే ఒక పనిమనిషినీ వంటమనిషినీ పెట్టుకుంటే అమ్మకి యీ ముసలికాలంలో పని చెయ్యవలసిన అవసరం ఉండదు దేశంలో ఏర్పడ్డ క్లిష్టపరిస్థితి తొలగిపోయాక - అంటే ఆఖరికి యింకో ఏడాది పోయినతర్వాతయినా నాకు శలవు యివ్వకపోరు అప్పుడు వెళ్ళి అమ్మనీ నాన్ననీ చూసిరావొచ్చు. ఏమాత్రం అవకాశం ఉన్నా యిక్కడికి తీసుకురావొచ్చు!'

ఇలాంటి ఆలోచనలతో నన్ను నేను సమర్థించుకున్నాను. చెల్లి రాసిన ఉత్తరంతో వెనక్కి తిరిగి పంపబడ్డ నా మనియార్డరు కూడా జోడించి ఆలోచిస్తే ఏమని తేలు తుంది.

'నువ్వు మా కళ్ళెదుట ఉంటే అంతేచాలు. నువ్వు పెళ్ళి చేసుకుని నీ కుటుంబం మా ఎదుట కలకలలాడుతూ కాపురం చేస్తూంటే చాలు. నీ పెట్టుపోతలు మాకు అవసరమూ లేదు; మేము ఆశించనూ లేదు. బతికినన్నాళ్ళూ తలచి తలచి ఏడ్చు కునేలా అర్ధాంతరంగా నువ్వు అమ్మకి చేసిన లోటు తిరిగి ఏమిచ్చి పూడ్చుకోగలవు '

కలచివేసే ఈ ప్రశ్నకు నావద్ద జవాబు లేదు. ఈ ఉత్తరం చదివేక యింటి ధ్యాసే తప్ప నా మనసులో మరొక ప్రసక్తే లేదు. కాని నే నెప్పుడూ ఊహించని చిత్ర మొకటి జరిగింది. నేను అస్పత్రిలో ఎంత ఏకాగ్రచిత్తంతో పని చేసినా, అన్నిరకాల ఆలోచనలూ అమ్మతోనే అంతమయేవి. కాని ఆరోజు, నన్ను నిలు వెల్లా అశాంతితో దహింపచేసే అలాంటి ఉత్తరం వచ్చాక కూడా, అస్పత్రిలో అడుగు పెట్టినదగ్గిర్నుంచీ తిరిగి బయటకి వచ్చేదాకా నా కా విషయమే గుర్తుకు రాలేదు! తొందర తొందరగా మీ ఖ్స్ పూర్తి చేసి, ఒక్కసారి మొహం కడుక్కుని సిద్ధంగా ఉన్న జీపుమీద అస్పత్రికి వచ్చేశాను. జీపు ఆగగానే జేబులో చెయ్యి పెట్టుకు దిగేను. మళ్ళీ ఉత్తరం తగిలింది. పైకి తీశాను. ముక్కలు ముక్కలుగా చింపేసి గబగబ లోపలికి వెళ్ళిపోయాను.

ఏదో కొత్త ధైర్యం నాలో ప్రవేశించింది. నా కళ్ళముందు ఇన్నాళ్ళూ ఉన్నతెరలు తొలగిపోయిన ట్లయింది.

ఈ మిలటరీ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న ఈ రామూ, మోహన్‌లాల్ యిలాంటివారు సైనికవృత్తిలో అనేక శాఖలనుండి వచ్చినవారు. వీరిని చూడ్డానికి వచ్చేవాడు సాధారణంగా ఆ శాఖలో పని చేస్తున్న ఉద్యోగులు - లేదా స్నేహితులు. బంధువులు అనబడేవారు లేకపోలేదుగాని బహుతక్కువ. ఎందుచేత? వీరికి తల్లి

దండ్రులూ, అన్నదమ్ములూ ఎవరూ లేనేలేరా? అసలు వీరు ఏ ఉద్దేశంతో యుద్ధ రంగంలోకి దిగేరు?

ఆరోజు మొదలు రోగుల యోగక్షేమం, రోగ లక్షణం యివేకాక వారి సన్నిహితుల గురించికూడా కొంత భోగట్టా సేకరించడం ప్రారంభించాను. వారి గురించీ, వారివారిగురించీ, శ్రద్ధ చూపించడంలో నా గురించి నేను ఆలోచించడానికే తీరుబడి లేక పోయింది. ఎదుటివారిగురించి తెలుసుకున్నకొద్దీ చెరువులోంచి ఒక్కసారి నదిలోకి ఉరికిన చేపలా అయింది నా పని.

న్యూమోనియాతో బాధపడుతూ హై టెంపరేచరుతో మూలుగుతున్న నాయక్ రాజగోపాల్ సంగతే తీసుకోండి.

తను జోకొడితే గాని పడుకోని పాపని, తనొకసారి వీధిలోకి వెడితేచాలు, తనూ వస్తానని అల్లరి పెట్టి కళ్లు జ్యోతుల్లా చేసుకుని కుంచెడుసీళ్లు కార్చే పాపని ఒక్కసారి ముద్దుపెట్టుకుని శిల చేసుకున్న తన హృదయాన్ని అల్లుకున్న ప్రేమలతల్ని బలవంతాన తెంచి – టాటా చెబుతున్న బుల్లిబుల్లి చేతుల్ని మరొకసారి ముద్దుపెట్టుకుని సైనికజీవితంలోకి అడుగుపెట్టిన రాజగోపాల్‌ని ప్రేరేపించిన శక్తి పేరుఏమిటి?

బెడ్ నెంబర్ టెన్ – పైలట్ నటేశన్ కథ?

నటేశాన్ని వాళ్ళక్క మీనాక్షీఅమ్మాళ్ పెంచింది. తల్లి చచ్చిపోతూ నాలుగేళ్ళ తన కొడుకుని కూతురుచేతిలో పెట్టింది. మీనాక్షి అత్తమామలకేకాదు భర్తకికూడా యిష్టంలేదు నటేశన్‌ని పెంచడం. ఎన్ని విధాల నచ్చజెప్పినా భర్త వినలేదు. ఆఖరికి తల్లికిచ్చినమాట నిలబెట్టడానికోసం కాపురాన్ని ఒదులుకుంది మీనాక్షీఅమ్మాళ్!

'బెంగుళూరులో ఎయిర్‌ఫోర్సులో ఏవో వేకెన్సీస్ ఉన్నాయని పేపర్లో పడింది అక్కా! అప్లికేషన్‌ఫారమ్సు పంపమని రాశాను.' అన్నాడు ఒకనాడు నటేశన్.

'అది మిలటరీ సంబంధమైన ప్రకటన అనుకుంటాను.' అంది మీనాక్షి గంభీరంగా.

నటేశన్ అవునన్నట్టు తల ఊపాడు.

'నిన్ను పెంచి పెద్దవాణ్ని చెయ్యడంవరకే నా ధర్మం. ఆ తరవాత నీకేది మంచిదనితోస్తే అది చెయ్యడం నీ ధర్మం.' అని జవాబు చెప్పింది మీనాక్షి తొట్రుపడకుండా; అంతేకాదు, ఇండియన్ ఎయిర్‌ఫోర్సులో రెండేళ్లు ఉద్యోగం చేశాక ఫైటర్ పైలట్‌గా నీఫా ఏరియాకు ప్రమోషన్‌వస్తే తిలకంపెట్టి దీవించి పంపింది. తమ్ముడు వెళ్ళిపోయాక, తలుపు వేసేశాక రెండుచేతులూ మొహాన్ని కప్పుకుని ఒక్కసారి బావురుమంది!

సాధారణ జీవనసరళికి ఏమాత్రం పోలికలేని దనుకునే సైనికుల జీవితగాథలలో

కూడా ఎన్నెన్ని కదలించే దృశ్యాలు! అసలా జీవనవిధాన మెంతటి సాహసోపేత మైనదని! కనుచూపుమేర చెట్టయినా లేని మంచుమైదానాలలో, తమ ముందున్నది సమతలమో అగాధమో తెలియని కటికచీకటిలో, ఎటువంటి దీపమూ వెలిగించ కూడని పరిస్థితులలో, నీతినీ మానవత్వాన్నీ పూర్తిగా విస్మరించి వెన్నులో పొడిచే శత్రువుల సామీప్యంలో ఎన్నెన్ని గగుర్పొడిచే సన్నివేశాలు!! అన్యజీవనమార్గం దేనిలోనూ అడుగడుగునా ఆపదలూ, అపాయాలూ ఎన్నెన్నని!

డాక్టరు విజయకుమార్ సిగ్నలింగు ఆఫీసరుతో అన్నాడు: "మూర్తిగారూ! ఏ రోజు కారోజు సాధనచేసి, కర్తవ్యదీక్షలో ఎటువంటి బలహీనతలకూ అవకాశం లేకుండా యీ ఆస్పత్రినే నా యిల్లనీ, ఈ రోగులే నా రక్తబంధువులనీ ఎంచుకున్నాను. వీరి సేవలో ప్రతిక్షణం భగవంతుణ్ణి సేవిస్తున్నాను. నా విధినిర్వహణలో సర్వ శక్తులూ త్రికరణశుద్ధిగా కేంద్రీకరింపజేస్తున్నాను. దానికి ఫలితమా యిది?"

డాక్టరు కళ్ళమ్మట నీళ్లు జలజల కారిపోయాయి: "ఇంక యీ కళ్ళలో నీళ్ళకు తావు లేదనుకున్నాను. ఒక్క రోజులో ఇంత ఆస్పత్రి నేలమట్టమైనా ఆశల కూడలిని ముక్క ముక్కలు చేస్తుం దనుకోలేదు. పసిపిల్లలా నన్ను ప్రతిక్షణం పిలిచే, నా చెయ్యి గట్టిగా పట్టుకుని మృత్యువుతో పోరాడే ధైర్యం తెచ్చుకునే నా ఆప్తు లందరూ ఏమై పోయారు? జీవితంలో అనేకసార్లు ఓడిపోయాను. ఈ కొద్ది రోజుల విజయంతో సర్వమూ మరచిపోయి బతుకుతున్న నాకు, నా అన్నది నిమిషాలమీద నాశనమైపోతే ఏం చూసుకుని యింకా భరించమంటారు మూర్తీ! నే నెక్కడ అడుగుపెడితే అక్కడ శోకమయం, సర్వనాశనం. నే నిక్కడికి రాకపోయినా యింత ఘోరం జరక్క పోనేమో! నేను ఢిల్లీ వెళ్ళకుండా యిక్కడే ఉండి, వీళ్ళతో నాశనమై పోయినా నా ఆత్మకి యింత తృప్తి మిగిలేదేమో!"

శ్రీకృష్ణమూర్తి డాక్టరు శోకాన్ని ఆపడానికి ఏమాత్రం ప్రయత్నం చెయ్యలేదు. అలా చాలా సేపు తలచుకొని తలచుకొని విజయకుమార్ రోదిస్తూనేఉన్నాడు.

డాక్టరు చెప్పడం ఆపివేసిన పావుగంటసేపు యిద్దరూ అలా కూచున్నారు. తరువాత ముఖాలు కడుక్కుని టీ తాగేరు.

"మీ కథ విన్నాను, మీ కన్నీటిని గుర్తించాను. కాని మీ కన్నీటిని తుడవగల ననే ధైర్యం, నమ్మకం యింకా నా కుంది. ఒక కథ చెబుతా వినండి."

విజయకుమార్ జవాబుకైనా ఎదురుచూడకుండా సిగ్నలింగ్ ఆఫీసర్ శ్రీకృష్ణ మూర్తి యిలా చెప్పడం ప్రారంభించాడు

[ముగింపు వచ్చేసంచికలో]




'ప్రియమైన శ్యామలగారికి...

ఏవేవో గొడవల్లో మునిగి మీకు ఉత్తరం రాయటం చాలా ఆలశ్యం చేశాను.

ఆమధ్య మావూరునుంచి పాలేరు వచ్చాడు. వూళ్ళో కబుర్లన్నీ చెప్పాడు. నన్ను పెళ్ళి చేసుకోమని ఆజ్ఞ జారీచేసి మరీ వెళ్ళాడు. కాదంటే దెబ్బలాడతాడని బుద్ధిగా ఒప్పేసుకున్నాను.

అన్నట్టు ఈమధ్య మాలతి కొంచెం చనువుగా మాట్లాడుతోంది. ఓసారి అన్నాచెల్లెళ్ళిద్దరూ నా రూమ్‌కి వచ్చి కాస్సేపు కూర్చున్నారు. ముగ్గురం కలిసి సినిమాకి వెళ్ళాం. ఆ మర్నాడు సాయంత్రం వాళ్ళింటికి వెళ్తే కొంచెం తీరిగ్గా కూర్చుని మాట్లాడింది. ఆవిడ భర్తవిషయం తెచ్చి, ఏదో చెప్పాలని చెప్పలేక కంఠం పూడిపోయినట్టు మాటలు రాక మూగదానిలా కూర్చుంది. నేనేమీ రెట్టించలేదు. అసలావిడ భర్తని మర్చిపోతేగాని తేరుకోదు. పూర్వంకన్న యిప్పుడు కొంచెం నయం. కాస్త పుస్తకాలు చదవటంలో శ్రద్ధ చూపిస్తోంది. మొన్న నొకరోజు రాత్రివేళ మళ్ళా ఎటో వెళ్ళిందట. వాళ్ళన్నయ్యా వూళ్ళోలేడు ఆడవాళ్ళు కంగారుపడ్డారుట. చాలా సేపటికి వచ్చి ఏం అడిగినా జవాబు చెప్పకుండా పడుకుందట. ఆ కబురు వింటే నాకు చాలా బాధనిపించింది. డాక్టర్ ఫ్రెండ్ ఒకతనితో ఈవిషయం మాట్లాడాను. కృష్ణమూర్తితో చెప్తే మాలతిని తీసుకొచ్చాడు. డాక్టర్ పూర్వంవాళ్ళలాగే ఏమంత ఆశాభావం వెల్లడించలేదు. అయినా మందు లేవో రాసి యిచ్చాడు.

ఇలావుంది మాలతివిషయం!

సావిత్రిఅనే మా క్లయింటుగురించి కూడా రాయాలని అనుకుంటున్నారు.

పాపం చాలా అమాయకురాలు. ఇల్లాలిగా పిల్లలతల్లిగా నూటికి నూరుపాళ్ళూ ఇమిడిపోగలిగేవ్యక్తి- ముప్ఫై

పళ్ళు దాటివుంటాయి. బక్కపలచగా-చామనఛాయతో అందంగానే వుంటుంది. ప్రస్తుతానికి అరుగురు పిల్లలు-పుట్టెడుసంసారం. పాపం చాలా దయానీయమైన పరిస్థితిలో వుంది. భర్త వ్యసనాలకి లొంగిపోయి సావిత్రిని దాదాపు వదిలేశాడు. బావుందా?

సావిత్రికి పన్నెండేళ్ళనాడే పెళ్ళయిందట. చదువూసంధ్యా మానిపించి అత్తవారింటికి పంపించారు. పెళ్ళిలోనే కట్నాలదగ్గి రేదో పేచీ వచ్చింది. లాంఛనాలుకూడా ఘనంగా జరపలేక పోయాడు సావిత్రి తండ్రి. అసలు కలతలు అక్కడ బయల్దేరాయి. ఏడెనిదేళ్ళవరకూ కాపరానికే తీసికెళ్ళలేదు.

ఎలాగో వెళ్ళింది. కోడలు తీసుకురాని కట్నాలకోసం అత్తగారు సాధించే ఘడియల్లో తప్పితే కొత్తలో కొంతకాలం బాగానే వున్నారు. అతనికి వెనక ఆస్తేమీ లేదు. ఏదో చిన్న వుద్యోగం చేస్తున్నాడు. బాధ్యతలు గుర్తించిన వ్యక్తి లేమిలోకూడా ఒక రకమైన సుఖాన్ని అనుభవించగలడని నా అభిప్రాయం. కానీ అతని లేమి భార్యని వేధించటానికీ - దండించటానికీ బాగా సహాకరించింది. సంపాదించలేని సంపదకోసం అర్రులుచాస్తూ-క్షణక్షణమూ యింటినీ యిల్లాలినీ అసహ్యించుకొంటూ - పదేళ్లు కాపరం చేసి అరుగురు పిల్లల్ని కన్నాడు.

ఆ సంసారచరిత్రలో జరగని సంఘటన లేదు. ఎదుర్కోని సమస్య లేదు. ఇద్దరికీ హాయిగా గడిచిన రోజు లేదు.

ఇక పిల్లలసంగతా? అధ్వాన్నం. నిత్యం ఎవడికో ఒకడికి జబ్బు - ఆకలి జబ్బు. ఎదిగివచ్చిన పిల్లాడుకూడా చదువులో పడలేదు. తల్లిని లక్ష్యపెట్టడు. చెప్తే వినడు. వినేవిధంగా చెప్పే శక్తి ఏవిధంగానూ ఆవిడకు లేదు.

ఓ పూట పస్తుతో అయినా రోజు గడుపుకోవటమే ఆ ఇల్లాలి అభిమతం. అదే అసంభవమైంది. భర్తకి వున్న అలవాట్ల గురించి ఆవిడకు తెలియని దేమీ లేదు. తెలీకుండా వుంచాల్సిన అగత్యం కూడా ఆ మగమహారాజుకి లేదు. అతన్ని నోరు మూయించటానికి ఆవిడ దగ్గిర డబ్బులేదు.

నానారకాల వ్యాపారాలూ చేసి కొంచెం డబ్బు కూడబెట్టిన ఒక పెద్ద వయస్సు ఆడది అతన్ని దగ్గిరికి తీసింది. బాగా మచ్చికయ్యాడు. అంతరాంతరాల్లో ఎప్పుడేనా కలుక్కుమనే మమకారం కాస్తా మంటకలిసిపోయింది. పెళ్ళాన్ని ఎలాగైనా వదిలించుకోవాలనే ఆశతో తనకి చేతనైనంతవరకూ ప్రయత్నించాడు. ఆ పెళ్ళాం భారత నారీమణా? మరెవరోనా?

'మీ రేం చేసినా నేను అడ్డురాను. నన్ను వెళ్ళగొట్టకండి. పిల్లలకీ నాకూ




రోజు కొక్కపూట పిడికెడేసి కూడు పెట్టండి. రోజులు వెళ్ళమార్చేస్తాను. ఇల్లు దాటి బయట కెళ్తే ఈ పాడు ప్రపంచంలో బ్రతకలేను,' అం దా యిల్లాలు — తన యిల్లు తప్పితే మిగతా ప్రపంచ మంతా పాడైపోయిం దని భావించి తృప్తిపడుతూ.

ఆ తృప్తికూడా ఆవిడకు దక్కలేదు.

అతనే ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు.

ఆరుగురు పిల్లలు! ఆవురావురు మనే ఆకలి కడుపులు! పీక్కుతినే పుట్టెడు అప్పులు! ఇల్లు గల ఆసామీ గిన్నీ ముంతా బయటపడేసిన తర్వాత మాత్రమే ఆవిడ వీధిలో కాలుపెట్టింది— పుట్టిల్లంటూలేదు. తండ్రి నాలుగేళ్ళ క్రిందటే దిగులుతో మంచము పట్టి పోయాడు. అన్నదమ్ములు లేరు. ఉంటే వుద్ధరించేవారన్న ఆశలేదు. కనుచూపు మేరలో ఎవరూలేరు. అయినా పుట్టిన వూరే వెళ్ళింది. ఇక్కడే దగ్గర్లో ఏదో పల్లెటూరు. నాలుగురోజులుపాటు కాస్త ముక్కూమొహం తెలిసినవా ళ్ళంతా ఓదార్చి తిండిపెట్టారు. పిల్లలు ఆవురావురుమంటూ పూట పూటా సంబరంగా తిండి తిన్నారు.

చుట్టాల మర్యాద అయిపోయింది. ఎన్నిపూటలు ఎవరు చూస్తారు? ఎన్నిపొట్టలు మేపుతారు? — చిన్నా పెద్దా సలహా లివ్వటం మొదలు పెట్టారు. 'పెళ్ళాం బిడ్డల్నిలా వదిలేస్తాడా? వాడ్నాడిన ఆటల్లా సాగాల్సిం దేనా? వెధవని కోర్టు కెక్కించు. లెంపలు వాయించి మరీ బుద్ధి చెపు తారు. ఎన్నాళ్ళిలా కొంపలట్టుకు తిరుగు

తావు ?' అంటూ పూ ద ర గొ ట్టి మొత్తంగా ఆవిణ్ణి కోర్టుకి లాక్కొ చ్చారు.

బీదవాళ్ళని ఓకంట కనిపెడతాడని మా సీనియర్‌కి బాగా పేరుంది. ఓ పెద్దమనిషి సావిత్రిని వెంటబెట్టుకుని మా ఆఫీసుకు వచ్చి ప్లీ డ రు గా ర్ని చూపించి ఏదో పనిమీద ఆయన వెళ్ళి పోయాడు.

మా సీనియరు సావిత్రి గాథంతా నన్ను వినమన్నాడు. ఆవిడ ఎదురుగా నేను ఎక్కడ ఏడ్చేస్తానో నని హడిలి పోతూ విన్నాను. మారు మాటాడ కుండా.

అంతా చెప్పింది. చెప్పిందంతా రాశాను. నా మొహంలోకి పుట్టె డాశతో చూసింది. నేను మాట్లాడ కుండా ధైర్యం చెప్పాలని ప్రయత్నిం చాను. మా సీనియర్ ఏదో చెప్పాడు. మళ్ళా రమ్మన్నాడు.

భారమంతా మానెత్తిన పారేసి గుండెలు తేలికచేసుకుని వెళ్ళిపోయింది.

ప్రస్తుతం ఆవిడ పుట్టినవూళ్ళోనే ఓ పాకలో వుంటోంది. తెలిసినవాళ్ళ యిళ్ళల్లో ఆడవాళ్ళకి సాయంచేస్తోంది. అంట్లు తోముతోంది, బియ్యాలు బాగు చేస్తోంది, కారాలు దంపుతోంది. పెద్ద పిల్లాణ్ణి ఓ రైతుదగ్గర పాలేరుతనానికి కుదిర్చింది. కేసుకోసం రమ్మన్నప్పు డల్లా మాదగ్గిరికి వస్తోంది.

సావిత్రిగాథ బాగా ఆకళింపు చేసుకు కోర్టువారి కో పిటీషన్ పెట్టాను. సావిత్రిభర్త ఆవిణ్ణి అన్యాయంగా వదిలేశాడనీ, ఆవిణ్ణి తిరిగి భర్త ఏలుకునేపర్పాటు చెయ్యమనీ హృదయ పూర్వకంగా కోరాను.

ఆ పిటీషన్ ఇంకా కో ర్టు వా రి ముందుకు రా లే దు. రేపో మాపో వస్తుంది. చూడాలి కోర్టువా రేం చేస్తారో!

ఈ విషయమంతా మీకు ఎప్పుడో రాయాల్సింది. చెప్పాగా ఆలస్యం చేశానని.

చిరంజీవు లి ద్ద రూ క్షేమమని తలుస్తాను.

జవాబు రాయండి-

మిత్రుడు-శంకరం !'

వుత్తరం పూర్తిచేసి కవరు అంటించి మిగతావాటితోపాటు జేబులోవేసుకుని దారిలో పోస్టు చేద్దామని బయల్దేరాడు శంకరం.

* * *

"రండి, రండి," అంటూ నవ్వుతూ ఆహ్వానించింది మాలతి శంకరాన్ని.

"కృష్ణమూర్తిగారు లేరా?" అందా మనుకుని మానేశాడు శంకరం. కృష్ణ మూర్తే వుండాల్సిన అగత్యంలేదు. శంకరం తనతో మాట్లాడటానికే వస్తాడని మాలతికి బాగా తెలుసు.

శంకరం కుర్చీలో కూర్చుంటూ -




"సావిత్రి అని మా క్లయింట్ ఒకావిడ గురించి చెప్పాను, మీకు గుర్తుందా?" అన్నాడు.

"ఆఁ ఆఁ, భర్త వదిలేశాడనీ ... పిల్లలనీ..."

"ఆవిడే. డిక్రీయిచ్చారు. ఇవ్వాళే."

"అంతే ?"

"కోర్టువారు సావిత్రి మొగుణ్ణి బాగా చివాట్లుపెట్టి భార్యని తక్షణం తీసికెళ్ళి ఏలుకోవాలని తీర్పు చెప్పారు."

"ఆహాఁ? ఏమన్నాడు తను ?"

"ఏమంటాడు కోర్టులో? మొహం దించుకుని వూరుకున్నాడు."

"పోనీలెండి. ఆవిణ్ణి గట్టెక్కిం

చారు. పిల్లలతో నానా బాధలూ పడుతోంది. అయితే ఎప్పుడు వెళ్తుంది?"

"ఎప్పుడోనా? ఈపాటికి మూటా ముల్లే సర్దేసివుంటుంది. ఏనుగెక్కినంత సంబరంగా వుం దావిడికి. మీ ఋణం తీర్చుకోలేనంటూ నాకు తెగ నమస్కారాలు చేసింది, ఎంతచెప్పినా వినదే!"

"పాపం ఆవిడ తాపత్రయం మీకేం తెలుస్తుంది? పరాయివాళ్ళ పంచన పడివుండేకన్నా ఆ మొగుడిదగ్గిరే వుండటము ఆడవాళ్ళకి తృప్తికదా!"

"చూడండి. మీ రిలా మాట్లాడటం నాకు నచ్చలేదు - బొత్తిగా నచ్చలేదు. నిజం చెప్పాలంటే ఇలాంటి ఆడవాళ్ళంటే నాకు అసహ్యాం. మీ భర్తతో మీరు హాయిగా వుండేవారు నిజమే. మీ అనుభవాలతో లోకాన్నంతా సమర్థిస్తానంటే ఎలా వీలౌతుంది? ఒక్కటి చెప్పండి సావిత్రి ఏం చూసుకుని భర్తదగ్గిరికి పరిగెడుతోంది?"

"అవుననుకోండి; సంసారం అన్న తర్వాత ఎన్నో వస్తూంటాయి. కష్ట సుఖాల్ని సమంగా భరించాలంటారుగా?"

"ఎవరు? తీరి కూర్చున్నవాళ్ళా?"

"మీకు బాగా కోపం వచ్చేస్తోందే! అయితే మీ రీ కేసెందుకు చేశారు?"

"నా డ్యూటీకాబట్టి. మనస్ఫూర్తిగానే చేశాను. వాళ్ళిద్దరూ సుఖంగా వుండాలనే నా కోరిక. అయితే ఈ పద్ధతిలో మాత్రం కాదు. ఆవిడతో చెప్పొకూడా - 'అప్పుడే తొందరపడి వెళ్ళకండి. అతనే వచ్చి పిలుస్తాడు.' అన్నాను.

'ఫర్వాలేదు బాబూ! నాయింటికి నేను వెళ్తాను?' అంది. ఈవిడ అడియాసేగానీ యిల్లూలేదు, వాకిలీ లేదు. మరి ఎక్కడికి వెళ్తుందో!''

"మాలతీ! కాఫీ తీసుకెళ్ళమ్మా!'' ఇంట్లోంచి పిలుపొచ్చింది.

మాలతి లేచి వెళ్తోంటే తల్లి కాఫీ గ్లాసు తీసుకుని ఎదురువస్తూ - "మూర్తి మీగురించి చాలాసార్లనుకున్నాడు బాబూ!" అంటూ శంకరానికి గ్లాసు అందించింది.

"ఇవ్వాళ కన్పించే వెళ్తానండీ. నేనూ అదే అనుకుంటున్నా," నన్నాడు శంకరం. "కబుర్లలోపడి మర్చేపోయాను. పిల్లలేరీ?" అంటూ నాలుగుపక్కలా చూశాడు.

''వాళ్ళమ్మతో పేరంటానికి వెళ్ళారు."

"మీరు వెళ్ళ..." సగంలో ఆపేసి నొచ్చుకుంటూ - తమాయించుకుంటూ కాఫీతాగటం మొదలుపెట్టాడు.

మాలతి లోపలికి వెళ్ళి చలంపుస్తకం తీసుకొచ్చింది.

"చదివేశారా? ఎలా వుంది?"

"బాగానే వుంది. నాకుమాత్రం ఏమీ అర్థంకాలేదు."




"అంత అర్ధంకాని దేముంది? చలం చాలా వివరంగా చెప్తాడే!"

మాలతి శంకరానికి ఎదరగా టేబుల్ నానుకుని నించుంది

"చదివింది అర్థంకాలేదని కాదు, అలా రాయటంలో అతనితర్కం అర్థం కాలేదు మీరేవున్నారనుకోండి మీకు ఓ అక్కకూతురు వుంటే పెళ్ళి చేసుకో వచ్చును. అన్నకూతురు వుంటేకూడా పెళ్ళి చేసుకోవచ్చునట ఎలా వుంది?"

"అవును అతను తార్కికంగా చెప్పాడు సైన్స్ కూడా అతని తర్కాన్ని ఒప్పుకుంటుందికదా?"

"ఛ! సైన్స్‌ని అడ్డం పెట్టుకుని సెంటిమెంట్స్‌ని ఖూనీచేయకండి. అలా అయితే తల్లీకొడుకుల సంబంధానికి — పోనీ అదేవరస వ్యక్తుల సంబంధానికి సైన్సేం అడ్డు చెపుతుందా? ఇక

స్త్రీ పురుష సంబంధాలలో నిషేధ మేముంది? పోనీ నేను సెంటిమెంట్స్ సంగతి ఎత్తను ఒక ఆడదానికి ఏ మగవాడినైనా పెళ్లి చేసుకునే అర్హత వుంటుందా?"

"ఎలా వుంటుంది? తండ్రినీ–సహో దరుల్నీ పెళ్లి చేసుకోకూడదు కదా! చలంకూడా అది ఒప్పుకుంటాడు "

"అంటే తండ్రివరసకీ – అన్నద మ్ముల వరసకీ వ్యతిరేకమైన వరస కల వాడే భర్త కావాలి దీన్ని కూడా ఒప్పుకుంటాడా?"

"ఒప్పుకుంటాడేమో! కానీ మిగతా బంధువుల వరసలన్నీ, మనం పెట్టు కున్న వేకదా?"

"మేనత్తనీ పినతండ్రుల్నీకూడా మనమే సృష్టించుకున్నామా?"

"ఏమిటో మీ రివ్వాళ లాయర్‌లా వాదించేస్తున్నారు "

"అలా దాటవెయ్యకండి నిజం చెప్పండి మతాలు మారితే అత్త పిన్ని అయింది పిన్ని అత్త అయింది అంతే గాని అసలు పిన్నీ అత్తా లేకుండా పోలేదు కొన్నివరసలు సంబంధాలు పెట్టుకోదగ్గవిగానూ – కొన్ని పెట్టుకో కూడనివిగానూ అన్ని మతాల్లోనూ ఏర్పాటయ్యాయి వాటిని తలక్రిం దులు చేసి ఇప్పుడు కొత్తగా కనిపెట్టిం దేమిటి? చలం అసలు తనవిలువ తను తెలుసుకోలేకపోయాడు లేకపోతే ఇలాంటి అనవసరపు విషయాల్లో తల దూర్చివుండడు "

మాలతి మాట్లాడే ప్రతీమాటా శంకరం కుతూహలంగా విన్నాడు.

"ఈ పుస్తకం చదివిన దగ్గిర్నుంచీ ఒకటే ఆలోచన. మా అన్నయ్యకూడా చదివాడు ఏమీ అనలేదు మరి."

"అదికాదండీ! చలం సనాతనాచా రాలమీద విపరీతమైన అసహ్యంతో – కసితో – పొంగిపొర్లుతోన్న ఆవేశంతో ఏదితోస్తే అది రాసేశాడు కొన్ని కొన్ని విషయాల్లో తొందరపడ్డాడు మరి. ఇవ్వాళ చెప్పిన అభిప్రాయాన్ని రేపు మార్చేసుకున్నాడు, అతను – ఏప్పు డెప్పుడు ఎలా విశ్వసించాడో. అదే మనకి చెప్పాడు –

'దేవుడు లేడు, నేను చెప్తున్నాను మీరు నమ్మకండి,' అన్నాడు కొంత కాలం

'ఉన్నాడు. నేను మార్చేసుకు న్నాను మీరూ నమ్మకండి,' అన్నాడు. 'నేను వలచింది రంభ, నేను మునిగింది గంగ,' అంటూ పిడివాదం చేశాడు కొన్నికొన్ని విషయాలలో. ఈ మిన హాయింపు లన్నీ తీసేసినా చలానికి, ఆరాధింపబడే అర్హత ఎంతో వుంది. అందుకే నేను చలాన్ని ఒకలా ప్రతిభా వంతుడైన రచయితగా – నిజాయితీ గల సంస్కర్తగా ప్రేమిస్తాను,'' అన్నాడు శంకరం దృఢంగా.

"నిజమే, చలం అంటే నాక్కూడా ఎంతో యిష్టం."

"హమ్మయ్య! ఇప్పటికైనా మీరు నాతో ఏకీభవించారు."

"అదేంమాట? ముందు మీరే నాతో ఏకీభవించారు," అంది నవ్వుతూ మాలతి – "మా బావకికూడా ఇలా రచయితల్నిగురించి మాట్లాడుకోవటం అంటే చాలా యిష్టం. అప్పుడు నాకు బాగా తెలిసేదికాదు. ఏవేవో చెప్పి... వినమని ... గొడవ పెడుతూవుండే వాడు" చెప్తూ చెప్తూనే మాలతి మొహం చిన్నబోయింది; దిగులు ఆవరించినట్టు నవ్వు మాయమైంది.

శంకరం ఓదార్పుగా – "ఆయన బాగా పుస్తకాలు చదివేవారా?" అన్నాడు.

"బాగా ఏమిటి? అదో పిచ్చి. డబ్బంతా పుస్తకాలకే తగలేస్తావని మా అత్త తిట్టేది. చినిగిపోయిన బట్టలతో కాలం గడుపుతూన్నా ఎక్కడెక్కడికో రాసి బోలెడు. పుస్తకాలు తెప్పించుకునేవాడు. మొన్నటివరకూ అన్నీ మా అత్తదగ్గిరే వుండేవి. నాకిమ్మంటే ఇవ్వనంది. పోనీ తనైనా వుంచుకుందా? ఎవరో చవగ్గా కొనుక్కుంటామంటే అమ్మేసింది."–గ్రుడున కన్నీళ్ళు తిరిగాయి మాలతి కళ్ళలో. చటుక్కున ఒత్తుకుంది.

"బాధ పడకండి; అంతా అయిపోయింది." ఓదార్చటంకూడా అన్యాయంగానే వుంది శంకరానికి. ఇద్దరూ హఠాత్తుగా మాటలు మానేసి కూర్చున్నారు – ఎంతకీ కృష్ణమూర్తి జాడ లేదు.

"మరి నేను వెళ్తాను; కృష్ణమూర్తి వస్తే చెప్పండి," అంటూ లేచాడు శంకరం. చలం పుస్తకం అందుకున్నాడు. మృదువుగా మాలతి మొహం కేసి చూశాడు.

ఆ మొహంలో వున్న సౌందర్యం విషాదంలో ఇనుమడిస్తుంది. చంటిబిడ్డ అలిగినట్టు బుజ్జగించ బుద్ధి వేస్తుంది. నిజంగా రామం దురదృష్టవంతుడు!

* * *

శ్యామల శంకరానికి చాలా పెద్ద వుత్తరం రాస్తూ, శంకరం పెళ్ళి విషయం ప్రస్తావించింది– "మొన్న నాన్నగారుకూడా మీ మాటే అన్నారు– 'అతను తండ్రి అండ ఏనాడో వదులుకున్నాడు. మనంకూడా యిలా వూరుకోవటం బాగాలేదమ్మా! నే నడిగితే సిగ్గుపడతాడేమో! నువ్వు రాసి చూడు. అతనుకూడా ఓ యింటివాడయితేగానీ నాకు తృప్తిగా లేదు,' అంటూ చాలాసేపు ఆలోచించారు మీ విషయం.

మిమ్మల్నికూడా ఓ కొడుకుగా ఎంచుకుని– అన్నయ్యపెళ్ళి చేసినట్టే అర్భాటంగా మీ పెళ్ళి చెయ్యా

ఉని వుంది నాన్నకి అయినా మీ కిప్పు డేం కొరత? ఏ వయస్సులో అవస రాలు ఆ వయస్సులో తీరాలి, లేక పోతే ఎలాంటివాళ్ళయినా తప్పుదా రులు పట్టే ప్రమాదం వుంది. మీ రేమీ అపార్థం చేసుకోరనే ధైర్యంతోనే ఇలా రాస్తున్నాను

నా దృష్టిలో ఇద్దరు ముగ్గురు ఆడ పిల్లలున్నారు చదువుకున్నవాళ్ళే ఒకపిల్ల మరీ అందంగా వుంటుంది, కాస్త సింగారించుకుంటే ఆడవాళ్ళకే కొరుక్కుతినాలని బుద్ధిపుడుతుంది. కొంచెం పేదవాళ్ళు ఆ పిల్లని చూసి నప్పుడల్లా మీరే నాకు జ్ఞాపకంవస్తారు ఎవరూ ఎత్తుకుపోకుండా అపిల్ల నెలా గైనా మీకు దక్కించాలని నా తాప త్రయం

మీ అర్ధాంగి అయే అమ్మాయి చాలా అందగత్తె అయివుండాలి - ఇది నా షరతు

చదువుకున్న దై వుండాలి - ఇది మీ షరతు

పోతే గుణం - అది ఎవరూ నిర్ణ యించగలిగేది కాదు ఓ గయ్యాళి పిల్లని తెచ్చి మీకు కట్టినా మూడు రోజుల్లో మంత్రం వేసినట్టు మారిపో తుందని నేను రాసియిస్తున్నాను నమ్మకం లేకపోతే ఈ వుత్తరం జాగ్ర త్తగా దాచండి.

మీకేమీ అభ్యంతరం లేకపోతే ఓ సారి ఆ అమ్మాయిని చూడటానికి రండి ఏమో రాశానని అశ్రద్ధ చెయ్యొ వద్దు. వెంటనే ఆలోచించుకుని వుత్తరం రాయండి

అన్నట్టు మీ క్లయింటు సావిత్రి కాపరానికి వెళ్ళిందన్నారు కదూ? మీ కేమైనా వుత్తరం రాసిందా?

ఆమె సంసారం చక్కదిద్దిన పుణ్యంతో ఈ సంవత్సరం మీకు తప్ప కుండా పెళ్ళవుతుంది," అంటూ సర దాగా రాసింది వుత్తరమంతా

శంకరం .ఆలోచించాడు పెళ్ళి గురించి కొత్తగా ఆలోచించాల్సిం దేముంది? తను ఎప్పుడూ సుముఖుడే. ఇప్పుడు ఆర్థికంగా యిబ్బందిలేదు ఫర్వాలేదు, ఏదో సంపాదిస్తున్నాడు ముందు ముందు కాస్త తల ఎత్తుకు నిలబడగలిగే సూచనలున్నాయి వయస్సా? పెళ్ళి చేసుకుతీరాల్సిందే.

ఎన్నో రాత్రుళ్ళు ఒట్టి వూహాలతో జాగారాలు చేస్తున్నాడు.

ఒక అందమైన అమ్మాయిని చూసి యిష్టపడి పెళ్ళి నిర్ణయించుకోవాలి. వెంటనే యిల్లు మార్చేసి పెద్దయిల్లు తీసుకోవాలి ఇంట్లోకి ఏం కావాలో అన్నీ కొనమని శ్యామలగారితో చెప్పాలి.

పెళ్ళికూతురు యింటికి వచ్చేసరికి దేనికీ లోటు లేకుండా అమర్చాలి తననీ ఇంటిని చూసి ఆఅమ్మాయి ఆశ్చర్యంతో




ఆనందంతో వుక్కిరిబిక్కిరై తనంటే నమ్మకం – అనురాగం ఏర్పర్చుకోవాలి.

జీవితమంతా ఆమె అభిప్రాయాలు సడలిపోకుండా కాపాడుకోగల్డు తను

తనని పెళ్ళి చేసుకోవటానికి యిష్ట పడిన ఆ అమ్మాయి తన జీవనజ్యోతి! ఎక్కడో పుట్టి పెరిగి – ముక్కూ మొహమూ తెలియని తనని నమ్మి – తన వెంటపడి వచ్చి జీవితమంతా తనని అంటిపెట్టుకువుండే వ్యక్తి విలువ సామాన్యమైనదా? తన సహచరిని ఎంతో అపురూపంగా చూసుకోవాలి తను, నాన్నలా కాదు సావిత్రి మొగుడులా కాదు

— శంకరం, వుత్తరం చేతుల్లో పట్టుకుని ఆలోచిస్తోనే వున్నాడు –

'శ్యామలగారికి జవాబు రాసేస్తే? పీలు చూసుకుని వెళ్ళి, ఆ మరీఅందమైన అమ్మాయిని చూస్తే ?'

ఎటూ తెగలేదు.

గేటు తీసుకును మాలతి మేనల్లుడు హారిని వెంటబెట్టుకు వస్తూ కన్పించింది గది కిటికీలోంచి కంగారుగా లేచాడు శంకరం. గదిలోంచి చీడీలవరకూ వెళ్ళేసరికి మాలతే ఎదురైంది

చేతిలో 'బడదీదీ' వుంది

"ఇది ఇచ్చేసి మరేదేనా పట్టుకెళ్దామని వచ్చాను," అంది సహజంగా

"అరే! నేను తెచ్చేవాణ్ణిగా? ఈ మాత్రానికి ... మీరు వచ్చారా? రండి... రండి," అంటూ లోపలికి ఆహ్వానించాడు, మాలతిని ఎగాదిగా చూస్తూ — పరాకుగా లేదుకదా? — హారినిచూస్తూ నవ్వి — "చిన్నచుట్టం కూడా వచ్చాడే! ఇంకేం? కూర్చోండి," అంటూ కుర్చీలు గుమ్మం దగ్గిరికి జరిపాడు.

"ఇక్కడ కూర్చుంటాలెండి," అంటూ మాలతి గదిలో కిటికీదగ్గిర కూర్చుంది హారి కిటికీలో ఎక్కి వీధిలోకి చూస్తూ కూర్చున్నాడు

"మీ రెక్కడికైనా వెళ్దామనుకుంటున్నారా?"

"లేదు ఏవో వుత్తరాలు రాద్దామనుకున్నాను ఫర్వాలేదు"

"పోనీ నాకేదైనా పుస్తకం యివ్వండి వెళ్తాను. అమ్మకూడా తొందరగా వచ్చెయ్యమని చెప్పింది."

"అంత తొందరేం? నా వుత్తరాలకేం అర్జంటులేదు."

"అయినా చీకటిపడితే వెళ్ళలేను."

"ఫర్వాలేదు నేనూ వస్తాను"

శంకరం లేచి అల్మెరాలోంచి బిస్కెట్లుపేకెట్ తీసి రెండుప్లేట్లలో పెట్టాడు

"బావుంది మీకి శ్రమకూడానా?" అంది మాలతి చిరునవ్వు నవ్వుతూ

మాలతి అలా నవ్వినప్పుడు శంకరం తన్మయంగా చూస్తాడు మూతి ముడుచుకుని కళ్ళతో నవ్వుతుంది మొహంనిండా ఎంత కాంతి వస్తుంది! మాలతి ఒంటి తెలుపూ — ముఖ కవళికలూ — కళ్ళెత్తి చూసే చూపూ — అంతా ఎంతో అపురూపంగా తోస్తుంది నవ్వేమాలతిని చూస్తోన్నంతసేపూ దేవకన్యని చూస్తోన్నట్టే వుంటుంది శంకరానికి

"శ్రమేమిటండీ? సమయానికి ఇవైనా వున్నాయి మీకూ నాకూ ఎక్కర్లేకపోయినా పిల్లాడున్నాడు కదా?" అంటూ ప్లేటు టేబులుమీద పెట్టాడు శంకరం

"అంటే నన్ను తినొద్దనా?" నవ్వింది.

"అనండి మీరు అతిధికదా? ఎన్నయినా పడాలి"

"అబ్బా! ఏం గృహస్థు! రెండేసి బిస్కట్ల ఆతిధ్యమే కాబోలు"

"పోనీ, నా స్వహస్తాలతో వండి పెడతాను, వుండిపోతారా?" మాలతి మొహంకేసిచూస్తూ నవ్వాడుశంకరం.

"వుంటాను,ఏం కూరలొండుతారు?''

''మీ కేం కావాలో చెప్పండి, క్షణాలమీద వండేస్తాను "

''నాకా ?...నాకేమో...ఆకాకర కాయవేపుడూ...పనసపొట్టు పులుసూ ...కరివేపాకు పచ్చడీ...''

నిర్మొహమాటంగా చెప్పాడు శంకరం "ఈ మర్యాదలు నావల్ల కావు, చుట్టంగారూ!" – ఇద్దరికీ నవ్వొచ్చింది

"కబుర్లతో కడుపు నింపారుగానీ కొంచెం మంచినీళ్ళివ్వండి ఓహో! ఇక్కడే వుందిగా కూజా! నే తెచ్చు కుంటా లెండి ''

మాలతి లేచేసరికే శంకరం మంచినీళ్ళందించాడు.

''నేను వచ్చి మీ పను లేం పాడు చెయ్యలేదుకదా?'' మళ్ళా అంది మాలతి బిడియపడుతూ

''ఎందుకండీ అంతమోమాట పడ తారూ? నేను వచ్చి మీ యింట్లో గంటలతరబడీ కూర్చోటంలేదూ?''

''అది వేరు నాకేం పనిపాటాలేదు. మీ కెన్నో వ్యవహారా లుంటాయి.''

"అయితేమాత్రం! ఈ అరగంటా నా రాచకార్యా లేమీ ఆగిపోవటం లేదు మీరు మాత్రం ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చోకండి '' ప్రసక్తి మారుస్తూ అన్నాడు – ''బడదీదీ ఎలా వుంది మీకు?''

వెంటనే మాట్లాడలేదు మాలతి కొంచెం ఆలోచించుకుంటోన్నట్టు వూరుకుంది–"చవుదుతోంటే బాగానే వుంది కానీ అలా జరగటం నా కేమిటో అబద్ధంలాగా అన్పించింది "

''అంటే?''

"పెళ్లయి భర్తతో కొన్నేళ్లు అన్యోన్యంగా కాపరం చేసిన ఆడది – భర్త పోతే మాత్రం, మరో మగవాడికోసం అంత బాధపడటం సహజంగా వుందా?" చూస్తోండగానే మాలతి మొహం చిన్న బోయింది తనగురించే ఎవరో అన్యాయంగా కథ రాసినట్లు దిగులుగా, పౌరుషంగా చూసింది

శంకరం మృదువుగా అన్నాడు – "చూడండి – ఈ కథగురించి మీ దగ్గర తర్కించాలంటే చాలా డెలికేట్‌గా వుంది నాకు. కొంతముంది రచయితల మీద నాకు అపారమైన విశ్వాసంవుంది అందులో శరత్ ఒకడు అత నేం రాసినా అకారణంగా అసమంజసంగా రాయడు. మాధవేకాదు – మరే ఆడదైనా మొగవాడైనా కలకాలం అను భూతుల్ని బంధించి దాచుకోలేరు ఆ శక్తి అసలు మానవుడికిలేదు పోయిన వాళ్ళని పూజిస్తూనే బ్రతికినవాళ్ళ మీద మమత లేర్పర్చుకోవటంలో అసహజ మేమీలేదు ''

"అది తర్కంవరకే. నిజంగా అలా మారటం సాధ్యంకాదు అభిమానాలూ అనురాగాలూ అంత అబద్ధం అయి పోతే ఇక మనిషికి మిగిలే దేమిటి?"

"అబద్ధం అని ఎందు కనుకుంటూరు? అవి ఎప్పుడూ నిజమైనవే. కానీ గడిచి పోయినవి తిరిగిరానివి. వాటికోసం జీవితమంతా వేదనపడటంలో అర్థం లేదు. అలా అయితే పోయిన భర్తల కోసం - భార్యలకోసం - తల్లులకోసం - పిల్లలకోసం-మిగతావాళ్ళు విరక్తితో క్రుంగిపోతే ఇక లోకం ఇలా సాగేదా? ఒకకష్టం సంభవించినప్పుడు బాధపడ టము ఎంత సహజమో క్రమంగా దాన్ని మర్చిపోవటంకూడా అంత సహజం. లేకపోతే మనుషులు ఏనాడో అంతరించిపోయేవారు."

శంకరం తన కేదో బోధించాలని ప్రయత్నిస్తున్నట్టు తప్పితే అతని మాటల్లో నమ్మదగ్గ దేమీ కన్పించ లేదు మాలతికి. అప్రసక్తి తన కిష్టం లేనట్టు పూరుకుంది.

"పోనీ ఒకటి చెప్పండి - మీరు పోయి - ఆయనే వుంటే, ఇన్నాళ్ళు యింత జ్ఞాపకంగా మిమ్మల్ని తల్చు కునేవారేనా?" అన్నాడు శంకరం పట్టుదలగా.

మాలతి శంకరం మొహంకేసి సూటిగా నిష్ఠూరంగా చూసింది- "మా బావగురించి మీ కేమీ తెలీక అలా అనేశారు. నిజంగా నేనే పోయి తనే వుంటే దిగులుతో కొన్ని నెలల కన్నా ఎక్కువ బ్రతికి వుండేవాడు కాదు. నేనుకాబట్టి... మోడులా... జీవచ్ఛవంలా..."తల దించేసుకునేసరికి కన్నీళ్ళు రాలిపడ్డాయి.

శంకరం కంగారుపడ్డాడు.మాలతిని తదేకధ్యాసతో నిశ్శబ్దంగా చూస్తూ కూర్చున్నాడు కొంచెం సేపు - "ఆయన్ని నే నేదో అన్నానని మీరు బాధపడొద్దు. సాధారణంగా మగవాళ్లు ఎలాంటి కష్టాన్నయినా తొందరగా మర్చిపోతారని అలా అనేశాను; అంతే. మరేం లేదు," అన్నాడు దోషిలా.

"దాని కేం లెండి. సామాన్యంగా అందరూ అన్నట్లే మీరూ అన్నారు. మా బావ మనస్సు నాకు తెలిసినట్లు మీకెలా తెలుస్తుంది? తనకి తోడబుట్టిన వాళ్ళెవరూ లేరు. నేనంటే చిన్నప్ప ట్నుంచీ చాలాయిష్టం. మరేపిల్లనైనా చేసుకుంటే కట్నం బాగా యిస్తారని మా అత్త ఎంత చెప్పినా వినకుండా నన్ను చేనుకున్నాడు;'' మాలతి పూరు కుంది కాస్సేపటికి- "నన్నెంత అపు రూపంగా చూసేవాడో ఇప్పుడు చెప్పలేను," అంది- "నిజంగా ఒక్కో సారి ఆ అభిమానం వెక్కసమై విసు గొచ్చేసేది- 'నీ మంచితనంతో నన్ను ఏడిపిస్తున్నావ్,' అంటే 'అయితే నేను చెడ్డవాణ్ణే; ఏడిపించటం మంచి

వాళ్ళ లక్షణంకాదే!'' అనేవాడు" మాలతి మొహంనిండా విషాదం ఆవరించింది కలలో ఎవరితోనో మాట్లాడుతోన్నట్టు - దిగ్భ్రమగా అంది- "ఇప్పుడు తల్చుకుంటే అంతా కలలా అయోమయంగా వుంటుంది బావతో ఒకసారికూడా తృప్తిగా మాట్లాడలేదేమా అని దిగులు ముంచుకొస్తుంది. ఏదేనా దేవుడు వరం యిచ్చి బావని ఒక్కసారి నాకు చూపిస్తే..." మాలతి కంఠం బరువుగా అయిపోయింది దుఃఖం తొణికిసలాడుతోన్న ధ్వనితో- ''చూస్తోండగానే ఎంత మార్పు! పాషాణంకన్న బండబారి పోయానండీ! ఇక నా మీద పిడుగులు పడ్డా నా కేం ఫర్వాలేదు," తనని తను నిందించుకుంటూ దిగులుగా నవ్వింది

శంకరం మనస్సు విలవిల్లాడింది. అనునయంగా అన్నాడు - "మిమ్మల్ని చూస్తోంటే నాకే పుట్టెడు దుఃఖం వస్తోంది. ఇక మీ రెలా భరిస్తున్నారో భగవంతుడికే తెలియాలి ఎందు కిలా మిమ్మల్ని మీరు బాధపెట్టుకుంటారు? ఎంత ఆప్తులు దూరమైపోయినా మిగిలినవాళ్ళు గాలి పీలుస్తోన్నంతకాలం తినక తప్పదు, తిరక్క తప్పదు ఎంత ప్రేమవుంటేమాత్రం చావు వస్తుందా? ఇవ్వాళ ఈ కష్టం మీ కొక్కరికే వచ్చిందా? ఒకొక్కజీవితం ఒకొక్క రకంగా అవుతుంది గతమంతా నవ్వు కుంటూ ఎంతకాలం యిలా దిగులు పెట్టుకుంటారు? కాలమంతా యిలా జరుగుతుందని మీకు నమ్మకంవుందా? రోజులన్నీ ముందే వున్నాయి. మీరేదో ఒకదారిన పడాలి, ఒకగమ్యం ఏర్పరచుకోవాలి అన్నిటికీ మూలం మీ రాయన్ని మర్చిపోవాలి," ధైర్యంగా అన్నాడు శంకరం

"ఎవర్ని? మా బావనా?" కళ్ళెత్తి ఆశ్చర్యంగా చూసింది బావనే మర్చిపోయింతర్వాత నే నిక బ్రతక్క పోతేనేం?" అంది నిర్లక్ష్యంగా

"అదేంమాట? తనని తల్చుకుంటూ మిమ్మల్నిలా కృంగిపొమ్మని - ఆయన మాత్రం ఆదేశిస్తాడా? కనీసం ఆయన్ని పదికాలాలపాటు స్మరించుకోవటాని కైనా మీరు బ్రతకాలిగదా!''

"అందుకే నేను బ్రతుకుతున్నాను."

"ఇలా కాదు. గతాన్ని గతంలాగే వదిలేసి సంతోషంగా సుఖంగా వుండాలి మిగతాకాలం ఎలా గడపాలో ఒకనిర్ణయం చేసుకోవాలి మీరు మనసు తేలిక చేసుకోకపోతే మీ ఆరోగ్యంమాత్రం ఎలా బాగుపడుతుంది?"

"అసలు బాగుపడకూడదు. ఎంత తొందరగా చెడిపోతోంటే అంత సంతోషం నాకు చివరికి ఎలాగూ పోవాల్సిందే జీవితమంతా ఏకాకిగా బ్రతికేకంటే తొందరగా ఈ జీవితం అయిపోతే బావుండునని ప్రతీక్షణం కోరుకుంటున్నాను.''

శంకరం యిక మాలతితో తర్కించ దల్చుకోలేదు శాశ్వతంగా దూరమై పోయినవాళ్ళని అంతరంగంలో సజీవంగా నిలుపుకోగలిగే ఆర్ద్రతమాత్రం ఎంత ఉన్నతమైనవాళ్ళకి!

లేచి అల్మైరా తీసి పుస్తకాలన్నీ వెదికి 'అన్నా కెరినీనా' తీసి మాలతి దగ్గిరికి తీసికెళ్ళాడు —

"ఇది చదవండి, బావుంటుంది," అన్నాడు పొడిగా

మాలతి పుస్తకం తిరిగేస్తూ కూర్చుంది.

"అత్తా! వెళ్ళిపోదామే," అంటూ కిటికీ దిగి నించున్నాడు మాలతి మేనల్లుడు

వులిక్కిపడుతూ లేచింది మాలతి — "చాలా సేపైంది, చీకటి పడిపోతోంది. వెళ్తామండీ!" అంటూ కంగారుగా వరండాలోకి వెళ్ళింది.

"వుండండి, ఫర్వాలేదు; నేనూ వస్తాను," శంకరం తల దువ్వుకుని గదికి తాళంపెట్టి బయల్దేరాడు

"మీకెందుకండీ? అనవసరం శ్రమ మేమిద్దరం వెళ్ళిపోతాంకదా!" అంది మాలతి అయిష్టంగా.

"నాకేం శ్రమలేదు అలా బజారు కూడా వెళ్ళాలి,'' అంటూ మెట్లు దిగాడు శంకరం.

మాలతి మౌనంగా నడక సాగించింది నవ్వుతూవచ్చిన మాలతి దిగాలు పడుతూ వెళ్ళటం చాలా కష్టంగావుంది శంకరానికి. మాలతిని చూస్తోంటే ఆమె హృదయంలో — శాశ్వతంగా దూరమైపోయిన భర్తపట్ల చెక్కు చెదరని గాఢాభిమానం ఎంతో పవిత్రంగా తోచి ముగ్ధుడయ్యాడు

"మిమ్మల్నోమాట అడగనా?'' అన్నాడు వూరుకోలేక కొంతసేపటికి

పరాకుగావుంది మాలతి — "ఏమన్నారూ?'' అంది మొహంతిప్పి

"విసిగిస్తున్నానని అనుకోరుగా? మిమ్మల్ని బాధపెట్టాలని కాదు, మీ శ్రేయస్సు కోరటం తప్పితే నాకు మరో వుద్దేశ్యంలేదు"

శంకరం స్నేహపూర్వకంగా మాటాడుతోంటే మాలతి మనస్సెంతో సేదతీరింది — కృతజ్ఞతగా అన్నది — "అంతచెప్పాలా మీరు? మీ రేంమాట్లాడినా నే నేమీ అనుకోను ఇందులో బాధపడటాని కేముంది?"

శంకరం పది అడుగులు మౌనంగా నడిచాడు— "మీయిద్దరికీ పెళ్ళిపీటలమీద తాళికట్టిన సంబంధం తప్పితే ఏమీ లేదని విన్నాను చిన్నప్పటి అభిమానాలు వుంటే వుండొచ్చు. అయితేమాత్రం, దీక్షపట్టినట్టు మిమ్మల్ని మీ రిలా ఆహుతి చేసుకోవటంలో ఏం అర్థంవుంది? నే నంటున్నానని కాదు, ఆలోచిస్తే మీకు తెలీదా?"

చూస్తోండగా మాలతి పెదవులమీద



మందహాసం చిందింది. మొహమంతా కాంతి అలుముకుంది. శంకరంకేసి చూస్తూ సిగ్గుపడుతోన్నట్టు నవ్వింది.

"మీ కేం కోపం రాలేదుగదా ?" ఆశ్చర్యంగా అడిగాడు శంకరం.

"చాలావచ్చింది. మీరు మహా తెలిసినట్టు మాట్లాడేస్తోంటే కోపంరాదూ?" అంది చిరునవ్వు నవ్వుతూ.

మాలతి మందహాసం చూస్తే ప్రాణం తేటపడింది శంకరానికి.

"నేనా? ఏం మాట్లాడానూ ?" అన్నాడు అర్థంగాక.

"ఏం లేదులేండి. హాస్యాని కన్నాను."

నమ్మలేదు శంకరం – "చెప్పటాని కిష్టంలేక దాచేస్తున్నారు. మీయిష్టం," అన్నాడు తనూ నవ్వుతూ.

(సశేషం)

# కలవని బాటలు

రైలు విజయవాడ ప్లాట్‌ఫారం మీద ఆగింది. బండి కిటకిటలాడుతోంది. హైద్రాబాదు నుండి వచ్చేబండి సాధారణంగా ఖాళీగానే ఉంటుంది. అలా అనుకునే వాసంతి ఆబండికి వచ్చింది; కాని, పెళ్ళిళ్ళరోజు లవడంచేతనో ఏమో, ఎక్కడానికైనా సందు దొరకడంలేదు. దిగేవాళ్ళను దిగనివ్వకుండా జనం తోసుకుని ఎక్కుతున్నారు. ఎవరిమట్టుకు వాళ్ళే-రైల్లో ముందుగా ఎక్కితే నిలుచోడానికైనా చోటు చూసుకోవచ్చనో, లేక తాము యెక్కకుండా రైలు వెళ్ళిపోతుందన్న భయమో మరి, మధ్యలో మనుష్యుల నెత్తిమీదినుంచి అందిస్తున్న సామాను— ఇలా తొడతొక్కిడిగా ఉన్న జనాన్ని ఎలాగో తోసుకుని ఆడవాళ్ళ పెట్టిలోనికి ఎక్కింది వాసంతి. ఆమె వంగపండు గోరంచు పట్టుచీరా, దానిపైన ఆకుపచ్చని జాకెట్టూ పచ్చని శరీరానికెంతో బాగా నప్పేయి. లోపల అడుగు పెట్టటానికైనా చోటులేదు. నలుదిక్కులా చూస్తూ చేతిలో ఉన్న బాగ్ అప్పరు బెర్తుమీద ఉన్న కాస్త ఖాళీలోనూ పెట్టింది.

మూల సీటులో కూర్చున్న రాధిక "ఇటురండి, కూర్చుందురు గాని," అని పిలిచింది. కొత్త ముఖమైనా చనువుగా పిలిచిన రాధికను చూచి ఆశ్చర్యపడింది వాసంతి. ఎవరైనా ఆమె—చోటు యిస్తున్నది కదా అని అటువైపు వెళ్ళింది. అక్కడకూడా అంతగా చోటులేదు. కాని రాధిక కొద్దిగా సర్దుకుని పక్కనున్న అయిదేళ్ల బాబుని తన ఒడిలో కూర్చోబెట్టుకుని జాగా యిచ్చింది.

"థాంక్స్" అంటూ వాసంతి ఆ జాగాలో కూర్చుంది. రాధిక నవ్వుతూ ఆమెను చూసి "ఎంతవరకూ వెళ్తున్నారు?" అని అడిగింది.

"రాజమండ్రి; మీరూ?"

"రోహిణి"

"నేనూ రాజమండ్రేనండీ," రాధిక కుతూహలం యెక్కువయింది "మీరు రాజమండ్రిలో యెక్కడ ఉంటారు. అక్కడ ఏంచేస్తూఉంటారు?" అంటూ ప్రశ్న పరంపర మొదలు పెట్టింది.

"మాది బెజవాడ. అక్కడ కాలేజీలో లెక్చరర్‌గా ఉంటున్నాను. రాజమండ్రి పరీక్షాధికారిగా వెళ్తున్నాను."

"మరి రాజమండ్రిలో మీకు తెలిసినవాళ్ళున్నారా? ఎక్కడ దిగుతారు," అని అడిగిన రాధిక ప్రశ్నకు—

"నాకెవరూ తెలిసినవాళ్ళు లేరండీ. నేనెప్పుడూ రాజమండ్రి వెళ్ళలేదు కూడాను. ప్రిన్సిపాల్‌కు ఉత్తరం వ్రాశాను. తిన్నగా కాలేజీకే వెళ్తాను. వారే యేదో యేర్పాటు చేస్తారనుకుంటున్నాను. నాకాఊరు కొత్త. అక్కడ వారంరోజు లుండాలి," అని సమాధానం చెప్పింది వాసంతి.

"అలాగ అయితే, మీకు అభ్యంతరం లేకపోతే మాయింటికి రండి. చల్లని తోట, మధ్యన చిన్నకుటీరం – యెంతో బాగుంటుంది. మీరెన్నాళ్ళున్నా మాకభ్యంతరం ఉండదు."

ఇప్పుడు కుతూహలం వాసంతివంతైంది. "మీది అసలు రాజమండ్రేనా? మీవారేం చేస్తారు?"

"మావారికి ఉద్యోగం యేమీ లేదండి. బాగా భూము లున్నాయి. వ్యవసాయం స్వయంగా చూసుకుంటారు అసలు మాది రాజమండ్రిదగ్గరలోవున్న పల్లెటూరు. పిల్లలకు చదువులుంటాయని పట్నంకాపురం పెట్టేము. చదువుకున్న ఆడవాళ్ళను చూస్తేనాకెంతో సరదా; వాళ్ళతో మాట్లాడాలని ఉంటుంది. అందుకే మిమ్మల్ని వచ్చి నాదగ్గర కూర్చోమన్నాను."

"మీరు చదువుకోలేదా?"

"నా చదువెంతలెండి. స్కూల్ ఫైనల్ ప్యాసయ్యాను."

వాసంతి కాశ్చర్యమైంది. "అయితే మాత్రం మీకేం తక్కువైందండీ"

"ఏమీ లేదనుకోండి. కాని నాకదొకసరదా. నాకు ముగ్గురు అబ్బాయిలు యిద్దరు అమ్మాయిలు. ఇంక చాలునని మావారు, ఆపరేషను చేయించుకున్నారు. ఇదుగో వీడే ఆఖరువాడు. పెద్దమ్మాయి సెవెన్త్ ఫారమ్ చదువుతోంది. తరువాత అబ్బాయిలు – ఫోర్తుఫారమ్ ఒకడు, సెకండుఫారమ్ ఒకడు చదువుతున్నారు. చిన్నమ్మాయి అయిదవతరగతి చదువుతోంది. హైద్రాబాదులో మా అమ్మగారివద్ద ఉంది. ఇది మా కుటుంబం," వాసంతి అడగకపోయినా రాధిక తనసంగతంతా చెప్పింది. కాని ఆమెనుగురించి అడగడానికి మొహమాటపడింది. అడగకపోవడమే మంచిదని కోరుకున్న వాసంతికూడా మాట

తప్పించి లోకాభిరామాయణంలోనికి దిగింది

గోదావరిస్టేషను వచ్చింది రాధిక వాసంతి ఒకరికొకరు సహాయం చేసుకుని సామానుతో కిందికి దిగేరు బయటకు వచ్చేక కాలేజీకి రిక్షా మాట్లాడబోతున్న వాసంతిని వారించి రాధిక "మీరు మొహమాట పడుతున్నట్లున్నారు. రండి మాయింట్లో ఉందురుగాని," అంది.

"ఎందుకండీ ? నేను కాలేజీకి దగ్గరలో ఉంటేనే మంచిది-ఉదయమే లేచి వెళ్ళవలసిఉంటుంది."

"మాయిల్లు కాలేజీకి చాల దగ్గరండి. మీ రేమీ ఆలోచించక రండి, మాయింట్లో ఉందురుగాని," అని ఇంటికి రిక్షా మాట్లాడి వాసంతి బేగ్ కూడాఅందులోపెట్టించింది. ఇక కాదన లేక వాసంతి ఆమె ననుసరించింది.

ఇంటికి వెళ్ళేసరికి పెద్దకూతురు హేమ యెదురువచ్చింది. సన్నగా నాజూగ్గా చామనచాయరంగులో కళకళ లాడ్తున్న చిరునవ్వుముఖంతో చూడముచ్చటగా ఉందాపిల్ల. ఆ అమ్మాయిని చూడగానే ఈ ముఖం యెక్కడ చూశానా అనిపించింది వాసంతికి. కాని ఎంత ఆలోచించినా గుర్తురాలేదు. పదేపదే ఆ బాలికను చూడాలన్న కోరికమాత్రం చంపుకోలేకపోతూఉంది

లోనికి వెళ్తూఉంటే ఇరుప్రక్కలా రంగురంగుల గులాబీలూ, మందారాలూ నిండుగా పూసి మనస్సు కెంతో ఆనందాన్నిస్తున్నాయి అవన్నీ తనని ఆహ్వానిస్తున్నాయా అన్నట్లు చల్లగాలికి మెల్లగా తల లూపుతున్నాయి. మందమందంగా వీస్తున్నగాలి వాటి సువాసనలను కలుపుకుని తన చెంపలను తాకుతూఉంటే అనిర్వచనీయానందాన్ననుభవించింది, వాసంతి హృదయం.

కొత్తస్థలం అని జంకుతూ అక్కడే నిలబడిన వాసంతిని "లోనికి రండి" అని ఆహ్వానించింది హేమ. ఈ సందడిలో రాధిక యెటు వెళ్ళిందో చూడలేదు వాసంతి. వెళ్ళగానే లోపల సావడిఅంతా అధునాతన పద్ధతులతో అలంకరింపబడిఉంది. చుట్టూ గోడలపైని దేశనాయకుల ఫోటోలు తగిలించిఉన్నాయి. మధ్యగా సోఫాసెట్టు, ఒకప్రక్క బల్లపై రేడియో. సావడికి కుడిప్రక్కనఉన్న గదిలోనికి తీసుకుని వెళ్ళింది హేమ. అందులో ఒక మంచం, కుర్చీ, బల్ల, ఒక పడకకుర్చీమాత్రం ఉన్నాయి. ప్రతిగదిలోనూ ఫానులు. ఆయిల్లూ ఆమనుష్యులనూ చూస్తూంటే యెంతో ఆనందమైంది వాసంతికి.

"ఈగది మీకు కేటాయింపుగా ఉంటుంది. ఇదుగో, ఈ తలుపు తీసుకుని లోపలికి వెళ్తే అక్కడే బాత్‌రూమ్, లెట్రిన్ ఉన్నాయి మీ కింకేమి కావల




సినా నన్ను పిలవండి. ఈ దుటిగది లోనే ఉంటాను. మీరు స్నానం చేశాక మాయిల్లు చూపిస్తాను," అంది. హేమ వెళ్ళిపోయాక వాసంతి బాత్ రూమ్ లోనికి వెళ్ళి అక్కడున్న బాయిలర్లో నీళ్ళు కాగిఉండడంచూసి స్నానం చేసి బయటకువచ్చి పడక కుర్చీలో కూర్చుని, సీలింగుఫానుకేసి చూస్తూ ఏదో ఆలోచించుకుంటోంది. ఇంతలో లోపల నుండి రాధిక వచ్చి "ఏమండీ! స్నానం అయిందా ? రండి భోజనం సిద్ధంగా ఉంది. అది పూర్తిచేసి మీ కాలేజీపని చూసుకోండి," అంది. కొత్తవాళ్ళు కూడా ఏ విధమైన మొహమాటం పడటానికి అవకాశమివ్వని ఆ మనుష్యులను చూస్తూ ఉంటే ఆశ్చర్యం వేసింది వాసంతికి.

ఇద్దరూ భోజనాల గది వైపుకి వెళ్ళేరు. అన్నీ బల్లమీద అమర్చి ఉన్నాయి. బల్లకు ఒక ప్రక్కన హేమా, తమ్ముళ్లూ కూర్చున్నారు. రెండవ వైపు రాధికా వాసంతీ కూర్చున్నారు. ఎవరో వంటమనిషి వస్తుందని ఎదురు చూస్తున్న వాసంతికి రాధికే వడ్డించడం చూస్తే ఆశ్చర్యంవేసింది. "వంట మనిషి వడ్డించదా ?" అని ఉండబట్ట లేక అడిగింది వాసంతి.

"మా కసలు వంటమనిషి లేదండీ. నేనే వంట చేస్తాను. మా వారికి ఎవరు వండినా సరిపడదు. అయినా నా కేం పనుంది ?"

"ఇంత తొందరగా మీరే యీ వంటంతా చేశారా ?"

"అవునండీ. ఎలక్ట్రిక్ ప్లేటు ఉంది. దానిమీదే చేస్తాను. అందుకే యింత తొందరగా అయిపోయింది." ఈ

మాటను వింటూవుంటే వాసంతి ఆశ్చ ర్యాని కంతులేదు. వీరింటికి తన రాక యేజన్మానుబంధమో అనిపిస్తోంది. భోజనా లయాక కాలేజీకి వెళ్ళివచ్చింది. సాయంకాలం నాలుగుగంట లయింది, కాని యింటియజమాని రాక కనిపించ లేదు. పిల్లలుకూడా ఎంతో నమ్రతతో వాళ్ళవాళ్ళ పనులు క్రమం తప్ప కుండా చేసుకుపోతూఉంటే, యిలా ఉండా లనిపించింది. సాయంత్రం హేమ నడిగింది — మీ నాన్న గా రేర ని. "హైద్రాబాదులో మా అత్తయ్యకు సుస్తీగా ఉంది. మా అమ్మా నాన్నా చూడ్డానికి వెళ్ళారు. మేము ఒక్కళ్ళం ఉన్నామని మాఅమ్మను పంపి ఆయన అక్కడే ఉండిపోయారు," అంది.

* * *

రాధిక బలవంతంవల్ల నైతేనేమి, హేమ యెడల తన కున్న ఆకర్షణవల్ల నైతేనేమి పరీక్షలు జరిగిన వారం రోజులూ వాళ్ళింట్లోనే ఉండిపోయింది. తీరికసమయాల్లో హేమను కూర్చో బెట్టుకుని కబుర్లు చెప్పేది. రాత్రులు కూడా తనున్నంతకాలం తనగదిలోనే పడుకోమని హేమకు ఇంకొక మంచం వేయించింది. ఆ అమ్మాయంటే యెందు 'కంతప్రేమో తనకే అర్థం కాలేదు. ఆఖరురోజు బజారుకు తీసుకుని వెళ్ళి కంచిపట్టుపరికిణీ, వోణీ కొని, వద్దంటున్నా బలవంత గా యిచ్చింది

ఆరోజ మధ్యాహ్నం వెళ్తున్నానని చెప్పడానికి కాలేజినుండి రాగానే రాధిక గదిలోకి వెళ్ళింది. త నిక్కడికి వచ్చిన వారంలోనూ ఒక్కసారైనా ఆగదిలోకి వెళ్ళలేదు. రాధిక అప్పుడే యేదో పనిమీద లోపలికి వెళ్ళింది. ఆమెకోసం యెదురుచూస్తూ గోడనున్న ఫోటోలు చూడసాగింది. అన్నీ వాళ్ళ కుటుంబం ఫోటోలే ఉన్నాయి. హేమ ఒక్కతే ఉన్న ఫోటో, దానిపక్కనే పిల్లలంతా గ్రూపుగా ఉన్న ఫోటో, ఇంకా ఎవరో ముసలిదంపతులు సరిగ్గా తెలియడంలేదు. ఆపక్కనే ఉన్న ఫోటోచూసి ఒక్కసారి షాక్ తిన్నదాని లాగా అయిపోయింది. కళ్లు తిరుగుతున్న ట్లనిపించింది అందులో పదేళ్ళబాలికా, పదహారేళ్ళ బాలుడూ పెళ్ళిదుస్తుల్లో ఉన్నారు. చీరకట్టుకుంటే పెళ్ళి కొడుకు హేమ అయిపోతాడు; అంత పోలిక లున్నాయి. "ఈ ఫోటో ఇక్క డెందుకుంది?" అని మనస్సులో అనుకో బోయి అప్రయత్నంగా పైకి అనేసింది. రెండు గ్లాసులలో పండ్లరసం పట్టుకుని "అది మావారిదేనండీ, ఆయనకు చిన్న తనంలోనే వివాహం అయిందిట. ఆమె చనిపోయింది. పాపం, ఆమె అంటే మావారి కెంతో యిష్టం – యిప్పటికీ 'వసూ వట్టి అమాయకురాలు సుమా! పిచ్చిది!' అంటూఉంటారు. ఆ పక్కనే ఉన్న అమ్మాయే ఆయన మొదటిభార్య



వాసంతి ఆసక్తిగా ఆమె నడిగింది
"ఇంకా యేంచెప్పేరు ఆమెను గురించి?"
"ఆ కుతూహలం చూస్తే రాధికకు ఆశ్చర్యమేసింది అయినా ఆది పైకి కనిపించనీయక, "అంతకుమించి యెంత అడిగినా ఎన్నడూ చెప్పలేదు వసూ అనడంతప్ప ఆమె పూర్తిపేరు కూడా మాకు తెలియదు ఆఫోటో మాత్రం పదిలంగా చూస్తూంటారు '

వాసంతి లేచి "నే నీరోజు వెళ్తున్నా నండీ," అని నిర్లిప్తంగా చెప్పి తన గదిలోనికి పోయి సామాను సర్దుకో సాగింది. వెనుకనే వచ్చిన రాధిక, "ఈరోజు ఆయన వచ్చేస్తారు. ఉండండి, చూసి పోదురుగాని," అంది.

"కాదండీ! వెళ్ళాలి. ఇంకొకసారి వస్తాలెండి," అంది వంచినతల యెత్త కుండానే.

ఆమె అలా యెందుకై పోయిందో రాధిక కేమీ అంతుపట్టలేదు. ఆమె కేం తెలుసు - ఆఫోటోలోని వసూ, తన యెదుట నిలిచిన వాసంతీ ఒకరేననీ?

* * *

వాసంతికి పదేళ్ళ వయసులో ఉండ గానే బామ్మగారి కోరికప్రకారం కొంచెం దూరపుబంధువుల అబ్బాయి కమలనాథుడితో వివాహం అయింది. కమలనాథు డాయేడే స్కూల్ ఫైనల్ పాసయాడు; వాసంతి ఫస్టుఫారం చదువుతోంది. చదువులో చాలా చురుకుగా ఉండేది. తల్లిదండ్రులకు పెద్దకూతురు వాసంతి. తన తరువాత ఇద్దరు తమ్ముళ్ళు, ఒకచెల్లెలు. ఈ పెళ్ళి కోసమే కాచుకున్నా నన్నట్లు పెళ్ళైన ఆరు నెలలు తిరగకుండానే ముసలిబామ్మ గారు కళ్ళు మూశారు.

చంద్రమౌళిగారికి ఆడ పిల్లలు చదువుకుంటూ రంటే యెంతో ఉత్సాహం. ఆయనమాట కెదురు చెప్పక అనుగుణంగా ఉంటుంది ఆయన భార్య విశాలాక్షి. ప్రథమసంతానం వాసంతి అంటే వాళ్ళ కెక్కడలేని ప్రేమ. ఆ అమ్మాయిని పిలయినంత వరకు చదివించాలని వారి ఆశ. ముసలితల్లి మాట కాదనలేక వివాహం చేశారు. పిల్లలు పెద్దవాళ్ళయేవరకు చదివించ వచ్చునుకదా అని ఆశతో వాసంతిని స్కూలు మాన్పించలేదు. అబ్బాయి చదువుకూడా కావాలికదా - ఇంకా చిన్నపిల్లకదా అని మామగారు చక్రధరరావుగారు కూడా అడ్డు చెప్పలేదు

* * *

కాలంక్రమం తప్పకుండా నడచి పోతోంది. వాసంతి మంచిమార్కులతో స్కూల్ ఫైనల్ పాసయింది. కమల నాథుడు కూడా బి. ఏ పాసయి బి. యెల్. లో చేరాడు. వాసంతిని కాలేజీలో చేర్చే యత్నాలు చేస్తున్నా రని విన్న చక్రధరరావుగారు భార్య జయలక్ష్మిని వియ్యాలవారింటికి పంపేరు. వియ్యపురాలిని బాగానే సత్కరించారు. భోజనాలయి. సావ కాశంగా కూర్చున్న సమయంలో తను వచ్చినపని చెప్పింది విజయలక్ష్మి.

"వదినా! ఇంక చదివింది చాలు. పైకి చదివించకండి వాసంతిని. మంచి రోజు చూసి మాయింటికి పంపండి. అబ్బాయి చదువుకూడా వచ్చే యేడుతో

అయిపోతుంది. మా కున్నదిమాత్రం వాడేకదా? ఆడపిల్ల అత్తవారింటికి వెళ్ళిపోయేదాయె. ఆపల్లెలో ఉండే దాని కింతకన్న చదువులు దేనికి?"

"చదుకున్నవాళ్లంతా ఉద్యోగాలు చెయ్యాలని ఉందా వదినా? దానికి చదువుకోవాలని ఉత్సాహంగా ఉంది. మంచి మార్కులుకూడా వస్తున్నాయి. వాళ్ళ నాన్నగారుకూడా సరదా పడుతున్నారు - బి. ఏ. పాసవాలని. ఇంత కాలం ఎలాగూ ఆగేము, ఒక్క నాలుగే ళ్ళూరుకుంటే బి. ఏ. అయిపోతుంది."

"చదువుకి అంతం ఉందా వదినా? ఆ బి. ఏ. అయాక యింకాపైకి వెళ్ళా లనిపిస్తుంది; అంతెక్కడ? మావాడైనా అంత యిష్టపడటంలేదు; నామాట విని ఆ విషయం తలపెట్టకండి."

"అదెలాగ వీలవుతుంది? అల్లుడు బి. ఎల్. పూర్తి అయేవరకూ యిది గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవడమేగా? ఈలోపున పి.యు.సి. పూర్తవుతుంది."

ఇలా మొండిగా వాదిస్తున్న విశాలాక్షితో మాట్లాడలేక జయలక్ష్మి సాయంకాలం బండియెక్కి స్వగ్రామం వెళ్ళిపోయింది.

భార్య చెప్పినమాటలు విని చక్రధర రావుగారు మండిపడ్డారు. వెంటనే చదువు మాన్పించేసి కోడల్ని పంప వలసినదని వియ్యంకుడికి ఉత్తరం వ్రాసేరు. అలా పంపని పక్షంలో పర్యవసానం యెలా ఉంటుందో చెప్పడం చాలాకష్టం అనికూడా రాసేరు. అది చూచి చంద్రమౌళిగారు కొద్దిగా జంకినా, ఏంచేస్తారులే, కాలేజిలో చేర్పించాక వాళ్ళే ఊరు కుంటారని నిర్లక్ష్యం చేసి చాలరోజులు జవాబుకూడ వ్రాయకుండా తరువాత 'అమ్మాయి తీరా చేరిపోయింది కనుక చదువు పొంతం కానివ్వమనీ, తరువాత తమమాట కాదనమనీ' వ్రాశారు. ఇంకేమీ చేసేదిలేక జరిగిన విషయం "కొడుక్కి తెలియచేసి ఆ పైసంగతి నువ్వు చూసుకో, నేను కలుగచేసుకో," నన్నారు.

తమయిష్టానికి వ్యతిరేకంగా భార్యను చదివించడమే కాకుండా, తన తలిదండ్రుల మాటకు విలువ యివ్వలేదని కమలనాభుడికి కోపం ముంచుకువచ్చింది. వెంటనే బయలు దేరాడు అత్తవారింటికి.

ఇంటికి వచ్చిన అల్లుడికి ఫలహారాలు పిండివంటలు చెయ్యడంలో మునిగి పోయింది విశాలాక్షి. మామగారు ముభావంగా అల్లుడ్ని క్షేమసమా చారా లడిగి "కాస్త టిఫిన్ తీసుకుని విశ్రాంతి తీసుకోవోయి. అలా వెళ్ళి వస్తా"నని వెళ్ళబోతూఉంటే "నేను విశ్రాంతికి విందులకూరాలేదు. ఇప్పుడే ప్రయాణం. వాసంతిని తీసుకుని వెళ్ళా లని వచ్చాను," అన్నాడు.

అర్థం కానట్లు వింతగా చూశారు. చంద్రమౌళిగారు. "కాలేజిలో చేరిన అమ్మాయి నీతో యెలా వస్తుంది?"

"ముందే చేర్పించవద్దని మా నాన్న గారు చెప్పేరుగా?"

"అవును చెప్పేరనుకో; కాని నువ్వు మాట్లాడలేదు. అమ్మాయికే మో చదవాలని ఉంది; అందుచేత చేర్పించేము."

"మా నాన్నగారు చెప్తే నేను చెప్పినట్లుకాదా!" చదువు కావాలను కున్న అమ్మాయికి పెళ్ళి చెయ్యకుండా ఉండవలసింది."

"అదీ నిజమే, కాని యేదో తెలియని రోజుల్లో జరిగినదానికేం చేస్తాం? అయినా ఒక్క నాలుగేళ్ళు కళ్ళు మూసుకుంటే నీభార్య నీకు కాకుండా పోతుందా?" అంటూ అల్లుడి సమాధానానికెదురుచూడకుండా వీధిలోనికి వెళ్ళిపోయారు. మామగారి నిర్లక్ష్యానికి మండిపడుతూ యేమీ చెయ్యలేక అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు. ఇంతలో అటుప్రక్కగా వెళ్తున్న వాసంతి కనిపించింది.

"వసూ! నీతో కొంచెం మాట్లాడాలి, యిటు వస్తావా?" భర్త యేం మాట్లాడతాడోనని కొంచెం జంకింది. కాని ఆమెకు తెలియకుండానే కాళ్ళు అతనివద్దకు తీసుకునివచ్చాయి.

"అలా కూర్చో."

"ఊఁ, చెప్పండి ఏమిటో!" అని తల వంచుకునే కూర్చుంది.

"నీకు చదువు ముఖ్యమా, నేను ముఖ్యమా?"

"అలా అడుగుతే యేం చెప్పను? దేని కదే ముఖ్యం."

"అయితే నాతో రావడం యిష్టం లేదా?"

"చదువయాక తప్పక వస్తాను."

"అంతవరకూ నేను యెదురు చూడాలా?"

"......... ........."

"మాట్లాడక తల వంచుతా వెందుకు? నేను ఖచ్చితంగా చెప్తున్నాను. నువిప్పుడు రాకపోతే నీకూ నాకూ ఇక పొసగదు. నేనింకొక మార్గం అవలంబించవలసి ఉంటుంది, ఏమంటావ్?"

"నాచదువయేవరకు ఉండలేకపోతే అది మీ యిష్టం."

"అయితే నీకు రావాలనిలేదా?"

"మా నాన్నగారు చెప్పినట్లు చెయ్యడమే నా విధి. ఆయన చదువు కోమన్నారు. నాకూ సరదాగాఉంది చదువుకుని ఉద్యోగం చెయ్యాలని."

"అయితే మీ నాన్నగారి మాటే కాని నీకు మా మాట అక్కరలేదన్న మాట. నువిప్పుడు పలుకుతున్నవి మీ నాన్నగారు నేర్పిన చిలకపలుకులు. నేను వెళ్ళిపోతున్నాను. తరువాత విచారించి లాభం లేదు; ఆలో



చించుకో," అని లేచాడు. వాసంతి ముఖంలో మార్పేమీ లేదు. అలాగే కూర్చుని అతను వెళ్తూ ఉంటే చూస్తూ ఊరుకుంది.

వంట పూర్తయిందని చెప్పడానికి బయటికి వచ్చిన విశాలాక్షమ్మ అల్లుడు వెళ్ళిపోయాడన్న సంగతి విని ఎగిరి పడింది. ఈరోజుల్లో కూడా అలుగుదా మనుకున్నాడు కాబోలు! నాలుగు రోజులుపోతే వాళ్ళే తోవలో కొస్తారు

దానీదువాళ్ళ కింకా పెళ్ళే కానివా ళ్ళెంతమందో ఉన్నారు,'' అని గొణు క్కుంటూ లోపలికి పోయింది.

తల్లిమాటలతో మరింత ధైర్యం వచ్చింది వాసంతికి. ఇంతలో చంద్రమౌళి గారు వచ్చి విషయం తెలుసుకుని "హుం, తనకి తన తలిదండ్రు లెంతో దీనికిమాత్రం మేము అలాకాదూ? మామాటకింటోందని అలిగిపోయాడా? ఇందుకే ఆడదానికి ఆర్థికస్వాతంత్ర్యం ఉండాలంటాను. నీ కేం బెంగ అక్కర లేదమ్మా,'' అంటూ లోపలికినడిచారు.

అంతే, ఆరోజునుండీ రెండుకుటుం బాలమధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు బందయిపోయాయి. ఆడపిల్లగలవాళ్లు వాళ్ళకే అక్కరలేకపోతే మనకేం అని చక్రధరరావుగా రూరుకున్నారు.

వాసంతి పి. యు. సి. పాసయింది. బి. ఎస్సి. లో చేర్పించారు. వియ్యాల వారి వద్దనుండి పిల్లను తీసుకు వెళ్ళమని ఉత్తరం ఎప్పటికీ రాక పోవడంతో చక్రధరరావుగారే వ్రాశారు వెంటనే పంపవలసిందని. మీ అబ్బాయికి అంత తొందరగా వుంటే వేరే సంబంధం చూసుకోవచ్చని జవాబు వచ్చింది. ఆఖరు ప్రయత్నంగా కమల నాభుడు అత్తవారిఊరు వెళ్ళి తిన్నగా కాలేజికి వెళ్ళి వాసంతిని "నీ ఉద్దేశం యేమి''టని అడిగేడు.

"నాచదువు పూర్తి అయేవరకు రాను.''

"అయితే విడాకులు ఇవ్వ మంటావా?"

ఈ ప్రశ్నకు కొద్దిగా చలించినట్లు కనిపించి సూటిగా అతనివైపు చూసింది. వెంటనే ప్రక్కకుతిరిగి "మీ యిష్టం. నా కభ్యంతరంలేదు,'' అని గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రమే యింటికి వెళ్ళి విడాకులకు లాయరుతో సంప్రదించి, రిజిష్టరు ఉత్తరం వ్రాయించాడు.

చంద్రమౌళిగారు ఉగ్రు డయ్యాడు. "నా కిదొక మగపిల్ల వా డనుకుంటాను. హాయిగా కాలుమీద కాలు వేసుకుని సంపాదించుకుంటుంది," అన్నాడు.

విశాలాక్షి కూతుర్నడిగి విషయం తెలుసుకుని, "మనం చేస్తున్నది మంచిది కాదేమో. పోనీ, చదువు మాన్పించి పంపేయరాదూ? ఎప్పటికైనా ఆడ దానికి ఒక పురుషునిఅండ ఉండాలిగా? నలుగురిలో నవ్వుల పాలు అయి పోతాము,'' అంది.

"ఏమిటమ్మా నవ్వులపాలయ్యేది? పురుషుడు లేకుండా స్త్రీ బ్రతకలేదన్న ముసలిఆలోచనలే మనల్నీ మన దేశాన్నీ కృంగదీస్తున్నాయి. అసలు పెళ్ళే కాకుండా యెంతమందిలేరు? వాళ్లు బ్రతకటంలేదూ! మాప్రిన్సిపాల్ చూడు, ఒకటి రెండేళ్ళలో రిటై రవబోతోంది. ఆవిడ కిప్పటికీ పెళ్ళి కాలేదు,'' గొంతు చించుకుని ముఖ




మంతా యెఱ్ఱగా చేసుకుని మాట్లాడింది వాసంతి.

"మీ నాన్నగారి మద్దత్తుతో నువ్వీ మాటలంటున్నావు, కాని నీకు అనుభవం చాలదేఅమ్మాయి! పెళ్ళి కాకుండా ఉంటే అదివేరు. నిన్నెప్పుడూ లోకం మొగుడు విడిచిపెట్టేడని వేలుపెట్టి చూపిస్తుంది. బాగా ఆలోచించుకోండి తండ్రీ కూతుళ్ళు," అని లేవబోయిన విశాలాక్షి నాపి, "లేవకు, కూర్చో; అంత కొంప ఏం మునిగింది. డైవర్సు యిచ్చేస్తే సంబంధం లేనట్లేకదా? మనమ్మాయి కెప్పుడు కావాలంటే అప్పుడే దానికి నచ్చినవాణ్ణి చేసుకుంటుంది."

"ఎక్కడో అమెరికాలో కూర్చుని మాట్లాడుతున్నట్లున్నారు. మన దేశ మర్యాద లందుకు ఒప్పుకోవు. భారత స్త్రీకి ఒకడే భర్త."

"నిషేపంలా ఒప్పుకుంటాయి. ఎవరో దీనికి నాంది పలకాలిగా. అది మనమే అవుదాం. ఇంతోటి మొగుడు దొరక్కపోడు."

అంతే, సంబంధం కోర్టుద్వారా తెగిపోయింది. ఎం. ఎస్సీ. ఫస్టుక్లాసులో పాసయింది. ఉన్నఊళ్ళోనే లెక్చరరుగా చేరింది.

బంధాలు విడిపోయి ఇంచుమించుగా ఇరవయి సంవత్సరా లవుతోంది. కమలనాథుని విషయ మేమీ తెలియదు వాసంతికి. అతనుమాత్రం ఈ చరిత్రంతా చెప్పడం యిష్టంలేక తన

రెండవభార్య రాధికతో ఆమె చని పోయిందనే చెప్పేడు. అయినా వాసంతియెడల ఉన్న ప్రేమ ఏ మాత్రం తగ్గలేదు. ఆమె యెక్కడున్నదీ, యేం చేస్తున్నదీ తెల్సుకుంటూనేఉన్నాడు. దానివలన అతనొక అవ్యక్తానందం అనుభవించేవాడు.

* * *

ఆరోజు మధ్యాహ్నం వాసంతిని సాగనంపడానికి తమ్ముణ్ణి తీసుకుని హేమ స్టేషనుకు వెళ్ళింది. వాసంతి వెళ్లే ట్రెయిన్ ఇంకా రాలేదు. ఇంతలో అప్పుడే విజయవాడవైపునుండి వచ్చే బండి అవతల ప్లాట్ఫారంమీద ఆగింది, అందులోనుండి దిగిన కమలనాభుడు ఓవరు బ్రిడ్జిమీదనుండి వస్తూ హేమను ఆమెతోనున్న వాసంతిని చూసి ఆశ్చర్య పడ్డాడు. వీరిద్దరికీ పరిచయ మెలాగయిందా అనుకున్నాడు. ఈ సమయంలో వాళ్ళ దృష్టిలో పడడం యిష్టంలేక జనం మధ్యలో దూరి ఒక ప్రక్కగా నడుస్తున్నాడు. కాని హేమ దృష్టినుండిమాత్రం తప్పించుకొనలేక పోయాడు. ఆరోజు తండ్రి వస్తాడని తెలిసిన హేమ అటునుంచి వచ్చేబండ్లు చూస్తోంది. అప్పుడే వచ్చిన బండిలోనుండి తండ్రి దిగడం చూసి అతని కెదురు వెళ్ళింది.

వాసంతి బండి వచ్చింది. ట్రెయిన్ లోకి యెక్కబోతూ హేమకోసం చూసింది. దూరంనుండి యెవరినో వెంటబెట్టుకు వస్తున్న హేమ కనిపించింది. హేమతో వచ్చే మనిషెవరై ఉంటారో ఊహించుకున్న వాసంతి హృదయం దడ దడ కొట్టుకుంది. మనస్సు నదుపులో పెట్టుకోవడానికి ప్రయత్నిస్తూ బండియెక్కి కిటికీదగ్గర కూర్చుంది.

హేమ సంతోషంతో పొంగిపోతూ తండ్రని తీసుకుని వాసంతివద్దకు వచ్చి యిద్దరినీ పరిచయం చేసింది. యాంత్రికంగా ఒకరికొకరు నమస్కారాలు చేసుకున్నారు. కమలనాభుని చిరునవ్వు ముఖం చూస్తూఉంటే 'అప్పుడు నన్ను కాదన్నావు చూశావా? ఇప్పుడు నేనూ, నాపిల్లలూ ఎంత ఆనందంగా ఉన్నామో!' అని ఉడికిస్తున్న ట్లనిపించింది. వాసంతికి కంటినిండా నీళ్ళు తిరిగేయి. అది కనబడకుండా ఉండాలని యెటో చూడసాగింది. రైలు కదులుతూఉంటే వాసంతి కూర్చున్న కిటికీపైన చేతులు పెట్టి "ఎప్పుడైనా మాయింటికి వస్తూండండి," అంటున్న హేమ చేతిమీద వెచ్చని కన్నీటి బిందువులు రెండు పడ్డాయి.

"నేనంటే యెంత ప్రేమో!" అనుకుంది, అసలుసంగతి అర్థంకాని హేమ.

# శ్రీ నాగేశ్వర శతజయంతి సంచిక

ఆంధ్రపత్రిక ప్లవంగ ఉగాదిసంచికను శ్రీ నాగేశ్వర శతజయంతి సంచికగా వెలువరించారు. 1910 లో ఉగాదిసంచికలు ప్రారంభమైనది లగాయతు ప్రతిసంచికా ఆంధ్రుల సాంస్కృతిక జీవితంలో ఒక మైలురాయిగానే ఉంటున్నది. ఈ ఉగాదిసంచికలు నాగేశ్వరరావుపంతులుగారి అనుపమానకృషి ఫలితాలలో ఒకటిగా భావించతగినవి. రెండేళ్ళక్రితం విశ్వావసు ఉగాదిసంచిక ఒకటి చిన్న విజ్ఞానసర్వస్వంలాగా వెలువడి, యాభై అయిదేళ్ళ ఆంధ్రపత్రిక కృషిని ఈ కాలపువారు నెమరువేయటానికి ఎంతగానో ఉపకరించింది. దానిలాగే ప్లవంగ సంచికకూడా ఒక విశిష్టతతో కూడుకున్నది. ఇందులోని రచనలన్నీ నాగేశ్వరరావుపంతులుగారివే — ఆయన జీవితాన్ని సమీక్షిస్తూ నోరివారు రచించిన సుదీర్ఘ వ్యాసం మినహాయిస్తే.

నాగేశ్వరరావుపంతులుగారికి నూరు వెళ్ళి, నూటఒకటి ప్రవేశించింది. ఆయన ఈనాటి తెలుగుజాతికి మూలస్తంభాలలో ఒకరు. ఆయన భౌతిక జీవయాత్ర సాగించే కాలంలో ఆయనకన్న జనాన్ని హెచ్చుగా ఆదరించిన రాజకీయనాయకులూ, సంస్కృతీపరులూ మరికొందరు కనిపించారు. కాని ఈనాడు వెనక్కుతిరిగి చూసుకుంటే వారెవ్వరూ పంతులుగారంత ఉన్నతంగా కనపడకుండా ఉంటున్నారు. పంతులుగారిలో ఆంధ్రజాతియొక్క ఆత్మ ప్రతిబింబించినట్టుగా మిగిలినవారిలో ప్రతిబింబించలేదులాగుంది. మిగిలినవారు ఉద్యమాల ఎగతోతలో పైకివచ్చినవారు. నాగేశ్వరరావుపంతులుగారు తానే ఉద్యమం. ఆ తేడా ఆయనకూ, మిగతావారికీ ఉండనేఉన్నది.

గాంధీమహాత్ముడు నడుముకట్టి, దేశానికి నాయకత్వం వహించి, జాతీయాభ్యుదయానికి పథకాలు వేసి, హరిజనోద్ధరణా, విద్యావ్యాప్తీ, హిందీ భాషోద్ధరణా మొదలైన నినాదాలు దేశానికి అర్పించేనాటికి, ఆంధ్రలో నాగేశ్వరరావుపంతులుగారు అలాంటి ఉద్యమాలకు ఏనాడో దోహదం చేసి

ఉన్నారు. ఆయన భారత జాతీయోద్యమంతో చైతన్యం పొందటానికి మారుగా, ఆంధ్రలో ఆ ఉద్యమం ఆయనద్వారా చైతన్యాన్ని రెట్టింపు చేసుకున్నది.

పంతులుగారు సంచితాన్ని వదులుకోని విప్లవవాది. ఉన్నదానిని లవలేశం కూడా త్యాగం చెయ్యకుండా, భవిష్యత్తులో గుప్తంగా ఉన్న మంచిఅంతా కావాలని ఆశపడిన స్వార్థపరుడు. ఆయన కుండిన ఈ స్వార్థంనుంచి ఆధ్యాత్మిక చింతననుండి అమృతాంజనందాకా అనేక సంపదలు సృష్టి అయాయి. ఆంధ్రపత్రికా, భారతీ, ఉగాది సంచికలూ, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమూ, ఆంధ్ర గ్రంథమాలా, లైబ్రరీలూ సృష్టించటంతో ఊరుకోక, ఆయన తన జీవితాన్ని చివరిక్షణందాకా ప్రగతిపథంలో, సంస్కృతీసేవలో గడిపారు. ఆయన బలపరచని అభ్యుదయకరభావం ఉన్నట్టు కనపడదు.

పంతులుగారి జీవితానికి పథకం చాలా చిన్నతనంలోనే ఏర్పడిఉండాలి. ఆ పథకాన్ని అమలుచేయటంలో ఆయన తనజాతిని ఉద్బోధించటంతోబాటు, తామూ "చదువుకున్నారు". వాఙ్మయంమీదా, వివిధమత సిద్ధాంతాలమీదా, చరిత్రమీదా, రాజకీయాలమీదా ముందే జ్ఞానం సంపాదించి తరవాత దాన్ని ఆయన తనజాతి కివ్వలేదు; తనజాతియొక్క అభ్యున్నతికి ఏ యే జ్ఞానం అవసరమనితోస్తే ముందు దానిని తాము సేకరించి, తరవాత జాతికి అందజేశారు. ఆ విధంగా జాతికోసం బతకటం ఆయనకు ఒకవిధమైన మూలసూత్రం అయిపోయింది.

నోరివారన్నట్టు మహాపురుషుడనిపించుకోవటానికి ఆయన ప్రారంభించిన వాటిలో ఏ ఒక్కదానియందు పరిణతి సాధించి, మిగతావాటిని విస్మరించినా ఇబ్బంది ఉండకపోను. కాని పంతులుగారి ఆశయం మహాపురుషుడు కావటం కాదు, పూర్ణపురుషుడు కావటం – తనలో తన జాతి యావత్తూ ప్రతిబింబించేటట్టు చూడటం. పంతులుగారు నిజంగా ఆంధ్రజాతిఅంత ప్రమాణంగల మనిషి. అటువంటి వ్యక్తికి అంచనా కట్టటం చాలాకష్టం. కాని శతజయంతి సంచిక పఠించినవారికి పంతులుగారి సంపూర్ణ వ్యక్తిత్వం కొంతవరకైనా బోధపడుతుంది.

ఈ సంచికను వెలువరించిన ఆంధ్రపత్రికవారు అభినందనీయులు.

— కొ. కు.

# వ్యక్తిత్వంలేని మనిషి

జరిగినకథ

[వివిధ మనస్తత్వాలుగల అప్పా తమ్ముడూ సర్దుకుని ఒకేగదిలో కాలక్షేపం చేయడం మొదలుపెట్టారు.

మృత్యుంజయరావు, వాళ్ళ వుద్యోగస్థుల సమితి రిహార్సల్‌స్‌కు వెళ్ళివచ్చేప్ప టికి జగతి స్వాములవారిని చూచివచ్చి అతనికై వేచివుంది. ఇద్దరి భోజనాలూ పూర్తయి రాత్రి పడుకుంటే - జగతి మంచంమీద హాయిగా నిద్రపోతుంటే, మృత్యుంజయరావు, తన గతచరిత్రలోని కొన్నిఘట్టాలను మనసులో నెమరు వేసుకొంటూ పడుకుంటాడు సుగతగా.] — ఇక ముందుకుసాగండి.

ఏం చెప్పాలి? అతని ముఖం పాలిపోయింది. ఏమిచెప్పినా అసహజంగా ధ్వనిస్తుందేమో! అసభ్యంగా తీసుకుంటుందేమో; పరీక్ష కెళ్ళేవాడిలా వళ్ళు వేడెక్కింది. చివరకు అవకతవకంగా, తప్పులతడికగా అతను వాగిందానికి సరియైన సారాంశ మిది. "చాలా చీకటైపోయింది. వర్షం యిప్పుడప్పుడే తగ్గే సూచనలు లేవు. మీ రసలే తడిసిపోయివున్నారు. రాత్రుళ్ళ కాకినాడరోడ్లు నిర్మాను ష్యంగా వుంటాయి. అసలు మీరు స్టేషన్‌నుంచి యిక్కడకు రావటమే ప్రమాదం. రౌడీలు జాస్తిగా వుంటారు. ఆ రౌడీలు ఏలాంటివా రనుకున్నారు? ఎంతటి ఘోరమైనా చేయటానికి వెనుకాడని దుర్మార్గులు. మీరు నాగురించి ఏమీ సంకోచించవలసిన పనిలేదు. (నీమొహం. నీగురించి భయపడేదెవర్రా మృత్యుంజయరావూ!) మీ రా గదిలో విశ్రాంతి తీసుకోవచ్చు. నే నీ వసారాలో గడిపేస్తాను. మీకొచ్చిన భయమేం లేదు. నిజంగా మీ కొచ్చిన భయంలేదు. (అలా అంటూంటే నాకు తృప్తిగా వుంటుంది.)"

చివరకు ఆమె అంగీకరించింది. "థ్యాంక్స్. మీకు చాలా శ్రమయిస్తున్నాను," అంది మృదువుగా; సూటుకేసు పట్టుకుని గదిలోపలకు నడిచింది. తర్వాత గది తలుపులు గడియపెట్టి దుస్తులు మార్చుకుంది. తల శుభ్రంగా తుడుచుకుని జుట్టు అలా వదిలేసింది. తెల్లటి బట్టలు. ఆరూపంతో ఆమె తిరిగి తలుపులు తెరిచేసరికి ఓ దివ్యకన్య సాక్షాత్కరించినట్లయింది. వెచ్చటి పరిమళం వ్యాపించినట్లయింది. మృదుసుగంధం వీచినట్లయింది.

బయటకువచ్చి వసారా అంచున అతనికి చేరువగా నిలబడి "వర్షాలు ఎక్కువగా రాత్రుళ్ళే కురుస్తాయికదండీ!" అంది ప్రకృతిలోకి తిలకిస్తూ.

"అవును," అన్నా డతను విస్మయపడుతూ.

"మీకు వానలో తడవటం యిష్టమేనా?" అని అడిగి ంది కొంచమాగి.

అతనికి ఏం జవాబు చెప్పాలో తెలీలేదు. "అంత యిష్టమూ లేదు, అయిష్టమూ లేదు," అన్నాడు ఆలోచించి.

"చాలా బాగుంటుంది వర్షంలో తడుస్తూంటే. కాని యీ నాగరికత ప్రపంచంలో మన యిష్టం వచ్చినట్లు మనం సంచరించటానికి వీల్లేదు. ప్రతిదానికీ అడ్డు, సంకోచం; వాళ్ళు నవ్వుతారనీ, వీళ్ళు మందలిస్తారనీ ఏవేవో అభ్యంతరాలు; స్త్రీలు ఎగతాళి చేస్తారు; పెద్దమనుషులు 'నీ మంచికోసమే!' నంటూ సలహాలు చెబుతారు; రౌడీలు ఏడిపిస్తారు."

రౌడీలు అన్న పదం తనకోసమే వాడిందన్న అనుమానం అతనికి గ్రుచ్చు కుంది. ఆమెవంక పరిశీలనగా చూశాడు. కాని ఆమె యిటువైపు చూడటంలేదు.

"పువ్వులు తడిసినప్పుడు వచ్చే సువాసన విచిత్రపు మత్తుని కలిగిస్తుంది, గమనించారా?" అంది ఓ నిమిషం గడిచాక.

చచ్చాం, ఈవిడ సౌందర్యోపాసకురాలిలా వుంది. ఇప్పుడు చర్చగనుక మొదలుపెడితే తను శ్రోతగా వుండటానికి తప్ప ఎందుకూ పనికిరాడు. "మరే," అన్నాడు గత్యంతరంలేక.

"కొన్ని పువ్వులు మెత్తగా వుంటాయి. వాటివాసన గుచ్చుకుంటుంది. కొన్ని పువ్వులు గుచ్చుకుంటాయి. వాటి సౌరభం మెత్తగా వుంటుంది. ఏమంటారు?" అన్నదా యువతి నవ్వుతూ.

అతనికి అర్థం కాలేదు. తనుకూడా నవ్వుతూ తల ఊపాడు.

ఇలా ఆమె కొంతసేపు ప్రకృతిని ఉపాసించాక "పాపం మీ రెప్పుడు భోం చేశారో ఏమో! ఆకలిగా వుండివుంటుంది," అన్నాడు మధ్యలో కలుగజేసుకుని.

ఆమె ఫకాల్న నవ్వి "చంపారు, ఇదంతా ఆకలితో పుట్టిన ప్రేలాపన అనుకున్నారేమిటి?" అంది చిలిపిగా

అబ్బే! లే దు లేదు '

ఆకలి లేదండీ కాని నిద్ర వస్తోంది "

అతను కంగారుపడుతూ "అదిగో మీరు గదిలో పక్కమీద పడుకోండి నేను చాప వేసుకుని వసారాలో కునుకుతీస్తాను " అన్నాడు

సన్‌లైట్ వల్ల ప్రతిమాటూ

మీ బట్టలు

అతికాంతిగా ఉతుకబడును




లింటాస్-S 62 77 TL (R)

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

ఈ ఏర్పాటుకు ఆమె అభ్యంతరం చెప్పలేదుగాని, "మీరు మంచం బయట వేసుకోండి. నేను గదిలో చాపమీద పడుకుంటాను," అన్నది.

"ఆఁ ఆఁ, బలేవారే. మీరు అతిథులు," అంటూ తన అద్భుతమైన పళ్ళతో ఒక నవ్వు ప్రదర్శించాడు మృత్యుంజయరావు. కాసేపటికి ఆమె తలుపు గడియపెట్టుకుని గదిలో పడుకుంది. గోడకి ఒకమూల ముసుగుబిగించి అతను వొదిగాడు.

కాని అతనికి నిద్రరాదు. ఆమె తలుపు గడియపెట్టుకుంది. అందుకని కాస్త అహం దెబ్బతింది. పోన్లే ఆడది! అని సరిపెట్టుకున్నాడు మళ్ళా.

తన పేరేమిటని అడగలేదు. తనెవరో అడగలేదు. ఎంత నిశ్చలంగా నిద్రపోతోంది లోపల! నిద్రపోతోందో, ఆలోచిస్తోందో లోపల? తననిగురించి ఆలోచిస్తూందేమో! ఛఛ! అలాంటివాళ్ళు ఆలోచించరు. ఈ మాదిరి విషయాలను చాలా తేలికగా తీసుకుంటారు.

కాని, ఆహా! ఎంత మధురమైనది యీ సన్నివేశం! ఎంత తీపి యీ అనుభూతిలో ?

కాని

ఉన్నట్లుండి అతను ఉలిక్కిపడ్డాడు తను సరిగ్గా, సహజంగా ప్రవర్తిస్తున్నాడా? అసలు యిలాంటి సందర్భంలో ప్రవర్తించవలసింది యిలానేనా? ఇలానేనా అని? తను చవటయిపోవటల్లేదుకదా!

శేఖరం అందగాడు ఆడపిల్లలతో చమత్కారంగా మాట్లాడగల నేర్పు గల వాడు సాహసి అవకాశవాది

ఈ సన్నివేశంలో శేఖరం అయితే ? చస్తే తలుపు గడియ పెట్టనివ్వడు అసలతను వుంటే తలుపు గడియ పెట్టటంగురించి ఆ అమ్మాయికి గుర్తురాదు తన మాటలతో నవ్వులతో, మేనరిజమ్స్‌తో చూపులతో చేతలతో ఆమె హృదయాన్ని కలచివేస్తాడు ఆమె చలించిపోతుంది ఆమె చకిత అయిపోతుంది ఆమె వివశ అయిపోతుంది అప్పుడిహ తలుపు గడియ అతనే వేస్తాడు

ఛ ఛ! నేను వెగటుగా ఆలోచిస్తున్నానా?

లేదు లేదు కానియ్యి బాగుంది ఆలోచన అయినా నువ్వు కాదుగా అలా చేసేది శేఖరమాయె ఊహాలోకంలోని ప్రేక్షకుడివి నువ్వు కానియ్యి

'బాగానేవుంది పద్ధతి అని పెదవి విరుస్తుంది ఆమె కాని కళ్ళలో కాంతి

'ఏం? నేను నచ్చలేదా?' అంటాడు శేఖరం

అబ్బ! అంత డైరెక్ట్‌గా ఎలా అంటాడోరా దేముడా! ఎంత గుండె నిబ్బరం. ఆత్మవిశ్వాసం కావాలి!

చూద్దాం ఆమె ఏమంటుందో 'ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు?' నంగనాచి! ఇందాక పువ్వులూ వానా అని అతీతమైన కబుర్లు చెప్పింది ఇదా అసలు స్వరూపం!

ఏమో! ఈ గొప్ప శేఖరానిదేమో! నాగస్వరం విన్న పాములా అతని విశేష ప్రతిభకు ఆమె దాసోహ మన్నదేమో!

శేఖరం మందహాసం చేశాడు దగ్గరికు వచ్చి ఆమె బుజంమీద చెయ్యి వేశాడు

ఓరి నీ చెయ్యి ముక్కలై పోనూ! ఎంత దరాగా వేశావురా చెయ్యి! అదే ఇంకోడైతే ఎంత అసభ్యంగా గోచరమయ్యేది యీ దృశ్యం?

ఆమె అతని హృదయంమీద వాలిపోతోంది

హఠాత్తుగా మృత్యుంజయరావు మనసు ఎదురుతిరిగింది

'ఛీ ఛీ! నేనిలాంటి ఆలోచనలు ఆలోచించకూడదు నేను వీటికి అతీతుడ్ని అనుకున్నాడు

ఇలా అనుకుంటే అతనికి చాలా సంతోషంగా వుంది సంతృప్తిగా వుంది గొప్పగావుంది అతీతుడ్ని అనే మాట పదేపదే ఉచ్చరించుకున్నాడు

అబ్బో! నాకు యిలాంటి పనులంటే అసహ్యం అసలు యింత అల్పమైన విషయాలను గురించి నాకు తట్టదు నేను వీటికి ఓ అంతస్థు ఎత్తుగా వున్నాను' అని వెన్ను చరుచుకున్నాడు

'అతీతుడివా నువ్వు? నాయనా ఏదీ నీ మొహం చూపించు ఓసారి ఆహా! నీ మొహమే మొహం ఆ పాడుమొహానికి తోడు యింత దురహంకారమా? గది లోని గోడమీది వ్యక్తి గోడలోనుండి బయటకు దూసుకువచ్చి నడుంమీద చేతులు వేసుకుని వెక్కిరించాడు

'ఆఁ నాకు దురహంకారమా?' అని విస్తుపోయాడు మృత్యుంజయరావు

'ఓరినాయనో! ఏం గొప్పవాన్తి? నాకూ అహంకారపడటం వచ్చును పైగా దురహంకారం ఏం వైభవం!

అతని వైభవం ఎక్కువసేపు నిలబడలేదు గోడలోంచి దూసుకువచ్చిన వ్యక్తి ఛడామడా తిట్టాడు 'ఓరి చవటా! నిమిషాలను ఛండాలంగా ఖర్చుపెట్టే అప్రయోజకపు వెధవ్వి నవ్వాల్సిన టైములో నవ్వాలనికూడా తెలీని వెంగళాయివి

# యువ

## దీపావళి ప్రత్యేక సంచిక

ఇందులో ప్రముఖ రచయితల
కథా కథానికలు, ప్రఖ్యాత చిత్రకారుల చిత్రాలు
వర్ణ చిత్రాలు, చిత్రకథలు, యితర ఆకర్షణలు
ఉంటాయి

## ప్రకటన రేట్లు

పేజీ సైజు 28×21.5 సెం మీ
అరపేజీ సైజు 11 × 18 "
" 9 × 23 "

రేటు పూర్తిపేజీ రు 250/-
అరపేజీ ... రు 125/-

**ప్రత్యేక స్థలమునకు 20% అదనము**

అడ్వర్టైజమెంటు మేటరుతో, దాని రేటు సొమ్మును డిమాండ్ డ్రాఫ్టుద్వారా, అక్టోబరు 5 వ తేదీ లోపల ఆఫీసుకు అందునట్లు ప్రకటనదార్లు పంపవలెను

*** వ్యాపార అభివృద్ధికి యువ దీపావళి సంచిక అపూర్వ సాధనము **

యువ ఆఫీసు
పో.బా. నెం. 216, పబ్లిక్ గార్డెన్సు రోడ్
హైదరాబాద్-1

AKRUTI

ఏడవాల్సిన టైములో ఏడవాలనికూడా తెలీని బడుద్ధాయివి ఆత్మవంచన చేసుకోక పడుకోరా సన్యాసీ పడుకుని కుళ్ళుకలలు కను '

'అంతే నాకు చవటని మొద్దును అసమర్థపు... దాకొడుకుని. పడుకుంటాను; పడుకుని పాపిష్ఠినిద్ర పోతాను. చచ్చుకలలు కంటాను.' అతను, కళ్ళనుండి నీళ్ళు కారుతూండగా, వాటిని తుడుచుకుంటూ, మీదపడి కసిగా కరిచేస్తూన్న దోమల్ని తోలుకుంటూ మెల్లిగా ఎప్పటికో నిద్రలో పడ్డాడు.

పాపిష్ఠి నిద్ర — చచ్చు కలలు....

ఆ కలల్లో అతను వీరుడయాడు. రసికాగ్రేసరు డయాడు. అబ్బో ! ఏమి హాస్యం, చమత్కారం వొలకబోస్తున్నాడనీ ... 'అరె ! నేనా యింత దర్పంగా ప్రవర్తిస్తున్నది ? ఈ భూమ్మీద యిది ఎలా సంభవం దేవాదిదేవా ! యిది కల ! కాసేపటిలో చెదిరిపోతుంది. ఈ మధురదృశ్యం చెరిగిపోతుంది — చెరిగిపోయే లోపలే... వెళ్ళు ... నీ అనుభవం పూర్తి కానియ్యి.'

కాని మధ్యలోనే కరిగింది కల. కాసేపు తిట్టుకున్నాడు, తిమురుకున్నాడు. గది తలుపులు వేసివున్నాయేమో చూద్దామని లేచివెళ్ళి వసారా అంచువరకూ నడిచి, ఓకాలు ఎత్తాక అప్పు డది గది కాదని గ్రహించి, క్రింద పడకుండా ఎలానో బ్యాలెన్స్ చేసి తప్పించుకుని తడబడుతున్న కాళ్ళతో వెనక్కివచ్చి పడుకున్నాడు. గుండెదడ వచ్చింది. దాహం వేసినట్లయింది. మంచినీళ్లు గదిలోవున్నాయి. ఆవిడ తలుపులు వేసుకుని పడుకుంది. తలుపు తడితే ఏమనుకుంటుందో! తనని అపార్థం చేసుకుంటుంది. 'మీరు చాలా మంచివా రనుకున్నాను. ఛీ యిలాంటి అల్పులా ?' అంటుంది. ఉహుం, అలా అనదు. 'అల్పుడివా ?' ఉహుం, అలాకూడా అనదు. 'ను వ్వెంత అల్పుడివిరా ?' అంటుంది. అందుకని — దాహం వేస్తే వెయ్యనీ — తను తలుపు తట్టకూడదు.

భేష్ ! ఇది మంచిపని. నేను మంచిపని చేశాను; నేనిహ పడుకుంటాను. అన్నట్లు తలుపు గడియ వేశానా ? ఏమో అనుమానంగావుంది, చూద్దాం.

లేవబోయాడు. సగంవరకూ లేచాడు. 'ఓహో ! యిది వసారాగా !' ఎవరూ చూడటల్లేదు కదా అని ఒకసారి అటూ యిటూ చూసి పడుకున్నాడు. 'దాహం వేస్తోంది. మంచినీళ్ళుంటే బాగుండును. గదితలుపు తడదామా ?' '...అల్పుడివిరా' అంటుంది.'... 'అన్నట్లు తలుపులు వేశానా !'

* * * * *

తర్వాత జరిగిన కథ క్లుప్తమైనది- ఆమె ఉదయమే నిద్ర మేలుకుంది భూమ్మీద మొదటి సూర్యకిరణం వొచ్చి తాకినట్లు అతను అనుభూతి పొందాడు

ఆమె రెండునిమిషాల్లో తయారై సెలవు తీసుకుంటానంది. అతను జగన్నాథపురం దాకా సాయం వస్తానన్నాడు, అత్యంత వినయంగా ముఖంపెట్టి. ఆమె 'అఖ్ఖర్లేదు థ్యాంక్స్' అంది. రిక్షా ఎక్కి వెళ్ళిపోయింది. 'మళ్ళీ కనిపిస్తారా అని అడగలేదు నేను ?' అని అతను విచారించాడు. 'ఇంటర్వ్యూ విషయం తెలియపర్చండి అని అడిగితే మర్యాద, సంస్కారం వుట్టిపడేది అనుకున్నాడు. నిట్టూర్చి గదిలోకి వచ్చి ఓ గంటసేపు ఆలోచించాడు.

కాని యీ సంఘటన ఎవరికైనా చెప్పుకుని ఆనందించాలని అతని మనసు ఉవ్విళ్లూరుతూంది. ఈ సంఘటనలో తెలియరాని గొప్పతనం వున్నట్లు అతనికి చీటికీ మాటికీ స్ఫురిస్తోంది.

మధ్యాహ్నం విరామసమయంలో ఒక్కడూ కూర్చుని ఆలోచనా సముద్రంలో మునిగివుంటే సంజీవరావు వచ్చి పలకరించాడు – "ఏమిటోయ్! నీలో నువ్వే పొంగిపోతున్నావు," అంటూ.

మృత్యుంజయరావుకు గొప్ప ఆధారం లభించిందన్న ఊహ కలిగి, సంతోషంతో భుజా లెగురేశాడు. "సంజీవరావు! రాత్రి గొప్ప సంఘటన జరిగిందోయి అన్నాడు గర్వంగా చూస్తూ.

సంజీవరావు 'నీ జీవితంలోకూడా గొప్పసంఘటన లుంటాయా ?' అన్నట్లు అతన్ని విచిత్రంగా చూస్తూ "ఏమిటోయి మహానుభావా అది ?" అన్నాడు.

ఆ చూపు అతడ్ని కాల్చినా పట్టించుకోనట్లు నిర్లక్ష్యం చేస్తూ "ఓ అందమైన యువతి, విద్యావతి రాత్రి నా గదికి వచ్చింది," అన్నాడు గర్వం నటిస్తూ.

సంజీవరావు ముఖంలో యీసారి ఆశ్చర్యం ద్యోతకమైంది. "చెప్పు చెప్పు," న్నాడు ఉత్సాహంగా.

మృత్యుంజయరావు తనకు తెలిసిన తెలుగుభాషను గుర్తు చేసుకున్నాడు. అందిన పదాలను ఏరుకున్నాడు. పూసగ్రుచినట్లు అంతా ఏకరువుపెట్టాడు.

అంతా విని సంజీవరావు ముఖం చిట్లించాడు. "ఛీ! నువ్వింత దద్దమ్మ వనుకోదోయి." అన్నాడు.

"ఏం ?" అన్నాడు మృత్యుంజయరావు బిక్కమొహంవేసి.

"అలాంటి అవకాశం దొరికితే ఎవరన్నా విడిచిపెడతారా ? ఎందుకూ నీ యవ్వనము ? కాల్చనా ? నేనైతే ఆస్థితిలో ఏం చేసేవాడినో తెలుసునా ?"

"ఏం చేసేవాడివి ?" అనడిగాడు ఉత్కంఠగా.

"ఆమెను నా స్వంతం చేసుకునేవాడిని." (సశేషం)

Printed and Published by Sri A. Sudhakar Rao for Yuva Concerns
at Yuva Press, Hyderabad-1. Telephones 36336 Press 34400.
Controlling Editor: Sri "CHAKRAPANI"

